# కాళిదాస కవిత

ఆంగ్లమూలము

శ్రీ అరవిందులు : శ్రీ రవీంద్రులు

తెనుఁగు రచన

బొడ్డుపల్లి పురుషోత్తము, యం. ఏ.,

గిరిజా ప్రచురణలు

బాపట్ల :: చీరాల

౧౯౫౭

# మున్నుడి

శ్రీ అరవిందుల 'కాళిదాస' ను పుస్తకద్వయమును తెనుఁగుచేసి ప్రచురించుకొనుట కుదారతతో అనుమతించిన శ్రీ మాతృశ్రీ గారికి, ఆశ్రమ కార్యదర్శిగారికి నా వినయ పూర్వకాభివందనములు.

ఇందలి వ్యాసములను ప్రచురించి ఆంధ్ర సహృదయ లోకమున కందించిన భారతి సంపాదకులు శ్రీ శివలెంక శంభుప్రసాద్ గారికి, వారి సహాయ సంపాదక సమితికి; కృష్ణా పత్రిక; ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక; అర్క; శారద పత్రికా సంపాదకులకు నా నమస్కృతులు.

ఇందు శీలచిత్రణ మను వ్యాసమునందు మహామహో పాధ్యాయ శ్రీ వేదము వేంకటరాయ శాస్త్రిగారి పద్యములను, పద్యపాదములను స్వేచ్ఛగా నుపయోగించుకొంటిని. ఆ మహోదయునకు నా అంజలులు.

దీనిని శ్రద్ధతో ముద్రించిన విజయ భారతీ ప్రెస్సువారి నభినందింతును.

రచయిత.

# నవమాలిక

## అరవింద ప్రవచనము



## రవీంద్ర ప్రవచనము

# కైవారము

కవిరాజ హంసమా!
భవభావ రూపమా!!
దివ్యలోకము నీదు
కావ్య లోకము మాకు॥

లలితకళ లన్నియును
తలయొగ్గె నీకైత
వివిధమౌ శాస్త్రాలు
సవిధేయమై మెలఁగె॥కవిరాజ

నిశితమౌ నీ మేధ
విశదమౌ నీయెడద
శివపార్వతుల వోలె
చివరి శిఖరంబెక్కె ॥కవిరాజ..

నీ హస్తతలమందె
సాహిత్య మొక కళగ
శక్తి సంపుల్లమై
రక్తి గాంచినదయ్యా!! ॥కవి..

కాళిదాసుడ వీవు
కళ నీకు దాసియౌ
ఇలలోన నిటువంటి
కలయికే కనరాదు ॥కవిరాజ..

నీ కళా గోపనము
మాకు విదితము సేయ
మల్లినాథుఁడవుగా
మఱల జన్మించితివి ॥ కవిరాజ

ఇతిహాసములతోడ
హితము గూర్చిన ఋషులె
కావ్యామృతము పంచ
కాళిదాసైనారు ॥కవిరాజ..

దృశ్యకావ్యమ్ములో
శ్రవ్య కావ్య ప్రతిభ
శ్రవ్య కావ్యమ్ములో
దృశ్యకావ్యపు శోభ
ప్రకటించు పటిమమ్ము
సకలమ్ము నీదెగా ॥కవిరాజ...

ప్రతి శ్లోకమే కాదు
ప్రతి పదమ్మును గూడ
అపవర్గ సౌఖ్యమ్ము
నపకృష్టమొనరించు ||కవిరాజ..

రస సిద్ధుడవు నీవు
రస ముగ్ధులము మేము
నీ యశః కాయమ్మె
జయపతాకముమాకు ||కవి...

ఎందు జన్మించితివో ?
ఎందు మరణించితివో ?
మా కెందు కీ గోల
కావ్యరసమును గ్రోల ||కవి..

"భీకర గభీరమహా
లోకాంబునిధిత్రచ్చి
హాలాహలము మ్రింగి
అమృత మందించితివి" ||కవి..

ప్రాజ్య కవితా మహా
రాజ్యమేలగ జాలు
సమ్రాట్టు వొక్కఁడవె
నమ్రమహా నతులివే !! ||కవిరాజ...



# అంజలి

అరవిందమా - అరు
ణారవిందమ !!
అందుకొను మా
వందనము ॥అర॥

అభ్యుదయ మీ యర్కకాంతులు
శుభ్రమైనవి యభ్రవీధులు
సుందరం బీ సుప్రభాతము
అందగించెను హృదయ మందిరమే ॥అర॥

శాంత సరసిని నిల్చి నీ హృ
త్కాంతు లాశాంతమ్ము బంచుచు
మౌనముద్రను ప్రబోధింతువు
జ్ఞానసకలము తనివి తీరంగన్ ॥అర॥

నీ వికాసము నిండి జగతిని
నవవికాసము కల్గజేసెను
అమృతమైనవి మా మనస్సులు
వివృతమైనవి మాదు హృదయమ్ముల్ ॥అర॥

౧

కవికుల సార్వభౌముని
యఖండ కళాప్రతిభా సముజ్జ్వల
త్ప్రవిమల భావసంపదల
పార మెఱింగి సమాధి నిష్ఠలో
ప్రవచనకున్ ప్రవర్తిలిన
వాగ్మికి ఆ యరవింద యోగికిన్
వివృత మనోముదమ్మున
ననేక నమస్కృతు లందఁ జేసెదన్॥

౨

ఆ యరవిందయోగి మహి
మాన్విత దివ్యవచస్సమూహముల్
నా యెద నాక్రమించి, నను
నాఁటికి నాఁటికి తెన్గుబాసలో
తీయగ బల్కుమీ యని
పదేపది ప్రేరణసేయ, దాన నే
నీ యనువాదకావ్యము
ఘటించితి, ఆశ్రమ మోద మందితిన్॥

# కృతి సమర్పణము

కృతిభర్త
'విద్యాపోషక'
శ్రీ పూటుకూరి రామయ్య శ్రేష్ఠివర్యులు
(ఆంధ్ర యూనివర్సిటీ సెనేటు సభ్యులు)

౧

'సప్తసంతానములలోఁ బ్రశస్తిఁ గాంచి
ఖిలము గాకుండునది ధాత్రి కృతి' యటన్న
ఆంధ్రభోజుని సందేశ మాదరించి
కృతిపతిత్వ మిదే స్వీకరింపు మార్య ! !

౨

విద్యే మానవజాతి జీవితములన్
వెల్గుం బ్రసాదించి, సా
హృద్యంబైన వివేక సంపదల
స్థాయిం గూర్చున న్భావనన్
విద్యాబుద్ధు లొసంగు సంస్థకయి
యీవిం జూప, మిమ్మా ప్రజల్
'విద్యాపోషక' రామయార్య ! యనుచున్
వేనోళ్ల కీర్తింపరే.

౩

రాముని దివ్యనామ మవి
రామముగా జపియించి, మోక్షపుం
ధామముఁ జేరు భక్తుల వి
ధమ్మున, నున్నత విద్య కోరుచో
నీ మహనీయ నామము న
నేకులు భక్తి స్మరించుచుందురో
రామయ !! పూటుకూరి కుల
రమ్యపయోనిధి పూర్ణచంద్రమా !!

౪

ఎన్నో దాన విశిష్టధర్మముల
మీ రీ విశ్వకళ్యాణమున్
కన్నారంగను ధన్యజీవులని
మత్కావ్యమ్ము తా మోజుతో
నిన్నుం జేరి సుఖింప నెంచినది;
దీని న్మీరు ప్రేమమ్మునన్
మన్నింపందగు; నిద్దియార్య జన
సంభావ్యమ్ము శ్రీరామయా !!

౫

రజనీకాంత మనోహరాకృతికి తా
ప్రాపైన నెమ్మోముతో
ప్రజలన్ రంజిలఁజేసి, వారియెదలన్
పాలించు సౌభాగ్యమున్

సుజనత్వమ్మును సౌహార్దత్వమును
 సంశోభించు చారిత్రమే
విజయుం జేసెను మిమ్ము; ధన్యుఁడ
 వయా! విజ్ఞాన విశ్వంభరా.

౬

శ్రేష్ఠిత్వమ్మది సీకె చెల్లెననుచున్
 జెప్పంగనౌ కాదె; యు
త్కృష్టమ్మైన యుదారవర్తనము
 దాక్షిణ్యాత్వ సంపత్తియున్
నిష్ఠాదక్షతఁగాంచి యీ ప్రజలు
 నిన్నే పెద్దమన్నించుచో
శ్రేష్ఠీ! రామయ!! కైకొనందగు
 మహర్షి ప్రోక్త కావ్యమ్మిదే!!

౭

శాంతము శౌచమున్ హృది
 రసార్ద్రితగల్గిన మిమ్ముగాంచి, నా
స్వాంతము స్వాదుభావ వివ
 శమ్మున నంజలి గూర్చు; దీని క
త్యంతము శాశ్వతమ్మగు
 విధానము యోజన చేసిచేసి, నా
కెంతయుఁ బ్రీతిగూర్చు కృతి
 నిచ్చుట యుక్తమటంచు నెంచితిన్

౮

అద్ది మీ యాదరమ్మున నాంధ్రజనుల
కఖిల సమ్మోదదాయిని యగునుగాత !!
సకల జనతా ప్రమోదక సచ్చరిత్ర ! !
రమ్య సారస్వత ప్రియ ! రామయార్య !

౯

వందజనులయందు ప్రభవించు వీరుండు ;
పదియునూర్లఁ బుట్టు పండితుండు;
శతసహస్రమందు సంభవించును వక్త;
దాత పుట్టు నూత్న నూతనముగ.

౧౦

అట్టి దాతగ మీరు ప్రఖ్యాతిగాంచి
యందుకొన్నారు గౌరవార్హతల నెన్నొ;
ఆంధ్ర విశ్వవిద్యాలయాధ్యక్షు డిపుడు
మోదమంది 'సెనేటు' సభ్యులుగఁ జేసె.

*　　　*　　　*

ఆయు రారోగ్యములగూర్చి యా విధాత
మిమ్ము కాపాడు ! లోకహితమ్ముగూర్ప ॥

# కాళిదాస కవిత

## ౧

## కవిత్రయము

### వాల్మీకి - వ్యాస - కాళిదాసులు

ప్రాచీన భారతీయ సంస్కృతి చరిత్ర, ముగ్గురు పుణ్యమూర్తులుగా మూర్తీభవించినది. వారే వాల్మీకి, వ్యాస, కాళిదాసులు. ఇతర చారిత్రకాధారములేవి నశించినను, ఈ త్రిమూర్తుల కావ్యములు భారతీయ సాంస్కృతిక సమగ్రచరిత్రను మనకు బ్రసాదింపఁగలవు. వీరి కావ్యములు మూఁడు మహాయుగములకుఁ బ్రాతినిధ్యము వహించును. మూఁడు సోపానములుగా నభివృద్ధిగాంచిన ఆర్య మానవ నాగరక చరిత్ర నివి ప్రతిబింబించును. అందు ప్రథమ సోపానము ప్రధానముగా ధార్మికమైనది. ద్వితీయ సోపానము మేధోద్దీపితమైనది. తృతీయ సోపానము రస సంపద్విలసితమైనది. ఇఁక నాల్గవ సోపానము నొకటి గలదు. అది అధ్యాత్మికమైనది. మానవాంతరంగములను వికసింపఁజేసి వ్యవస్థీకరించునది. అట్టి యీ దశ పై మూఁడు దశలకు నాంతరంగిక శక్తిసామర్థ్యములను బ్రసాదించి పుష్టిమంతముగావించునది. అందుచే నిదియొక ప్రత్యేకస్థాయిలో నిలిచి వర్థిల్లక, మానవున కన్ని దిశలయందును, దశలయందును చుక్కాని పట్టుచు, నాగరికునిగాఁ దీర్చిదిద్దెను.

పై మూఁడు దశలును విశిష్ట కవితాశక్తి సముత్ఫుల్లములు. ఈ దశలలోని వాఙ్మయము తమ తమ యుగధర్మములను ప్రతిబింబించును. అందుచే నీ కవిత్రయము మానవ సాంస్కృతిక చరిత్ర యందు దఖండస్థానము నాక్రమించెను. అందుచే వీరు 'హోమరు'[1] 'షేక్స్పియరు'[2] 'డాంటే'[3] మున్నగు పాశ్చాత్య కవి పుంగవుల కగ్రతస్సరులుగా గౌరవింపఁబడుచున్నారు.

## వ్యాస వాల్మీకులు

రామాయణమహాకావ్యమొక ఆదర్శ సంఘమును ప్రతిబింబించును. అట్లని అదియొక కాల్పనిక గాథయని భావింప రాదు. ఆదర్శోపేతమగు సంఘమే వాల్మీకిచే రామాయణ కావ్యమున మఱింత ఆదర్శముగాఁ దీర్చిదిద్దఁబడినది. ఏ కవీశ్వరుఁడు కాని హఠాత్తుగా నట్టి యుత్తమ సంఘము నెట్టి యాధారమును లేక తన కావ్యమున నిరూపింపఁజాలఁడు. ఒక వేళ యట్టి కల్పన కే కవీశ్వరుఁడు గడంగినను, ఏదో యొక ఘట్టమున అనౌచిత్యము పాలుగాక తప్పదు. ఈ సందర్భమున వాల్మీకి కాలమును గూర్చియు, రామాయణ కర్తృత్వమును గూర్చియు చర్చింప పనిలేదు. ఏ దెట్లున్నను, ఒక్క ఉత్తర కాండను పరిహరించిన, మిగిలిన రామాయణ మహాకావ్య మంతయు నొక్క వ్యక్తిచే శక్తిమంతముగా రచింపఁబడెనని కనులు మూసికొని తీర్మానింపవచ్చును. రామాయణము భారతేతిహాస రచనకు పూర్వమందు రచింపఁబడినదా? పరమందునా? అని సందేహించువారును గలరు. భారతముకన్న

రామాయణము నందలి కవిత్వము పచేళిమమైనది. అందు వలననే ఈ సందేహ ముద్భూతమైనది. ఒక్క కవిత్వమే కాదు; సంస్కృతియు భారతమునందు కన్న రామాయణమునందు చక్కని పరిపాకమున నున్నట్లు గోచరించును. అంతమాత్ర మున పూర్వాపరములను నిర్ణయింపరాదు. భారతమునందు వలె రామాయణమున మానవత్వ మభివృద్ధిఁగాంచలేదు. భారతమునందువలె, రామాయణమున మానవమేధ సంక్లిష్టమై విశిష్ట గమనము నందలేదు. రామాయణ భారతేతిహాస ములను తులనాత్మకముగ పరీక్షించిన, వాల్మీకి మహర్షినాఁటి సాంఘిక రాజకీయ వాతావరణము, వ్యాస మహర్షినాఁటి సాంఘిక రాజకీయ వాతావరణముకన్న భిన్నమనుట స్పష్టము. వ్యాసుని కాలము విప్లవోజ్జ్వల మైనది, రాజకీయ నిరంకుశ దౌర్జన్యము, క్షత్రియ భుజబల దర్పముచే నేర్పఱుపఁ బడిన నీతి శాస్త్రము, ఆ కాలమున ప్రాబల్యము వహించెను. భార తములోని శిశుపాలపాత్ర, ఆ నాఁటి విప్లవోన్ముఖమానవ స్వభావమునకు ప్రతినిధియనవగును. భారతేతిహాస కాలము నాఁటి నీతి, యొకరీతి నేర్పడినదికాదు. అది నిరంకుశముగ స్వైరవిహార మొనర్చినది. స్త్రీపట్ల ఆ నాఁటి పురుషస్వభావ మెంతో పరుషముగను, హింసాయుతముగను నుండెడిది. వాల్మీకి కాలమునందలి పరిస్థితులిట్టివి కావు. (అవి యింతకన్న మృదులములు: భావాత్మకములు; సున్నితములు; నిర్మల ములు నన నగును. క్రూరమును, దుష్టమును, అరాజకమును నగు కొన్ని విపరీత పరిస్థితులను వాల్మీకి సానుభూతితో తిల కించి సమన్వయించెను.) వాల్మీకి కవితాత్మ విశ్వజనీనమైనది.

స్వచ్ఛందమగు భావోద్వేగముతో కూడినది. అందుచే నాతఁడు తన కాల పరిస్థితులను ఉన్నదున్నట్లు చిత్రించుట కిష్టపడలేదు. దానిని తన మధుర హస్తముతో నాదర్శ రామణీయకముగ తీర్చి దిద్ది జాతీయ ప్రతిష్ఠా సంరక్షకుఁడుగను, ఆదర్శకవిపుంగవుఁడుగను మన మన్ననల నందుకొన్నాఁడు వాల్మీకి. ద్వివిధములగు దృక్పథముల నాతఁడు తన కావ్యమునఁ బ్రదర్శించెను. ఒకటి ధార్మిక దృక్పథము. ఇది ఆధ్యాత్మిక సంస్కృతీ విలసితము. సత్త్వసంఫుల్లమగు మానవ స్వభావోల్ల సితము. రెండవది అధర్మోద్దీపిత మైనది. నిరంకుశ భోగ పరాయణత్వము దీని ముఖ్య లక్షణము. రాజసిక దౌష్ట్య ముతోఁ గూడిన మానవ స్వభావమిది. ఇట్టి భావ వైరుధ్య మును వాల్మీకి తన రామాయణ కావ్యమున బహురమణీయ ముగఁ బ్రదర్శించెను. అందుచే నీ మహోత్కృష్ట కావ్య ప్రభావమునకు లోనైన ఏ వ్యక్తిగాని, ప్రపంచ వాఙ్మయ ములలో నే యితర కావ్యమును చేఁబట్టియు, తత్తుల్యమగు రసచర్వణమునుచేయఁజాలఁడని నిస్సంకోచముగ చెప్పవచ్చును.

వాల్మీకిసృజించిన పాత్రలు భావోద్రేకపూరితములైనవి. భారత పాత్రలు మానసిక విశ్వాస సంజనితములు. రాము నిలో నైతికోత్సాహ మధికము, రావణునిలో అవినీత్యుత్సాహ మధికము. భౌతిక సుఖసంపదల కాశింపక, ఎట్టి తీవ్ర పరిణామము లకును నవకాశ మీయక, విశ్వజనీనములగు నైతిక సిద్ధాంత ములకు శ్రీరాముఁడాచరణమునందు ప్రాణము పోసెను. ఇట్టి నాన్యతోదర్శనీయమగు పాత్ర సృష్టిచే వాల్మీకి విశ్వజనీన కవితాజనకుఁడుగా గౌరవభాజనుఁడగుచున్నాఁడు. అట్టి యా

కవీశ్వరుఁడు, హింసాతత్త్వమునకు ప్రాతిపదికమై, నైతిక నాగరకతోల్లసితమగు యుగమునకు యుగకర్తగా పరిగణింపఁ బడును.

ఇఁక భారతేతిహాసకర్త, నిరంకుశోన్మాదమగు యుగమునకుఁ జెందినవాఁడు. భారతేతిహాస మనేక చారిత్రకాధారములకు స్థానము. వివిధ నిరంకుశ ప్రభుత్వ విధానములకు, సాంఘిక వ్యవస్థలకు నా కాలము ఆలవాలము. వివిధ ప్రభుత్వముల నొకే యొక కేంద్రపరిపాలనమునకుఁ దీసికొని రావలయు నను క్షత్రియవీరుని ప్రయత్నము లిందు ప్రబలముగా ప్రత్యక్షమౌను. తన భారతేతిహాసమున వ్యాసుఁడు తత్ కాల పరిస్థితులను స్పష్టముగఁ జిత్రించెను. వాల్మీకి యట్లు గావింప లేదు. తన కాలపరిస్థితులను సమీక్షించుచునే వాని నాదర్శోపేతముగ సవదరించినాఁడు. వాల్మీకి స్వేచ్ఛాపూరితుఁ డగు ఆదర్శవాదియగునేని, వ్యాసుఁ డభ్యుదయోపేతమగు వాస్తవికవాది. స్వైరవిహారము గావించుచున్న సాంఘిక నీతి నియమములను తిరస్కరింపక వ్యాసుఁడు వానికొక సామరస్యమును గూర్చుటకై ప్రయత్నించెను. అట్టి సాంఘిక ప్రవర్తనము నాతఁడు 'నిష్కామకర్మ' మార్గమున పూతమొనర్చి, ఆచరణయోగ్యము గావించెను.

ఈ అన్నింటికన్న నెన్నదగిన దాతని యసాధారణ మేధాసామర్థ్యము. అది భావ ప్రఫుల్లమైనది. అనేక నైతిక క్లిష్టగ్రంథుల నవలీలగా విడదీయగలది. వాల్మీకి స్వభావము వలె వ్యాసుని స్వభావము కుసుమ కోమల సదృశమైనది కాదు.

వ్యాసుఁ డనేక క్లిష్ట పరిస్థితులయందు నీతికి ఒరపిడి గల్గించును. తన ప్రజ్ఞాప్రాభవముచే సాధారణ నైతిక స్థాయి నతిక్రమించి అసాధారణ నైతిక స్థితి నేర్పఱుపఁగలఁడు. ప్రభుత్వమును, ప్రజను, ఒక రాజనీతి ధురంధరుఁడుగా సమీక్షింప గలఁడు. అతఁడు స్పృశింపని విషయముండదు. ఏ విషయమును ఆతఁడు చర్చించినను, ఆతని స్వోపజ్ఞ చేతను, తపశ్చరణచేతను, పవిత్ర దర్శయిత్రు ప్రభావముచేతను దానికొక సమగ్రతను, చారితార్థ్యమును ప్రసాదించును. ఈ అన్ని విషయములందును వ్యాసుఁడు తత్కాల నాగరకోపేత జీవితమును ప్రతిబింబించుచునే యుండును.

మహాభారతములోని పాత్ర లన్నింటిలోను విస్పష్టముగా గోచరించునది వ్యాసుని మేధాసంపదయే. పాత్రల ప్రతి చర్యయు భావనా ప్రేరణముచే నేర్పడినది. ఇట్టి భావ ప్రేరణము రామాయణము నందును గొంత కానవగును. కాని రామాయణ కాలమొక ఆదర్శయుగము. శాంతి సంస్థాపనా లక్ష్య మా కాలమం దధికము.

## కాళిదాస మహాకవి

వాల్మీకి వ్యాసుల యనంతరము, వేయి సంవత్సరములు పైఁబడిన పిమ్మట, జాతీయభావ విలసితుఁడగు కాళిదాసు మహోదయము జరిగెను. వాల్మీకి వ్యాసులు ప్రతిబింబించిన నాగరకతలకును, ఈ కవీశ్వరుఁడు ప్రతిబింబించిన నాగరకతకును, అజగజ భేదము గలదు. నీరసమగు బౌద్ధమత

విధానమును బ్రతిఘటించి, ప్రజలు రసిక జీవిత విధానమును గాఢముగ వలచిన కాలమది. ప్రజా హృదయములలో జాతీయాభిమానము పెల్లుబికిన సమయ మది. సమస్తశాస్త్ర క్రోడీకరణమును ఆ కాలమందే జరిగెను. కవులు, మహా కవులు,పండితులు, భాషావేత్తలు, నైఘంటికులు, వేదాంతులు, తార్కికులు నిత్యోత్సాహ విలసితులై, యానంద జీవిత యాత్ర సాగించినారా కాలమున. సమస్త ప్రజానీకమునందును రసోద్రేకము వెల్లువలై బాఱినది. వాస్తవిక జీవితభోగానుభవా సక్తి, నిరంతర సౌందర్యదిదృక్ష, ఆబాలగోపాలమునం దావే శించెను. చిత్రలేఖనము, శిల్పము, సంగీతము, నృత్యము, నాట్యము, ఆరామనిర్మాణము, మున్నగు ననేకకళలు, శాస్త్ర సమ్మతమగు సంపూర్ణత్వమును బడసినవి. మహానగరములు నిర్మింపఁబడినవి. గ్రీకు సంప్రదాయ లక్షణములు పొడగట్టినవి. ఇట్టి యుగలక్షణములు కొన్ని విలక్షణ గుణములతోఁ గూడినవి. ఇవి హఠాత్సంభవములు కావు. కాలపరిమాణమున పరిఢ విల్లినవి. ఇంతకు పూర్వమునను శాస్త్ర క్రోడీకరణము జరుగకపోలేదు. కళలు విలసిల్లకపోలేదు. భౌతిక సంపదభివృద్ధి జరుగకపోలేదు. రామాయణ మహాభారతముల యందు ప్రతి బింబించు భౌతిక సంపదకన్న, రఘువంశ మహాకావ్యమున ప్రతిబింబించు భౌతిక విభూతి బృహత్తరమైనది. ఇతిహాసము లందలి భౌతికైశ్వర్యము, ఉన్నత లక్ష్యముల కణఁగిమణఁగి యుండెను. ఈ కాలమున భౌతికైశ్వర్యమే అత్యున్నత స్థాన మలంకరించి, ప్రభుత్వము నెఱపుచుండెను. జాతీయ జీవశక్తు లన్నియు దత్పరిపోషణమునకే వినియుక్తములు. జాతీయ

జీవనముపై తన్నాగరకతా ముద్ర అచ్చు వడినది. ఒక ప్రక్క తత్వశాస్త్రము, కళలు, విజ్ఞానశాస్త్రములు వృద్ధి నందు చుండెను. మఱియొకవైపున శుష్క మేధా సంజనితమగు తర్క శాస్త్రము పెంపు వహించుచుండెను. మానవుఁడు ఇంద్రియ ములకు బానిసయై సంచరించుచుండెను. మతోద్రేకములు విచ్చలవిడిగా విహరించుచుండెను. ఇట్టి క్లిష్టపరిస్థితులు తల యెత్తుచున్న కాలముననే, కాళిదాస మహాకవి, సకలశక్తి సమన్వితుఁడై ఉజ్జయనీ నగరమునఁ బొడగాంచెను. ఆ యుగమునందలి సమగ్ర విద్యా సమృద్ధినంతయు నీ కవీశ్వ రుఁడు పుణికి పుచ్చుకొనియెను. ధనిక నిరంకుశోన్నత సంఘ మున స్వేచ్ఛగా సంచరించినాఁడు. భౌతిక భోగలాలసమగు జీవితమును గడపినాఁడు.

కాళిదాసునకు షేక్స్పియరు మహాకవిని గుర్తింపఁదగిన కొన్ని పోలికలుగలవు. అట్టివానిలో నెన్నఁదగినది తనకు సన్ని హితమగు భూతకాల చరిత్రను కావ్య వస్తువులుగా స్వీక రించుట. అప్పుడప్పుడు వర్తమాన విషయములు భవిష్య త్సూచనములుగా గావించుట మున్నగునవి. షేక్స్పియర్ వలెనే కాళిదాసు కూడ మత విషయముల నంతగా పాటింప లేదు. వేదాంతమే అతని మతము. శివార్చనమే యాతని మతనియమము. తన కాలమునందుగల ఈ సనాతన సంప్ర దాయ పూజా విధానములో కాళిదాసున కొక విధమగు రస మాధుర్యము లభించినది. అందువలననే యాతఁడా పూజా విధానమును ఆమోదించెను. నైతిక విషయములందును, కాళిదాసు సమకాలీన నీతిశాస్త్రములను ప్రమాణములుగా

స్వీకరించెను. కాని వ్యక్తిగతముగ నాతని కట్టి నియమ పాలన మున్నట్లు కనఁబడదు. కాళిదాసు పేరట నేఁడు వాడుకలోఁ గల జనశ్రుతుల నన్నింటిని మనము విశ్వసించుట అవివేకమగును. కాళిదాస కవితను దురభిమానరహితముగ నుపాసించు ఏ సారస్వత విద్యార్థియు తా నెట్టి నైతికనిష్ఠను సంపాదించినట్లు భావింపఁడు. కాళిదాసుకవిత్వ ముత్తమలక్ష్యముల యందును, ఉన్నతభావములందును గాఢానురక్తి గలది. కాని యీ యను రక్తి రసోల్లసితమైనది. ఆతఁడే విషయమును బ్రస్తావించినను, ప్రపంచించినను, దానిని తన మధుర హాస్తముతో రసప్లావిత మొనర్చును. సౌందర్యశోభలతోఁ దీర్చి దిద్దును. అందుచే కాళిదాసు కవిత్వము వాల్మీకి వ్యాసుల కవిత్వముకన్న భిన్నముగా గోచరించును. ధీరోచితమగు పాత్రల గంభీర స్వభావములను రసోచితముగ నవదరించుటే కాళిదాసు కవిత్వమున గల విశిష్టత. ఇందాతఁడు సమకాలీన భౌతిక నాగ రకతా సంపదనంతయుఁ బ్రతిబింబించును.

కవి యనువానికి చైతన్య శక్తి కావలయును. సాధారణ మానవచైతన్యము నాతఁడు చక్కగా వ్యక్తీకరింపవలయును. అట్లు వ్యక్తీకరింపఁ జాలని వాఁడు ఉత్తమ కవిశ్రేణికిఁ జెందఁడు. కాళిదాసు మహాకవి, ప్రజాచైతన్యమును రసభరితముగ వ్యక్తీకరింపఁగలఁడు. అందాతఁడు సర్వేంద్రియ సంతృప్తి నొనర్ప గలఁడు. ఆతని కవిత్వము రసానంద సౌందర్య సముద్దీపితము. ప్రతి కవిత్వాంశమును కళాత్మకముగ చెక్కుటలో నీతిని కీతఁడే సాటి. ఎట్టి ఛందస్సుగాని ఆతనికి వశముగాకుండ నుండదు. ఛందస్సును వశము గావించుకొనుటయే కాక,

దానిని పరాకాష్ఠ సౌందర్యస్థాయికి తీసికొని పోవుటలోను నాతఁ డద్వితీయుఁడు. వస్తుస్వరూప స్వభావములను కనులకు కట్టునట్లు చిత్రించు శిల్పమున సిద్ధహస్తుఁ డాతఁడు. ప్రబల దార్శనిక శక్తితో వర్ణనలను రసాత్మకముగ నిర్వహించు నైపుణ్యమాతనికి వెన్నతో నలవడినది. వర్ణరంజితము, రూప రంజితము, భావరంజితమునగు కవిత్వమే కాళిదాసు కవిత్వము. ఇం దాతఁడు పరిణత ప్రజ్ఞ వడసిన కళాతపస్వి. పచేళిమమగు భావములను, రమ్యాతిరమ్యముగ రచింపగల దక్షుఁడు. భాషార్ణవమును మథించి, ఛందోమృతభాండమును వెలార్చిన సారస్వత యోద్ధ. సంస్కృత శబ్దసౌధమును తన యత్యద్భుత శిల్పకళాకౌశల్యముతో నిర్మాణ మొనర్చిన ప్రప్రథమ మహా శిల్పి యాతఁడు. పుంఖానుపుంఖములుగా సాగిన సంస్కృత కావ్య నిర్మాణమంతయు నీతని నాధారముగాఁ జేసికొని జరిగినదియే. చక్కని కుదింపుకల్గి, రాజఠీవితో, శ్రుతిహితమై, భావానుకూలమగు ఛందస్సులో, పటుత్వ పదయోజనలో, ఇతిహాసశైలిని బోలి, యధికపద రహితమై, మధుర మంజుల మైన కాళిదాసు కవితాశైలి నాన్యతో దర్శనీయమైనది. ఇందలి గణనీయమైన ముఖ్య లక్షణము మార్దవము. ఈ కవితాశైలిని సులభముగా ఇతిహాసశైలిగను, భావకవితాశైలిగను, నాటక శైలిగను పరివర్తింపవచ్చును. అట్టి శక్తి మార్దవత్వముచే సంప్రాప్తమైనది. ఈ కవీశ్వరుడు ఇతిహాసశైలికి, ప్రబంధోచిత మగు శబ్దాతిశాయి సౌందర్య గాంభీర్యములను సంతరించెను. ఈతని నాటకీయశైలి, సంభాషణోచితమై, నిశితమై, యుద్వేగ పూరితమైనది.

# క వి త్ర య ము

ఇట్టి వరప్రసాద లబ్ధుఁడగు కాళిదాసునకు అతనికాలమున్న నాగరకత, మఱింత ప్రాభవమును సమకూర్చినవి. ఆతని వర్ణ నాత్మకమగు ప్రతిభకు మఱింత వన్నెఁ దెచ్చినవి. ఈ నాగరకత నిరంకుశమైనది. భౌతిక సుఖ భోగానురక్తిని, రసికతాభిరుచులను, ప్రాపంచిక విజ్ఞతను, విజ్ఞానమును, మేధను, బురస్కరించుకొని యీ నాగరకత యొక విధముగ యూరోపియను నాగరకతను దలపించును. 'పదునాలుగవ లూయీ'[4] కాలమందలి ఫ్రాంసుదేశ పరిస్థితుల వంటి పరిస్థితు లీ కాలమున గలవు. ఇవి మేధనో, భావమునో, సంతృప్తిపఱుచునవియే కాని ఆత్మసంతృప్తిని కలిగించునవికావు. అయినను మతమును నిరసించుట, ఆనాఁటి ప్రజలయభిరుచికి భిన్నమైనది. మతాభిమాన మున్నను, ఇంద్రియభోగానుభవ లాలసత్వము, అవినీతి ప్రవర్తనము, ప్రజాజీవితమున ప్రాబల్యము వహించినవి. ఆనాటి యాడంబరమైన న్యాయస్థానములు, సనాతన నైతిక మత సంప్రదాయములను బలపఱుచుచుండెను. అది కేవలము సనాతన సంప్రదాయాభిమాన మే. ఆ యభిమానము నొక విధముగా మూఢమైనదే యనవలయును. ఏలయన, ప్రజాజీవితమున వానికంత ప్రాబల్యములేదు. కాని రసాత్మకమగు కవిత్వాది కళలయందు గల ఉత్తమాదర్శములు సంప్రదాయ సమ్మతము లైనవే. వానిని రసజ్ఞతతో కాంతాసమ్మితముగఁ జెప్పిన ప్రజ లుల్లాసముగా స్వీకరించెడివారు. వారి సహృదయత యట్టిది. కాని నైతికాదర్శములు పూర్వముకన్న పటువు తప్పెను. స్త్రీ, పురుష, విచక్షణ లేకయే స్వేచ్ఛగా మద్యమును సేవించుట నాగరక లక్షణ మాయెను. పూతమగు జీవిత నిర్వా

హాణమునందు గౌరవ మెన్నఁటికినీలేదు. అయినను ఉత్తమ శ్రేణికిఁ జెందిన హైందవ మహిళ తన ఏకపత్నీనియమ పాలనమును విడనాడు కొనలేదు. తన గృహారాజ్యమును విచ్ఛిన్న మొనర్చు కొనకుండ కాపాడుకొనుచునే వచ్చినదామె. రోము ఇటలీ దేశములందు వలె, భారత దేశమున పరిస్థితులంతగా విషమింప కుండుట మహాసుకృతమేయని తలంపక తప్పదు. సనాతనాధ్యాత్మిక భావము లీ కాలమున కేవలము మూలమట్టముగ నశించిన వనుకొనరాదు. అవి నివురుగప్పిన నిప్పువలె జాతి యంతరంగముల యందణఁగియున్నవి. ప్రబల సనాతన సదాచారములు సిద్ధాంతములుగా అట్లే నిలిచియున్నవి. కాళిదాసు వానిని తన కావ్యములలో కాంతా సమ్మితముగ నందించినాఁడు. విపరీతమగు ప్రవృత్తి భోగానురక్తి, విపరీతమగు నివృత్తిభోగానురక్తి ఏక కాలమున వర్ధిల్లినకాలమది. భారతీయులు ఇంద్రియ సుఖములనుభవించు చున్నను, వానికి దాసోఽహమను ప్రవృత్తికలవారు కారు. అందువలననే నివృత్తి మార్గము కడకు వారికి శరణ్యమైనది. భర్తృహరి కాలమున కీ మార్పురానే వచ్చినది. అది యట్లుంతము.

కాళిదాసు కవితా కళోత్కర్ష తదనుకూలమగు వాతావరణమున వెల్లివిరిసినది. శిల్ప, చిత్రలేఖనాది కళలు బాహ్య సౌందర్యమును బరిపోషించుచుండెను. ప్రకృతి సౌందర్యాభినందన, పర్వతారణ్యముల ప్రభావము, నదీనద కాసార ప్రశాంత వాతావరణ రామణీయకము, పశుపక్ష్యాదుల యందచందములు, సమకాలీన జీవితమునందు భాగస్వాములైనవి. తత్కారణముచే, కాళిదాసు కవిత్వమునందును నివి యాన

హించి ద్విగుణీ కృత సౌందర్య శోభనాపాదించినవి. కాళిదాసు కవిత్వము సర్వేంద్రియ సంతర్పణము గావించుచు, ఉన్నత భావశిఖరముల నధిష్ఠింపజేయుట కిదియొక ముఖ్యకారణము. భావోద్రిక్త మేధాసంజనితమైన కాళిదాసుని ఏవం విధ కవితా ప్రసూన మధువృష్టి, సహృదయ మధువ్రతములకు ఆమని విందాయెను. ఆతని కావ్యలోకము, సకల సౌందర్య వస్తు సమృద్ధమగు భూతల స్వర్గధామము. రమణీయమగు ధ్వని మార్గమున నిందు నీతిబోధ జరిగినది. మేధాశక్తి సౌందర్యావరణము నతిక్రమింపలేదు. నీరసత్వ మనునది యెందును వేయి కాగడాలు వేసి వెతికినను కానరాదు. ఇంద్రియ లోలుపత్వముగాని, నైతికపతనముగాని యీ కవీశ్వరుని కావ్యములలో గోచరింపదు. ఈతని కవిత్వము కేవల ప్రబంధ కవితా మార్గమున నడచి అవయవ వర్ణనమునందే సంతృప్తి జెందలేదు. తన నిర్నిద్ర కళాచణత్వముచేతను, అల్పాక్షర అనల్పార్థ రచనా నైపుణ్యముచేతను, నిశిత శబ్దశక్తి సామర్థ్యముచేతను, అనుపమ కవితాశైలీ మాధుర్యముచేతను, కాళిదాసు, కవితా విహాయసవీధిని ధ్రువతారయై వెలుగొందెను. ఇట్టి మహత్తర గుణోపేతుఁడగుటచేతనే, ప్రబంధోచితమగు నవలక్షణము లాతని నాక్రమింపలేదు.

రామాయణ మహాభారతము లందలి పాత్రలవలె, కాళిదాస విరచిత కావ్యములందలి పాత్రములు సజీవము లైనవి. వాని సంభాషణములు పఠితల హృదయములను కదలింపగలవి. భారతీయులు తమ ఆధ్యాత్మిక సంపదలను గోలుపోయి, నీరసస్థితిలో పడియున్న సమయమున, కాళిదాస

కవీంద్రుడు, వారి హృదయ కేదారములయందు రసఘనులను బ్రవహింపజేసి దివ్యభావ సస్యములను బండించినాఁడు, ఆత్మకు, పరమాత్మకు, ప్రేయసీ ప్రియుల సంబంధమును వైష్ణవ పురాణములా నాఁడు ప్రచార మొనర్చినవి. ఇట్లే శైవమతమునందు తాంత్రిక విధానము విశేషవ్యాప్తియందుండెను. పురుష, ప్రకృతి భావము- (ఈశ్వరుఁడు పురుషుఁడనియు, శక్తి ప్రకృతియనియు) వివిధపురాణగాథలు వ్యాప్తిలోనికి వచ్చెను. కాళిదాసు వానిని కావ్యవస్తువులు గావించుకొనెను. ఆంగ్ల వాఙ్మయమునందలి 'మిల్టను'[5] కవీశ్వరుని 'పారడైజ్ లాస్టు'[6] సంస్కృత వాఙ్మయమున కుమారసంభవమును బోలినది. కుమార సంభవము తత్కాలమున వెలసినట్టి యత్యద్భుత మహాకావ్యము. ఇందలి కేంద్రభావము శివపార్వతుల వివాహము. అనగా సృష్టికి కారణభూతమగు ప్రకృతి పురుషుల కలయిక. పార్వతి శివు నారాధించు వర్ణనలో ప్రకృతి, పురుషు నన్వేషించు పరమార్గము గోచరించును. కాళిదాస యుగము నందలి నాగరకతా స్వభావ ప్రభావ మీ కవీశ్వరుని ఏతన్మహాకావ్య సృష్టికి-కారణభూత మైనది. ఆ యుగమునందలి కాళిదాసీయ సమకాలీన కవులకు, ఆయుగలక్షణము లన్నియు ప్రతిబింబింపఁ జేయు కావ్యనిర్మాణ దక్షతలేదు. అట్టి దక్షతగల మహాకవి కాళిదాసుఁ డొక్కడే. అందుచే అతఁడొక్కఁడే ఆయుగమునకు సంపూర్ణ ప్రతినిధి. అందలి కీలకము లన్నియు గ్రహించిన వాఁడితఁ డొక్కఁడే! ఆ నాగరకతా స్వభావము ననుసరించి 'ఋతుసంహారము' తొలి కావ్యగానము. ఇందు ప్రౌఢమగు కవితా శిల్పమంతగా కానరాదు, 'మేఘసందేశ'

మొక వర్ణనాత్మక స్మృతికావ్యము. 'కుమార సంభవము' మతాదర్శములను వెలార్చు అలౌకిక కథా కథనము. 'రఘు వంశము' ఒక ఇతిహాసము. 'శాకుంతలా'ది రూపకములు తత్కాల నాటకీయ స్వరూపములు. వాల్మీకి నైతిక యుగ నాగరకతా ప్రతినిధి యైనట్లు, వ్యాసుడు మేధోజ్జ్వల నాగరక యుగ ప్రతినిధియైనట్లు, కాళిదాసు ఈ రీతిగా, బహుముఖ కావ్యరచనా కలాపముచే రసమయ నాగరకతా యుగమునకు ప్రతినిధి యనక తప్పదు.

నైతికము, బౌద్ధము (బుద్ధి సంబంధము) రసమయము నగు త్రివిధ నాగరికతల సమ్యక్సమ్మేళనముగా నొక నాల్గవ యుగము క్రమ పరిణామానుసారముగ నేర్పడవలసి యుండెను. కాని యట్లు జరగలేదు. అది మన దేశ దౌర్భాగ్యము. ఈ మూడును సజీవ సమ్మేళనము నంది ఆధ్యాత్మిక స్థాయినందు కొనుటయే భారత జాతీయ స్వరూపము. తత్సంబంధమగు యుగలక్షణములను కొన్నింటిని శంకరాచార్యుని యందు గాంచనగును. కాని యాతడు భారత జాతీయ జీవిత లక్షణముల నన్నింటిని పుణికిపుచ్చుకొనలేదు. అందుచే ఆ దశ వేరొక రీతిని పరిణమించినది. నాల్గవ యుగ పరిణామ లక్షణ ముల కంతరాయ మాదియందే జరిగెను. అందుచే మూడవ యుగ మనంతరము కూడ తత్సంబంధ మగు ఛాయలే మిగిలి పోయెను. శంకరుని కాలమున బొడసూపిన కతిపయ శుభ చిహ్నములు భారతీయుల ఆంతరంగిక జీవనమునకుఁ గొంత ప్రాణము పోసినవి. లేనిచో పాశ్చాత్యనాగరకతల వలెనే భారతీయ నాగరకతయు కాలగర్భమున నిద్రించెడిది. నేటికిని

భారతమాతలో జీవశక్తి యేమాత్రమైన నిల్చియున్నచో, ఇప్పటికిని ఆధ్యాత్మిక భావబీజము లీ పవిత్ర భూమిని మొలక లెత్తి వృద్ధిగాంచుచున్నవన్న దానికి కారణ భూతుఁడు 'కారణ జన్ముఁడగు' శంకర భగవత్పాదుఁడే! ఇప్పటి కైనను పాశ్చాత్య నాగరకతా వ్యామోహ పాశములనుండి విముక్తి జెంది భారత దేశము, విచ్ఛిన్నమైన తన సాంస్కృతిక మహా ప్రస్థానమును పునః ప్రారంభించి, యుగయుగములుగా తనకు సంప్రాప్తించిన జాతీయ గురుత్వమును కాపాడుకొనుగాక !

## ౨

# ఋతుసంహారము

## కావ్యసారము

ప్రపంచ వాఙ్మయము లన్నింటిలో కేవలప్రకృతి వర్ణన కావ్యములందు ఋతుసంహారము మొట్టమొదటిది. ఆంగ్ల వాఙ్మయమున పదునెన్మిదవ శతాబ్దమందు 'థామ్సన్' [7] కవి ఇట్టి కావ్య మొకదానిని 'ఋతువుల'ను పేర రచించెను. ఈ రెండు కావ్యముల రచనాప్రణాళికలు సమానములు. ఋతువున కొక అధ్యాయము. అందు ఒక్కొక్క ఋతువు యొక్క విశేష లక్షణములు, దృశ్యములు వర్ణింపఁబడినవి. ఇవి యన్నియు కాళిదాసు-థామసన్ కవులలో గల సమానాంశములే, కాని కవుల ప్రతిభలో హస్తిమశకాంతరము గలదు. కాళిదాసు విశ్వకవీశ్వరులలో నగ్రతస్సరుఁడు. థామ్సన్ పదునెన్మిదవ

శతకపు టాంగ్ల పద్య నిర్మాతలలో నొకఁడు. ఈ తారతమ్య మా యిరువురు కవుల భావనలో కానిపించును. కవిత్వ తత్త్వమున నిరువురి కేమాత్రమును పోలికలే లేవు. నీరసము, కృత్రిమ మగు కవితాయుగమునకుఁ జెందినవాఁడు 'థామసన్'. వర్ణ నాత్మక కవిత్వతత్త్వమే యీతనికి బోధపడలేదు. వస్తువుపై నాతడు దృష్టి నిలుపునుగాని యాతనికి గోచరించునది దాని బాహ్య స్వరూపమే. అతడు కళాసృష్టిగావింపబోయి ఛాయా చిత్రమును దీసి సిద్ధపఱచెను. ప్రకృతి, కవిత్వమున కొక యావరణమో, జీవితమునకొక యలంకారమో, తత్త్వము నకు ప్రాణప్రదాయినియో! యగును కాని అన్యము కాదు. 'వర్డ్సువర్తు'[8] కవీశ్వరుడు ప్రకృతిని తన జీవిత భాగస్వామిని గావించుకొని, కవిత్వమల్లి విశ్వ చైతన్యమును గలిగించెను. 'షేక్స్పియరు' కవి, ప్రకృతిని జీవిత వివిధ వాద్య సమ్మేళన ములలో నొక వాద్యము కావించుకొనియెను. ఆధునిక కవులు ప్రకృతిని విశ్వ చిత్రమునకొక భూషణముగా వర్ణించిరి. అంతే గాని ప్రకృతి కొక స్వతంత్రస్థానము ప్రపంచమునందుగాని, కవి సృష్టియందు గాని లేదు. మానవుడన జీవము, మనస్సు మాత్రమే. ఇంద్రియములు కేవల ముపకరణములు. బాహ్యా తరజీవితమంతయు ఆతని యాంతరంగిక సత్త్వము ననుసరించి యుండవలయును. ఆంతరంగిక జీవితానుభవ పుష్టికొఱకు ఇంద్రియజ్ఞానము తోడ్పడవలయును. కాళిదాసు తన దివ్య కళానుభూతితోడను, ఆర్ద్రహృదయ సంపదతోడను, వినిర్మల సత్యకవితాదృక్పథము తోడను, ప్రకృతికే దివ్యత్వమాపా దించెను. 'షేక్స్పియరు' వలె నీతడు ప్రకృతికొక ఆధ్యాత్మిక

భావమును గల్గింపక, భావావేశపూరితుఁడై తన నిశితమేధా శక్తితో ప్రకృతిని సమీక్షించెను. 'వాల్మీకి' మహర్షి కున్నంత అద్భుతావహమగు నాంతర దృష్టి కాళిదాసునకు లేదు. 'వర్డ్సువర్తు' వలె ప్రకృతి నీతడు కేవల మాతృభావముతో నారాధింపలేదు. కాళిదాసు దృష్టి ప్రకృతి లోనికి జొరఁబడును. అంతేకాని దానిని తుదిముట్ట చూపదు. ఆతఁడు ప్రకృతి కంటె కూడ జీవితమునకే యధిక ప్రాముఖ్య మొసఁగును. ప్రతివస్తువు నాతడు జీవితముతో సమన్వయించుకొనును.

ఋతుసంహారమున మొదటి సర్గము గ్రీష్మ ఋతువు వర్ణనము. ఈ ఋతువునందలి జంతువులు, మానవులు, వృక్షములు, మొలకలు మున్నగువాని సూక్ష్మ జీవిత విధానముల నీ కవీశ్వరుడు వర్ణించును. ఇందలి ప్రతి శ్లోకము కాళిదాసు వక్ష్యమాణ కవి కులగురుతనను నంశమును నిరూపించుచున్నది. ఇందలి ఆఱు సర్గములందును వైవిధ్యమును బ్రకటింపగల నేర్పరితనము, కవితానుభవము, భావనాశక్తి, మున్నగు సద్గుణములు యువకాళిదాసునకు సమకూడ లేదు. పొంగి పొరలు నిండుజవ్వనపుటాటచే నింద్రియోద్రేకముల నతిక్రమించు శక్తి యాతని కప్పటి కలవడలేదు. అందుచే ఆతఁడు కొన్ని ప్రధాన భావములను ఆమూలచూడముగా నిండు పొందు పఱుపలేక, ఒకే యొక భావనా రీతిని ప్రపంచించి కావ్యీకరించెను. కాని తద్విధానమున నొక్క దోషమేనియు వెతికి పట్టఁజాలము. "కీట్సు"[౧] తన తొలికావ్యములలో చూపిన ఇంద్రియ దౌర్బల్యస్ఫోరకమగు వర్ణనలవంటి వర్ణనలు, కాళిదాసు కావ్యమున మృగ్యములు. ఎంతటి భోగానుభవా

సక్తి యున్నను కాళిదాసు కాలమందలి ప్రజానీకము పౌరు షోపేతమైనది. చేవ గోల్పోనిది. తత్కారణమున కాళిదాసు కవనమునందును ఆ పురుషలక్షణములు సర్వదా సుస్పష్టముగ వీక్షింపనగును. ఆతడు ప్రకృతికి దాసుఁడై వర్ణనలు చేయఁడు. ప్రకృతినే తనకు లొంగతీసికొని యథేచ్ఛగా రసావేశముతో వర్ణించెను. ఇట్టి శక్తి సంస్కృత కవిత్వము నందంతట గోచ రింపకపోదు. కాని కాళిదాసునందాశక్తి ఆద్యంతములందును తరుగకుండ ననుభవింప నగును. ఆంగ్ల కవులకీ పౌరషశక్తి లేదు.

ఆఱు సర్గములందును క్రమముగా గ్రీష్మ, వర్షా, శరత్, శిశిర, హేమంత, వసంత ఋతువులు వర్ణింపఁబడినవి. కృత్యా రంభము నద్భుతముగా నిర్వహించుటలో కాళిదాసు నెఱ జాణ. ఈతడు కవితాసమ్రాట్టు కాఁగల చిహ్నము లీ లఘు కావ్యముననే రూపొందినవి. కవితోత్సాహ మొక్కపరి పెల్లు బికినది. గ్రీష్మర్తు వర్ణనలో నాతని యత్యద్భుత భావనాపటిమ, నిశిత వస్తుపరిశీలనము, సుస్పష్ట భావప్రకటన, అల్పాక్షరముల ననల్పార్థ రచన కాళిదాసు కవితా వైఖరిద్యైనవి. అందుచేత ఇతర సర్గలకంటె నీ ప్రథమసర్గము ప్రాముఖ్యము వహించును. కవి తన కవితాశక్తి నంతయు నీ సర్గసృష్టికే ధారపోసెనా! యనిపించును. తరువాతి సర్గలలో కవితాపటుత్వము క్రమ క్రమముగా సన్నగిల్లినది. వర్షర్తు వర్ణనములలోని కొన్ని భావ చిత్రము లత్యద్భుతములు. అయినను కవితాశక్తి సడలు చున్నట్లు పరిశీలనముపై కనిపెట్టవచ్చును. కాని పదమైత్రి శ్రుతిహితమై గంభీరముగనుండును. శరదృతువర్ణనము బాగుగా బిగువు తప్పినది. అయిన నిందలి శైలీమాధుర్యము, భావ

నిర్వహణ కొంత తృప్తికల్గించును. తరువాతి రెండు సర్గలు నిరాశాజనకములు. వర్ణనలు—ఎక్కడో కొన్నిపట్ల తప్ప—పూర్తిగా పటువు తప్పినవి; కేవలము సాంప్రదాయిక ముగా మాఱినవి. కాళిదాసు కవితా ప్రతిభగాఁ జెప్పఁకోఁతగిన దిందేమాత్రము లేదు. వీని నిక్కడ వదలి, వసంత ఋతువు నకు వత్తము. ఇందును సహృదయ పాఠకునకు తగినంత రస లబ్ధిలేదు. న్యాయ్యముగాఁ జూచిన ఈ వసంతఋతువర్ణన మీ కావ్యమునకు తలమానికము కావలసినది. శాప పతితుఁడు శాపానుభవానంతరము, తన పూర్వశక్తి నార్జించుకొనుటకుఁ జేయు ప్రయత్నము వంటి ప్రయత్నమిందు గోచరించును. శైలి కొంతవఱకు ప్రౌఢముగానున్నను, ఆవేశపూరితమగు కవితాత్మ స్ఫురింపదు. మొత్తముపై భారతీయుల ఋతువుల రాణియగు వసంతఋతువర్ణన శోభ, కవిత్వములో నాశింప తగినంతగా నావహింపక పోవుట దురదృష్టమనుకొనక తప్పదు. ఈ కొఱఁ తను కాళిదాసు కూడ గమనించియేయుండును. అందుచేతనే కుమారసంభవ మహాకావ్యమున, కథాకథన వైభవముతో శ్రుతి గల్పికొన్న యీ ఋతువులరాణి రామణీయకముచే రసికలోకము ద్విగుణీకృతముగ రంజిల్లునట్లు గావించి నాఁడీ కవి చక్రవర్తి.

## కవితా వైశిష్ట్యము

ఎట్లైనను 'ఋతుసంహార' మొక ఆహ్లాదకరమైన కావ్యము. కాళిదాసు తన కవితాప్రతిభ నీదివ్యకావ్య కేదార మున బీజావాపము గావించెను. కాళిదాసీయ కవితా శిల్ప

కళాచ్ఛాయలు ఈ లఘుకావ్యమున సుస్పష్టముగ స్ఫురించును. చక్కని యుపమాలంకారము లిందును నిక్షిప్తములు. నిశిత వర్ణనా చణత్వము, సమయోచిత సాభిప్రాయ విశేషణ ప్రయోగ వైచిత్రి యిందనేకరీతులఁ గాననగును. ఇట్టి యీప్రథమ ప్రయత్నము గూడ 'ఉపమాకాళిదాసస్య' అనుసూక్తిని సార్థకము చేయుచున్నది. ఈ ప్రారంభకావ్యమునందును కాళిదాసీయ కవితాముద్ర సుస్పష్టముగనున్నది. గ్రీష్మకాల వినీల విహాయసము, సువిశాలభూభాగమును బోలినది. కలకల లాడు మందహాసవదనలగు కన్నెపడుచులు, చంద్రహారాలంకృతలగు సంధ్యాకాంతలను దలపించుచుండిరి. దూరారణ్యములయందలి యగ్నికాంతులు, ధాతు ద్రవ బిందువులా! యనిపించుచుండెను. అప్పుడే మొలిచిన పదునైన పచ్చికబీళులు, పచ్చలుబొదిగిన కంబళులవలె నుండెను. దరీవృక్షములను గూలద్రోయు నదీ సుందరులు, తమ్మాశ్రయించిన విటులను సర్వనాశమొనర్చెడి దుష్ట వారకాంతలట్లుండెను. ఈమున్నగు వర్ణన లన్నింటిలోను, కాళిదాసు ఉపమాశక్తి సుస్పష్టము. ఇంకను నిట్టి వనేకములు ఉదాహరింపనగును. సంధ్యాకాలమందలి చంద్రబింబము, సిగ్గుచే తెల్లబాఱిన వనితముఖమండల మట్లుండెను. దివిటీలు వెలుగొందుచుండగా వేంచేయు ప్రభువురీతిగా వర్షమేతెంచెను. ప్రావృట్పయోదానీకము మదోత్కట ద్విరదసంఘమువలె నుండెను. మెఱపులు వాహినీ సదృశముగను, ఉఱుములు జయభేరీనినాదముగను నుండెను. మెఱపునారిగాగల యింద్ర ధనస్సును బూని మేఘుఁడు వర్షమును వేటాడుచుండెను. ఈ రీతిని వర్ణింపఁగల సామర్థ్య మొక్క కాళిదాసునందే చలా

మణి యగును. ఇందక్కడక్కడ అధికపదప్రయోగము పొడ గట్టును. అక్కడక్కడ విపరీతపు టూహాలును గలవు. అయి నను కాళిదాసు కవితాస్వరూపము, కళాగోపనము మనకిందు విశేషముగ సాక్షాత్కారమగును. విపరీతపు టూహల నెన్నింటినో పరిమిత పదప్రయోగమునఁ బ్రకటించు కళా కోవిదుఁడు కాళిదాసు. ఇందన్నిటికన్న విచిత్రమైనభావన— ప్రకృతిని పడతితో నుపమించుట.

సుస్పష్టరూపచిత్రణాచణత్వముచేతనే యీలఘు కావ్య మ్మునకు అలఘుగౌరవము లభించినది. అట్టి లక్ష్యము తోడనే ఈ కావ్యము రచింపబడినది. ఈ కావ్యము పఠించుచున్నంత కాలము ఋతువులు సజీవాకృతితో మనకు సాక్షాత్కరించును. గ్రీష్మర్తువులోని ఆతపౌద్ధత్యము, సూర్యకిరణములు త్రేతా గ్నులవలె చెలరేఁగుట, గాలిదుమారములు సుడులు తిరిగి భూమిని తుడిచివేయుట మున్నగు వర్ణనలను మఱచి పోజా లము. తన దుందుడుకుతనము మాని, క్రోర్కెను మఱచి, అదుగో మృగరాజు!! నాలుక బయటికి వ్రేలవైచి, విసుగుతో నేమియుతోచక, జూలు కదలించుచు, ఒడలు విరుచు చున్నాఁడు!! నాగుబాము శిరము వంచి, రొజుచు, మండు చున్న యిసుకమార్గమున గమించుటకు మిక్కిలి ప్రయాసపడు చున్నది. అడవిపందులు, ఎండుబురదలో తమ ముట్టెలతో భూమిని కుళ్ళగించుచు, శీతల భూగర్భమున తలదాచు కొను టకుఁ బ్రయత్నించుచున్నవి. ఆఁబోతులు, ఖిన్నవదనములతో, పిపాసాపీడితమ్ములై, గంగువెట్టులెత్తి యడవిసంతయుఁ గ్రుమ్మ రుచున్నవి. అడవులు ఎండిపోయి కళావిహీనమ్ములైనవి. ఒక

ప్రక్కనుండి యవి దహించుకొనిపోవుచున్నవి. ఇంతలో తొలకరివర్షము పడినది. ధూళిధూసరితమై, వర్షము, పర్వత సానువులనుండి త్రాచుబాముల గమనమువలె జరజర ప్రవహించుచున్నవి. జలధారలతోడను, జలధర చుంబితోత్తుంగ శిఖరములతోడను, పరిఫుల్ల కలాపకలాపి జాల సంశోభిత సానువులతోడను నగరాజులు నేత్రపర్వ మొనర్చుచున్నవి. దిక్తటములందు, నీలాంభోజదళముల మాడ్కి మేఘ శలాకములు, మంద మారుతముల కేపైకెగ ప్రాకుచున్నవి. మకరందమునకై తుమ్మెదలు మూగుచుండ, కోవిదారవృక్షములు, వాయు సంచలిత పత్రహస్తములతో వానిని తోలించుకొనుచు, ధీరోదాత్తనాయకుల వలె నిలువఁబడినవి. బాతులు ప్రవాహమున కెదురీదుచున్నవి. ఆకాశమునుండి వెన్నెలవాకలు వెల్లువలై ప్రవహించుచున్నవి. కంకులీనిన వరిచేలు, ప్రక్కనున్న కల్వకన్నెలతోఁ గలసి చిఱుగాలికి నర్తించుచున్నవి. ఈ మున్నగు ననేక రమణీయములగు వర్ణనలు, చిత్రకారులు చిత్రించినట్లే కనులకు కల్యాణ మొనగూర్చును. వాడిదేలిన సంక్షిప్త పద జాలముతో నిట్టి చిత్రముల చిత్రింపఁగల దక్షతకల కవీశ్వరుఁడు సంస్కృత వాఙ్మయమున కాళిదాసొక్కఁడే! తదితరకవులు, బాణభట్ట, భవభూత్యాదులు, వర్ణనలను అధికపదజాలముతో ముంచెత్తెదరు. అవి చిత్రకారుఁడు తన చిత్రముల కెక్కువగా రంగులు పులిమినట్లుండును. ఈ కవుల భావచిత్రములు సజీవాకృతులతో స్వతంత్రముగ నిలువఁ జాలవు.

ఇట్టి భావచిత్రణశిల్పము 'రఘువంశము' న నుజ్జ్వలముగా కానవగును. భావము–భాష–ఛందస్సు అను మూఁడును

అందు ముచ్చటగా ముప్పిరిగొన్నవి. అట్టి సమ్మేళనము ఈ ప్రథమకావ్యమున నంతగా కానరాకున్నను, తచ్ఛాయలు సమగ్రముగ కలవు. చూడుఁడు:—

శ్లో. జ్వలతి పవనవృద్ధః పర్వతానామ్ దరీషు;
స్ఫుటతి పటు నినాదైః శుష్కవంశస్థలీషు;
ప్రసరతి తృణమధ్యే, లబ్ధవృద్ధిఃక్షణేన,
గ్లపయతి మృగవర్గం ప్రాంత లగ్నోదవాగ్నిః ॥

గాలికి వృద్ధిపొంది దావాగ్ని, పర్వత సానువుల యందు ప్రజ్వరిల్లుచుండెను. ఎండిన వెదురుపొదలలో నది వ్యాపించి, ఫెళ ఫెళార్భటుల గావించుచుండెను. క్షణములో నభివృద్ధి గాంచి, గడ్డి బీడులలోని కది బ్రసరించుచుండెను. ఇట్లు పర్వత చరియలయం దుద్భవించిన యీ దావాగ్ని క్రూరమృగ ములను సైతము బాధించుచుండెను.

ఈ శ్లోకమున కాళిదాసీయ కవితా మారంద ధారలెట్లు జాలువారుచున్నవో పరికింపుఁడు :—

శ్లో. పుంస్కోకిలః చూత రసాసవేన
మత్తః ప్రియాం చుంబతి రాగహృష్టః
ముంచన్ ద్విరేఫోఽప్యయ మమ్బుజస్థం
ప్రియం ప్రియాయాః ప్రకరోతి చాటుః ॥

చూతరసాసవము నాస్వాదించి పుంస్కోకిల, అనురాగ హృష్టయై మత్తిలి ప్రియురాలిని ముద్దిడుకొనుచుండెను. అంబుజమునందున్న ద్విరేఫము, తనమధుర మర్మరధ్వానులతో

ప్రియురాలికి ప్రియమొనఁగూర్చుచు, రహస్యోక్తులతో నలరించు చుండెను.

ఇట్లే మఱికొన్ని నిశితభావోజ్జ్వలమైన శ్లోకములు కాళి దాసు కవిత్వమునకు మచ్చుతునక లనఁదగును. పరికింపుఁడు :-

శ్లో. ఆకంపయన్ కుసుమితాః సహకారశాఖా
విస్తారయన్ సహభృతస్య వచాంసి దిక్షు
వాయుర్వివాతి హృదయాని హరన్నరాణామ్
నీహారపాత విగమాత్ శుభగో వసంతే॥

పుష్పిత సహకారశాఖలను గంపింపఁజేయుచు, దిక్కు లందు కోకిల కుహూకుహూరావములను విస్తరింప జేయుచు, నరులహృదయముల నాకర్షించుచు, తుషారబిందువు లదృశ్య మౌటచే సుభగమైన మారుతము, వసంతఋతువునందు వీచు చుండెను.

కాళిదాసు ఇతరకావ్యములలోని తేలిక శ్లోకములను గైకొని పఠించిన, అవి యీ ఋతుసంహార శ్లోకములకు సన్ని హితముగా నున్నట్లు తోపక మానదు. ఈ శ్లోకమును దిల కించునది:—

శ్లో. ఇదమసులభవస్తు ప్రార్థనా దుర్నివారమ్
ప్రథమమపి మనోమే పంచబాణః క్షిణోతి
కిముత ? మలయ వాతోన్మీలితా పాండువర్ణ
ముపవన సహకారైర్దర్శి తేష్వంకురేషు ॥

అసులభమైనది, ఎంత ప్రార్థించినను నివారించుటకు సాధ్యముకానిదియునైన నా మనస్సును మన్మథుఁడు ముందుగ

బాధించుచుండెను. అట్టియెడ, మలయ మారుతముచే వికసింప జేయబడినట్టియు, అంతట పచ్చనైన వర్ణముకలిగిన యుద్యాన వనము, తీయమామిడిచెట్లు, అంకురములు కల్గినవగుచుండగా వేఱుగా చెప్పనేల ?

ఇట్టి రచనానైపుణ్యము, మార్దవము, పదసంయోజనము, లలిత శబ్దాలంకార సంకలితత్వము, శబ్దసమతా ప్రతిపాదనములే, ఉత్తరోత్తర కావ్యములందును, మఱింత లాఘవముతో ననుసంధానితములైనవి. కాని భావమాత్రమింత కంటె ననేకరీతుల నిగ్గుదేలి, చక్కదన మొల్కినది. సంస్కృతమున మఱి యే యితర కవియందును నిట్టి శైలీపరిణామము కానరాదు. భవభూతి కవితారీతి సాహసోపేతమైనది; శక్తిమంతమైనది ; బాహిరమైనది. జయదేవునిగీతము, లోకమోహనమైన స్వర సమ్మేళనా విన్యాసము ; ఛేకానుప్రాస, వృత్త్యనుప్రాసాలంకారములు–వివిధ వాద్యముల కలయికయే. కాళిదాసు కవితాశైలి ఈ గుణజాలమంతయు కలది. తదతీతమైనది. ఋతుసంహారము కాళిదాస కృతము కాదని వాదించు వారికి ఇందలి ప్రతి పద్యము 'నా' నని నిరూపింపగలదు.

ఋతుసంహారము కేవలము దోషరహితకావ్య మన లేము. తులనాత్మకమగు విమర్శచే నీ కావ్యమునందు కొన్ని దోషములు పొడగట్టును. కాళిదాసు ఇతర కావ్యములయందలి శిల్పసౌకుమార్య మీ కావ్యమునందు కాన్పించదు. కావ్య ప్రణాళిక ప్రౌఢముకాదు. అయినను నీలఘుకావ్యావతరణముచే సమకాలీన కవితా భావాంబరమునందు, నూత్న భావా

దయమైనది, ఇందలి పద్య నిర్మాణదక్షత, ఇందలి కవితాశక్తి, భావోజ్జ్వలత, తత్త్వమాధుర్యము, కావ్యశోభ, మున్నగు సద్గుణము లీ కావ్యమునకు సంస్కృత సారస్వతమున నచంచల స్థాన మేర్పఱచినవి. ఈ కావ్య పఠనముచే సర్వేంద్రియ సంతృప్తియు కలుగును. రసిక నాగరక యుగప్రవక్తయగు కాళిదాసు కవిసార్వభౌముని మధురహస్త స్పర్శసుఖానుభూతి ఈ కావ్యమున సర్వత్రకల్గును. ప్రకృతిని జీవితానుభవముతో సమన్వయించుచు, సౌందర్య చికీర్షులైన మానవుల జీవితాంశములను సమీక్షించి రసానందరూపమున ప్రసాదించుటే, కాళిదాసు తొలికావ్యము యొక్కయు, మలికావ్యము యొక్కయు పరమలక్ష్యము. తొలుత నాతడు బాహ్య ప్రకృతినే యాలంబనము గావించుకొనెను; శారీరక సౌందర్యమునే సమీక్షించెను. కవి సాగింపదలచిన సుదీర్ఘ కవితా జైత్ర యాత్రలో నిది ప్రథమదశ. కుమార సంభవమునందు కవీంద్రుడీ దశ నతిక్రమించెను. అందలి పాత్రలు దేవతలు. అట్టి దేవతా స్థానమునందు కవియు నధిరోహించెను. అందలి సౌందర్య సమీక్ష అతిలోకమైనది. అట్టి స్థానము మఱియొక కవి యాక్రమింపఁ జాలనిది.

---

## 3

# భారతీయ సాహిత్యము : కాళిదాసు

భారతీయ సాహిత్య నందనోద్యానము పదిశతాబ్దము లకు పైబడి సుందరమహాకావ్య లతల కాలవాల మైనది. ఇవిమిక్కిలి ప్రసిద్ధివహించి, ధిషణాధురంధరులచేఁ బ్రశంసింపఁ బడినవి. ఈ మహాకావ్యములకును, వీనికి ముందు వెలసిన మహేతిహాసములకును భేదముకలదు. విషయమునందు విశేష భేదములేకున్నను, నిర్మాణ నైపుణ్యమునందు, భావరంజనము నందు, భాషాప్రయోగ స్వభావమునందు విభేదముకలదు. ప్రజాజీవిత సంస్కృతులయందు మనోహర బాల్యజీవితదశ, వీరోచితమయిన యౌవనదశ, వికాసవంతమైన వార్ధకదశలు గతించినవి. అనంతరము ప్రజాజీవనము క్రమక్రమముగా పత నోన్ముఖమైనది. ఈ పతనము సర్వనాశమగు వఱకును గలుగ లేదు. ఏలయన నీ క్షీణస్థితి నుండియే యొక విధమగు వినూత్న భావాంకురములు మొలకెత్తినవి. నూతనారంభ ముద్బుద్ధ మైనది. తిరిగి ప్రజాసంస్కృతీ జీవనమున నానందదాయక మగు బాల్యదశ మొదలైనది. కాని యీ పర్యాయము సంస్కృత భాషాధారము తొలఁగినది. సంస్కృత సంజనిత భాషలు తలెత్తినవి. వానికి వైజ్ఞానిక స్థాయి యేర్పడినది. దీనితో ప్రాచీన సంస్కృతభాషామతల్లి వైభవము, ఉత్సాహ విలసితజీవితము, సంతమొందినవి. ఇతిహాసములందలి సంస్కృత భాషకును, భర్తృహరి - కాళిదాసుల కావ్యభాషకును నప్పుడే యజగజ భేదమేర్పడినది. ఈ మధ్యలో బౌద్ధమతము విశేష

వ్యాప్తిలోనికి వచ్చినది. సంస్కృత భాషకు సారస్వత ప్రయోజనము తొలఁగినది. విద్యావంతులుకూడ నీ భాషలో వ్యవహరించుట మానుకొనిరి. పాళీభాష ఆస్థానము నాక్రమించినది. తత్కాలమున పాళీభాష భారత జాతీయభాషగా పరిగణింపఁబడెను.

ఇతిహాసశైలి స్వేచ్ఛాసామర్థ్యములతో గూడినది. ఇది జీవద్భాషాసముల్లసితము. కావ్యశైలికి శ్రీకారము చుట్టినవాఁడు కాళిదాసు. అది తీర్చిదిద్దబడిన యొక కళ; రసభావనా సముత్ఫుల్లమైన భాషా సృష్టియది; తీవ్రమగు నాలోచనామృతఫలమది. అది సాలంకారమయినది. సమర్థుఁడగు నొక మహాశిల్పిచేతిలో మలచఁబడిన సుందరవిగ్రహమును బోలినది. చిత్రకారుని కుంచెచే సవదరింపఁబడిన యొక రమణీయ చిత్రముతో సదృశమైనది. ఈ శైలి విశేషప్రయత్న ఫలితము, మేధోద్దీపితము ; అయినను సహజశోభను గోల్పోలేదు. ఇది యాశుధార కాదు. స్వభావతుల్యమగు నభ్యాసమునకు వశమై వర్తించినది. కాళిదాసానంతర కవులలో కృతకలక్షణము లధికమై యధికారము వహించినవి. విశేష కృషిఫలితముగా నుద్బుద్ధమైనదీ కవులశైలి. ఈ కవులు పద్యనిర్మాణ దక్షులు. ఈ దక్షత యసాధారణమైనది. విద్వల్లోకము నుల్లాసభరితముగావింపఁగలది. మత సంబంధమయిన పురాణములు, తంత్రములు సజీవములయిన రచనలు. ఇవి సామాన్య ప్రజానీకమునకుఁ గూడ సులభగ్రాహ్యము లయినవి. అట్టి రచనా సంప్రదాయమే యితిహాసములందును కలదు. కాని యీ రెండింటిలోఁ గల సౌలభ్యమునకు తారతమ్యముకలదు. ఇతిహాసములందలి

సౌలభ్యము బుద్ధిపూర్వకముగా సాధింపఁబడినది. ఎట్లయినను కతిపయ వేదాంత మతసంబంధ రచనలను మినహాయించి పరీక్షించిన, సంస్కృతము రాను రాను జటిలమై, కేవల పండిత భాషగా పరిణమించిన దనకతప్పదు. జాతీయజీవద్భాషా లక్షణములు క్రమముగా మృగ్యమైనవి.

ఏవం విధ సాహిత్య భాషావిభేదమునకు ప్రోద్బలకములైన పరిస్థితుల నట్లుంతము. ఈ విభేదమును బురస్కరించుకొని సాంస్కృతిక మనస్తత్వము నందును గొప్ప పరిణామమేర్పడినది. పూర్వమువలె, భారతీయ సంస్కృతి, ఆధ్యాత్మిక, వేదాంత, మత, నైతిక సంబంధము కలదేయైనను, ఇవి తెరచాటైనవి. ఇవి పరస్పరము వేఱు పడినవి. ప్రత్యేకముగా విస్తృతి వహించినవి. మేధాశక్తి ప్రాబల్యము వహించినది; నాగరకత వృద్ధికాంచినది. రసావేశ మధికమైనది. భోగలాలసత్వము విపరీతమైనది. ఇంద్రియ ప్రకోపము గాఢమైనది. ఆంతరంగిక శక్తులకన్న, బాహ్య పరిస్థితుల ప్రాబల్యమే ప్రబలమైనది.

ఈ కాలమున తర్కము, వేదాంతము, శాస్త్ర పరిశోధనము, కళావిమర్శనము, ప్రవర్ధమానమైనవి. వివిధమగు నుపయోగకళలు, న్యాయ, రాజకీయ శాస్త్రములు; వర్తక వ్యాపారములు, వలసవిధానము; ప్రాజ్య సామ్రాజ్యస్థాపనము పటుతర పరిపాలనా వ్యవస్థలు; నీ సమయముననే సమృద్ధి నందినవి. జీవిత నౌకకు శాస్త్రము చుక్కాని పట్టినది. వైభవోపేతము, నింద్రియానుభవ యోగ్యమునగు ప్రతి విషయము

నందు నానాఁటి ప్రజకు చక్కని యభిరుచికలదు. ప్రతి విషయ మును వారు నిశిత మేధాశక్తిచే పరీక్షించిరి. వేయేల ? సూక్ష్మబుద్ధి కౌశల్యమే యానాఁటి భారతీయ సంస్కృతికి జీవగఱ్ఱ యైనది.

ఈ కాలమున ప్రాబల్యము వహించిన బుద్ధిబలము మానవుల నుక్కిరిబిక్కిరి గావించునట్టిది కాదు. కేవల హేతు వాదమునే యాధారించుకొని, వ్యతిరిక్త శక్తులను రేకెత్తించు నదికాదు. ఈ బల మన్వేషణా స్వభావము కలది. నిత్యోత్సాహ పూరితమైనది. సంప్రదాయానుగత వేదాంతాధ్యాత్మిక, మత, సాంఘిక సూత్రముల నంగీకరించునదియే. అంతేకాదు. ఈ సూత్రములను కూలంకషముగా సమీక్షించి, శాఖోప శాఖలుగా వింగడించి, క్రోడీకరింప నీ మేధాశక్తి యుత్కంఠించి నది. భారతీయ సంస్కృతీ సౌధ నిర్మాణమప్పటికే పూర్తి యైనది. కాని బుద్ధికుశలుర కీ సౌధమున ననేకాంతరువులు నిర్మించుకొను నవకాశముకలదు. వైజ్ఞానిక వాఙ్మయ కళా సంబంధమగు మందిరములలో ననేకాలంకారములు తీర్చి దిద్దుకొనుట కెంతేని వీలుకలదు. ఈ సమయమున తత్సంబంధ మగు ప్రయత్నములు నిర్విఘ్నముగా కొనసాగింపఁబడినవి. సుఖజీవితావసరము లన్నియు నిప్పుడే సమకూర్చుకొనబడినవి. హృదయ మేధా వికాస సంబంధములైన కార్యకలాపములు స్వేచ్ఛగా సారింపఁబడినవి. లలిత కళోపాసనాతత్పరులే కాదు, జీవిత కళాప్రపూర్ణులుకూడ నీ కాలమునఁ గలరు. బహుముఖీ నములైన యీ కార్యకలాపము లందంతటను విశిష్టమేధా శక్తియే యధికారము వహించినది. భౌతికానందానుభవ రక్తి

యీాయుగ ప్రత్యేకలక్షణములలో నొకటి. అయినను నిది విశృంఖల విహారము సలుపలేదు. కొంత సంయమనముతో మర్యాద నతిక్రమింపకయే ప్రవర్తించినది.

ఇంతకు పూర్వము భారతీయ హృదయ తంత్రులు విడదీయుటకు వీలులేనంత గాఢముగా పెనవేసికొన్నవి. ఒక్క మాటు మీటిన మాత్రమున, నిందుండి మధురగానము, లోకమోహనముగా వెలువడినది. ఈ కాలమునకీ యేకత్వ మనేకత్వముగా పరిణమించినది. ప్రతి స్వల్పతంత్రియు స్వతంత్రమైనది. అయినను సమైక్యభావము విచ్ఛిన్నముకాలేదు. అనేకత్వమునం దేకత్వము సుస్పష్టము. స్వాచ్ఛందమైన ప్రేరణాత్మక మానస మలవోకగా సాధించిన సమైక్యమును, విశ్లేష సంశ్లేషాత్మకమగు బుద్ధి, యీా తరుణమున ప్రయత్న పూర్వకముగా సాధించినది. మతకళారంగముల యం దాధ్యాత్మిక ప్రేరణ ప్రబలముగా నున్నను, వాఙ్మయరంగమున నీ ప్రాబల్యము క్షీణించినది. మత, మతేతర రచనల కీ కాలమున సుస్పష్టమైన విభజనము జరిగినది. ఇతఃపూర్వ మీా విభజన రేఖ కానరాదు. మహాకవులు, రచయితలు మతేతర విషయములనే విశేషముగ నాదరించుటచే మహేతిహాసములకుఁ గల జనరంజకత్వము వీరి రచనలకు లేకపోయినది. మత కవితా స్రవంతి, పురాణ తాంత్రికము లందుమాత్రమే ప్రవహించుచుండెను.

ఇట్టి కాలమున కేకైక ప్రతినిధి కాళిదాసు. పరంపరానుగత పరిస్థితుల కీతఁ డలంకృతమగు నాకృతిని కల్పించెను. పూర్వముకన్న నీ యాకృతిలో నొకింత మార్పు గోచరించినను,

తత్వమునం దెట్టిమార్పును రాలేదు. ఈతని పద్యము లుదాత్త భావ ప్రఫుల్లములైనవి. శ్రుతిహితములైనవి. ఇతర కవుల కనుకరణయోగ్యములు. కాని యనుకరించువారు కాళిదాసంత వారు కారు. అందుచే వారి రచనలయం దంతటి ఛందో మాధుర్యభావ సంపద్విశిష్టత కానరాదు. కాళిదాసు కాలమున కవితాకళ పరాకాష్ఠము నధిష్ఠించినది. కవిత్వ మొక శిల్పనిర్మాణమైనది. తద్విధానమున కవసరమైన వస్తు సమూహా సేకరణ శ్రద్ధగా సమకూర్చుకొనఁబడుచుండెను. భవననిర్మాణ, శిల్ప, చిత్రలేఖనాదులకువలె కవితాకళకుఁగూడ సాంకేతికత్వ మేర్పడెను. ఉత్తమలక్ష్యము, ఉదాత్త భావసమృద్ధి, రూప సౌందర్యసంపద, విశదవార్ణనికశక్తి, భావోద్రిక్తత, మున్నగు ననేక లక్షణము లన్నికళలకువోలె కవితాకళకుఁగూడ నవరసము లైనవి. ఈ కాలమునందే యలంకార శాస్త్రము తల యెత్తినది. కావ్యలక్షణములు, కావ్యదోషములు, ఉపమాద్యలంకారములు, కావ్యవస్తు నిర్ణయాదు లీ శాస్త్రవిధులైనవి. 'నిరంకుశాః కవయః' అనుసూక్తి కీయలంకార శాస్త్ర మొక యంకుశ మైనది. కావ్యసృష్టియం దావగింజంత యనవధానత్వ మునుగూడ నీ శాస్త్రము సహింపదు. కవికి నిశిత విమర్శనా జ్ఞానముండవలయును. కావ్యకళాసమగ్ర స్వరూప సాక్షాత్కార సంజనిత పచేళిమ పరిజ్ఞానసంపత్తితో నాతఁడు కావ్య సృష్టికిఁబూనుకొనవలయునని యీ శాస్త్ర మాదేశించెను. ఈ యాదేశమునందలి పరమార్థము రాను రాను మఱుఁగు పడినది. తరువాతి కవులు కావ్యసృష్టియందుకన్న, ఛందో లంకారాది నియమ పాలనమునకే తమ విధేయత్వమును

ప్రకటించిరి. తమలో కొఱంతవడిన సృజనాశక్తిని వారీ రీతిగా మభ్యపెట్టి కవులనిపించుకొనిరి. ఇదే వాఙ్మయమునకు క్షీణదశ. గ్రీకుదేశమునందు కూడ కవిత్వమున కిట్టి దుర్దశ పట్టకపోలేదు. అన్ని వాఙ్మయములందును నీ దశ దర్శితమే.

కావ్యము లందలి సంస్కృతభాష సుపరిష్కృతమైనది. సుస్పష్టభావప్రకటనానుకూలమైనది. ఆర్య జనోచితమైనది. సుస్నిగ్ధ సౌందర్య విలసితమైనది. అల్పాక్షరములలో ననల్ప భావ సౌభాగ్యము నిమిడ్చుకొనునది. ఈ భాష శబ్దమాధుర్యమునకై భావగాంభీర్యమును నష్టపఱుపదు. రెండింటి నేకకాలముననే సాధించుశక్తి యీ భాషకు సంసిద్ధము. ఇందలి శయ్యాసౌకుమార్యము నాన్యతో దర్శనీయము. కాలక్రమమున గద్య రచనలలో సుదీర్ఘ సమాస ప్రయోగము పరిపాటియైనది. కాని తొల్లిటి రచనలలో నివిలేవు ; విశృంఖల రచనా విధాన మప్పటికిలేదు. సంయమనమే యానాఁటి రచయితల ప్రధాన లక్ష్యము. ఈ కాలమున శ్రుతివిహితమగు వివిధ ఛందోరీతులు వెలసినవి. వీని నామములు సుందరముగను, నాకర్షణీయముగను నుండును. భావగతి ననుసరించి వీని నెన్నుకొనఁదగును. చతుష్పాద పరిమితమైన యొక శ్లోక మొక పూర్ణభావ ప్రకటనమునకై వినియుక్తము. సుస్పష్టము, మనోజ్ఞము, సుందరము, రసవత్తరము, నాలంకారికము, దృశ్యాత్మకమునగు ప్రతి శ్లోకము శిల్పదృష్టితో తీర్చి దిద్దఁబడెను. శ్లోకానుక్రమము, సోపాన క్రమమున సర్గరస జగత్తునకుఁ గొంపోవును. ఇట్టి సర్గములు కొన్ని కలిసి యొక మహాకావ్యమై మహానంద ధామముగా శాశ్వతానందమును బ్రసాదించును.

కాళిదాసు మధురహస్తము పరుస వేదివంటి లేఖినినిబట్టి, యిట్టి మహా కావ్యములు సృజించినది.

మహాకావ్య సృష్టికి మునుముందు ఉదాత్త భావనాశక్తి కావలయును. అట్టి భావముల కుచితమైన యుత్తమభాష రెండవ యవసరము. ఇట్టి యీ ద్వివిధశక్తులు సమ పాళ్లలో మేళగించినపుడే మహాకవిత్వ మవతరించును. కాళిదాసట్టి మహా కావ్య శిల్పుల కగ్రగతస్సరుఁడు. ఆంగ్లమున 'మిల్టన్' లాటిన్ భాషలో 'వర్జిలు' [10] నిట్టి కోవకుఁ జెందినవారే. మిల్టన్ కన్న కాళిదాస మధురహస్తస్పర్శ సుకుమారమైనది. వర్జిలు నకు కాళిదాసున కున్నంత సహజ ప్రతిభ లేదు. సంస్కృత వాఙ్మయమున కాళిదాస శైలివలె పచేళిమ మయిన కావ్య శైలి యింకెందును లేదు. (భావోద్రిక్తతతో, మధుర భావ మంజులత్వముతో, సుకుమారహస్త లాఘవముతో భావ సమైక్యముతో, పరిమిత పదములం దపరిమిత భావసమృద్ధి నలవోకగా సమకూర్చగల శైలి కాళిదాసీయ శైలి.) ఇన్ని విశిష్ట గుణముల సంధానము, వేఱొక శైలియందు లేకుంషుటచేతనే, యద్వితీయమను ప్రశంసకర్హమైనది – అంతేకాదు. ఈ శైలి ప్రయత్నసిద్ధమను భావ మిసుమంతయు తోఁచదు. సహజ శోభావహమైన ఈ శైలి మహిత రసానందభాండము నరఁటి పండొలిచి చేతికిచ్చినట్లుగా నందించును. ఇందు తు, చ, అపి, మున్నగు వ్యర్థపదములు కూడ సార్థకములై, రసవ్యంజనోప యుక్తములైనవి. పదములనిట్లు తూచి, తూచి, ప్రయోగించి నను, కవితాధార కుంటుపడకుండఁ జేయుటలో నీతని కీతఁడే సాటి. కాళిదాసు మహాకవి రూపమున వెలసిన చిత్రకారుఁడు.

ఈతని భావచిత్రములం దెచ్చటను, మచ్చుకైనను రంగును పులిమినట్లు గోచరింపదు. అతఁడు గీచినగీటు అక్షర రమ్యము.

లౌకిక కవీశ్వరులలో నీతఁడగ్రగణ్యుఁడు. అయినను నీతని దర్శయితృశక్తి యలౌకికమైనది. ఈతని భావానుభూతి యార్ద్రమయినది. ఈత డింద్రియములకు స్వాధీనమయిన వ్యక్తి కాఁడు. ఇంద్రియములను తన చెప్పుచేతలలోఁ బెట్టుకొన్న ధీమంతుఁడు. ఎంతటి రాజభోగియో యంతటి రాజయోగి !! భాష, ఛందస్సు నీతనికి పూర్తిగా దాసత్వము వహించినవి. ప్రతిఛందోగమనమునందును పదసమైక్యము నీతఁడు సాధించును. (తరువాతి కవులలో నొక్క జయదేవుని యందీ విధానము సంగీతస్థాయి నందుకొన్నది) అంత్యప్రాస లత్యంత శ్రుతిమనోహరములై సుస్నిగ్ధముగ జాలువారును. కాళిదాసు కవనమున భావసంపద యక్షీణమయినది. ఆతని ప్రతిభావ మాలోచనా వార్నిధిని మథింపగా వెలువడిన యమృత గుళిక. భావగౌరవమున కనుకూలమయిన పదసామగ్రి నెన్నుకొనుటలో నెఱజాణ కాళిదాసు. కళావతంసుఁడైన శిల్పి, ఉదాత్త విషయ నిర్వహణమునం దద్వితీయుఁడు. ఆతని భావనయు, సృష్టియు నొకేస్థాయిలో జరుగును.

ఈ కావ్యములు సమకాలీన ప్రజాజీవిత సంస్కృతీ స్వభావముల నాలంకారిక భాషలో ధ్వనింపఁ జేయును. ఇతిహాసములట్లివి సుస్పష్ట దర్పణములుకావు. ఇతిహాసములందు ఛందో వైవిధ్యము శూన్యము. మహాకావ్యములలో భావానుకూల ఛందోగమనములు, లలిత మంజీర నినాదములవలె

నాహ్లాదపఱుచును. కావ్యభాష సుస్నిగ్ధ సుకుమారమైనది; ప్రౌఢ ప్రమోదకరమైనది. ఇతిహాసభాష ముగ్ధ మనోహర మైనది. ఇతిహాసములందు కథాకథనము ముఖ్యము. మహా కావ్యము నందు భావ చిత్రము ప్రధానము.

కాళిదాసు కావ్యసప్తకమునందు ప్రతికావ్యము ననేక భావ చిత్రణముల సంపుటి యననగును. ఆతని మానసము విశిష్ట విజ్ఞాన భాండాగారము. అట్లని యది విషయ భార ముతో క్రుంగిపోవునది కాదు. విషయభారము నధఃకరించి, నవనవోన్మేషముగా సూక్ష్మపరిశీలనము గావింపఁగల నైశి త్యము దానికి కలదు. ఆతని విజ్ఞానము బహుముఃఖీన మ్మైనది. సమకాలీన రాజకీయ సాంఘిక మత న్యాయ వేదాంత కళా పరిణత ప్రజ్ఞామూర్తి కాళిదాసు. రాజ ప్రాసాద జీవిత మాతని కెంత సుపరిచితమో, విరాగారణ్య జీవితమాతని కంతే సన్నిహితము. మానవజీవితమునందాతని కెంత మమకారమో, పాదప పశు పక్ష్యాదులయందుఁగూడ నాతని కంత యనురాగము. ఆతఁడు క్రాంతదర్శనుఁడైన మహా కవియేకాదు; మహాశిల్పికూడను. కతిపయసంస్కృతమహాకవుల యట్లు కాళిదాసు, కళాలాలిత్యమును భంగించు విపరీత వైదుష్యమును ప్రకటింపఁడు. తనకుఁగల కూలంకష పాండిత్య మును, తన కళాసృష్టి కనుకూలముగ లొంగి వర్తింపఁ జేసికొన్న విద్వత్కవి కాళిదాసు. పండిత పామరులను సమానముగ రంజింపఁజేయగల సామగ్ర్యము కలవాఁడీ తఁడు. వివిధార్హతలు కల పాఠకులు, కాళిదాసు కావ్యములను బఠించి తమ తమ మనః ఫలకములపై భావముద్రలను బొందెదరు. కథ చెప్పినట్లే

చెప్పుచు వర్ణనకుఁగడంగుటలో కాళిదాసు కడు గడుసరి. శ్లోకమునుండి శ్లోకమునకు గమించు కొలఁది, పరిసర దృశ్యము లన్నియు కళాత్మకముగా నీతని చిత్రణమునం దొదిగిపోవును. భారతీయ మహారణ్యములు; ఉత్తుంగ పర్వతములు; విశాల మైదానములు, అందలి నరనారీ సమూహము; వారి నైదైనందిన జీవితస్థితిగతులు; భారతీయ నగర గ్రామములు; వివిధ మృగ శకుంత సంతానములు; ప్రాసాద ప్రశాంత కుటీరములు; నదీనద రమ్యోద్యానములు: సస్యశ్యామల కేదారలక్ష్ములు; కాళిదాస కావ్య ప్రపంచమున సజీవముగ సందర్శనీయములు. ఈ దృశ్య ములు కాళిదాసున కూహాజనితములు కావు; నిత్యజీవితాను భవములోనివి. ఆతని మనఃఫలకమున శాశ్వతముద్ర నందినవి. ఆ కారణముచేతనే యీతని వర్ణనల కట్టి సజీవ విశదత్వము సంక్రమించినది. అవి చిత్రలేఖనమునందువలె వర్ణరంజితము లైనవి. భారతీయ సామాన్యగృహ జీవితము మొదలు అరణ్యా శ్రమమహర్షి జీవితము వఱకునుగల యాచార సంప్రదాయ ములు, వివిధ సాంఘిక నియమములు, మతవిశ్వాసములు, సంస్కృతీ విధానములు కాళిదాసు కావ్యప్రపంచమం దంతటను గుబాళించును. దేవతల, రాజేంద్రుల యుదాత్త ప్రవర్తనము; సేనాధిపతుల, సుకుమార భావుకుల విభిన్నమనః ప్రవృత్తులు; జానపద నాగరకనారీ సౌందర్యదృష్టి; ఋతుచక్ర సంచారము; వివిధప్రకృతి దృశ్యములు కాళిదాసున కాదర పాత్రము లైనవి.

నిశిత కళాదృష్టిని, భోగానుభవ రక్తిని, యనుభూతి విశిష్టతను; సౌందర్య ప్రేమోపాసనాసక్తిని బురస్కరించుకొని

కాళిదాసు కావ్యయుగమునకు యుగకర్తగాఁ బరిగణింపఁ బడెను. బుద్ధికుశలతను, విజ్ఞాన సాంద్రతను; మతాభినివేశమును; నైతికాదర్శములను; సంయమన స్వభావమును, సౌందర్యోపాసనాసక్తినిబట్టికూడ కాళిదాసునకీ యుగప్రాతినిధ్యము దక్కెను. ఈతని ప్రతి కావ్యము నేవంవిధ వివిధ సౌందర్య లక్షణ లక్షితమౌట చేతనే యీ ప్రాతినిధ్య మీతనికి సార్థకమగును.

రఘువంశ మహాకావ్య ముత్తమ నైతికమత సంస్కృతీ లక్ష్యములే యాకృతి వహించిన సూర్యవంశ సార్వభౌముల రసోజ్జ్వల వర్ణనాత్మక కథాసంపుటి. ఇందలి ప్రతిసర్గము నొక దివ్య సౌందర్య ధామము. ప్రతి సంఘటనము, ప్రతి సంభాషణము సుమనోజ్ఞము. ఇందు సమకూర్పబడిన పరిసరములు కథా సంఘటనమునకు జీవనాధారములు. మఱియొక మహాకావ్యము అసంపూర్ణేతిహాసము. అయినను దాని నిర్వాహణ విధాన మత్యద్భుతము. ఎక్కడికక్కడే యిది సమగ్ర శోభతో విరాజిల్లును' కథ దేవతా సంబంధి. పరమేశ్వరీ పరమేశ్వరుల కలయికచే దేవదానవులకు సంబంధించిన కలహం సమస్య నిపుణముగా పరిష్కృతమైనది. ఇందలి విషయ మిదే యైనను, భారతీయ మానవ, మానవేతర ప్రకృతి వర్ణనా కావ్య మిది. దేవతాత్ముఁడగు హిమవంతుని యాధారముగాఁ గొని, దేవతాస్థాయిలోఁ గావింపఁబడినదీ వర్ణన. కాళిదాసీయ రూపకత్రయము త్రివిధప్రేమ భావ నిరూపకము. అయినను నివి వివిధ జీవిత చిత్రణముల సంపుటి. ఒక లఘుకావ్యము భారతీయ ఋతువులను వర్ణించు కేవల వర్ణనాత్మక కావ్యము.

మేఘసందేశ మసదృశమైన ప్రేమకావ్యమైనను, ఇందు భారత దేశము వర్ణింపఁబడిన విధాన మనిర్వాచనీయమైనది. కవి విహంగావలోకనముతో భారతీయ జనపదమును, దక్షిణము నుండి యుత్తరము వఱకును గాంచి, తన కావ్యఫలకమున రమ్యాతిరమ్యముగాఁ జిత్రించెను. ప్రేమోద్రిక్త సుకుమార స్వభావనిరూపక మిందు సుస్పష్టముగ దర్శింపనగును. ఇట్టి కాళిదాసీయ కావ్య పఠనముచే సహృదయ పాఠకునకు సర్వేంద్రియ సంతృప్తియు, రస సంతర్పణమును ప్రాప్తించును. తా నమృత పుత్రుఁడనని యాతఁడానందముగ జీవించును. ఇట్టి యలౌకికానందానుభవముతోపాటు ఉత్తమ భారతీయ సంప్రదాయములు, భారతీయ ప్రణయ రహస్యములు, రసవత్తర జీవిత శిక్షణాదులు కూడ ననుభవైక వేద్యములై పరితృప్తి నొనగూర్చును. కాళిదాసు సమకాలీన పరిస్థితులను ధ్వని మార్గమున రమణీయముగా తన కావ్యములందు ప్రతిబింబించెను.

కాళిదాసు నొరవడి చేసికొని యనేక కవులు కావ్యములు వ్రాసిరి. వ్యక్తిసంబంధములగు చిన్న చిన్న విభేదములట్లుంచి, యీ కావ్యము లన్నింటను నొకేభావన, యొకే కవితా విధానము కానవగును. కొన్నింటిలో బుద్ధిపటిమ విపరీతముగఁ బొడగట్టును. కాని కాళిదాసీయ కవితాపచేళిమా పటిమగాని, సౌందర్యస్థాయిగాని, కళాకౌశల్యముగాని వీనిలో మృగ్యము. భారవీ మాఘుల మహాకావ్యములతో నీ కవితా సౌందర్యము మఱింత దిగజారినది. భావకళా ప్రధానమగు కవిత్వము, రచనా కళాప్రధానముగ పరిణమించినది. అసంఖ్యా

కముగా ఛందోరీతులు వెలసినవి. బుద్ధి సంబంధమగు వ్యవసాయ మధికమైనది. కృతకత్వము మితిమీరినది. సంప్రదాయ దాసత్వము శ్రుతిమించినది. కవిత్వాభిరుచులు దోషదూషితము లైనవి. కావ్యసృష్టి నశించి, కావ్యనిర్మాణ మేర్పడినది. నిసర్గ భాషా మాధుర్యము నశించి, కృతకభాషా వైభవము తలెత్తినది.

మాఘుఁడు కావ్యనిర్మాత. హీనమగు శబ్దతాంత్రికముల నీతఁడు ఉత్తమగుణములుగా భ్రమసెను. శ్లేషలు, యమకములు, గమకములు నర్మగర్భితములైన యనేక చిత్ర విచిత్ర రచనల నీతఁడు ప్రయత్నపూర్వకముగా సాధించెను. భారవి యందీ లక్షణము లింత యతిగా లేవు. అయినను నీతఁడు స్వేచ్ఛగా కవన మల్లలేదు. ఈ శాబ్దిక ప్రభావమును తానెక్కువగా నుపాసించనందుల కీతఁడు విశేషముగా విచారించినట్లు కనుపించును. రచనా కళాసౌందర్య మాతనికి వెన్నతో నలవడిన విద్య కాదు. భారవి పదునైన యాలోచన కలవాఁడు. మాఘుఁడు విపరీత పాండిత్య ప్రకర్ష కుద్యమింప కున్నచో కవిగా రాణింపఁ గలవాఁడే. మాఘ భారవులు, తమ యభిరుచులను, కవితావిధానములను బట్టి ఎలిజబత్కాల మందలి కవులతో నుపమింపఁ దగుదురు. కాని వారికన్న వీరికి కొంత పార్థక్యము కలదు. భారవిలో రచనాకళ పచేళిమము కాలేదు. పచ్చిపచ్చిగా నున్నది. మాఘునిలో నీకళ ముదర బండి, క్షీణసంస్కృతిని ప్రతిబింబించినది.

అయినను సంస్కృత సాహిత్యమున నొక నూత్న రచనా విధానమునకు వీరు మార్గదర్శకులుగా గౌరవము సంపా

దించుకొన్నారు. కాళిదాస కవితా ప్రతిభాకాంతి పుంజమునం దణఁగి మణఁగిన శాబ్దిక శక్తి, వీరిలో శబలమైనది. ఈ శబల శాబ్దిక వైలక్ష్యమునకు వీరి కవితాత్మ జోహారు సల్పి యూడిగము చేసినది. రసానందమును గాకున్నను, చమత్కార వైభవమును బ్రదర్శించిన కీర్తి వీరికిఁ జేకూరినది.

కాళిదాసు కాలమున కవిత్వము మంచి పాకమున బడినది. భావమథనము, జీవిత విమర్శనము, సంప్రదాయ ప్రియత్వము, స్వేచ్ఛా ప్రియత్వముతో నొప్పారు నీ కవిత, నాగరక యుగమును ప్రతిబింబించును. బుద్ధిబలమే యీ యుగమున కవితా విషయ నిష్కర్షగావించినది. ఇతిహాసములు మతమును, నీతిని, జీవిత వైవిధ్యమును సజీవముగఁ బ్రతిబింబించును. కవితావికసిత బుద్ధిబల మితిహాసములందును గాంచ నగును. కాని యీ బుద్ధిబలము పూర్తిగా కథాసృష్టిలో లీనమైనది. అందుచేతనే యితిహాసములు జీవకళతో కళ కళ లాడుచుండును. తరువాతి కాలమున నీ కవితా వికసిత బుద్ధిబలము కావ్యసృష్టితో సంపూర్ణముగ విలీనము కాలేదు. సమయము లభించినపుడెల్ల నిది తన వ్యక్తిత్వమును బ్రదర్శించుకొనుచునే యున్నది. ఈ బుద్ధిబలము కేవలము కళావికసితమైనదే కాక, విమర్శనాత్మకమైనది. అందుచేతనే విషయ తాదాత్మ్యమిందు పూర్తిగా సాధ్యముకాలేదు. చుక్కాని యందు చూపునట్లు, కవీశ్వరుఁడు తన కావ్యములందు, చిత్రవర్ణ రంజితమగు సన్నివేశములను, మనోహరమగు దృశ్యములను, రమ్యాకృతులను, నిగూఢ మనస్తత్వములను, సుస్పష్టముగా, సుందరముగా, సూటిగా సాక్షాత్కరింపఁజేయును. తన్మూలమున పఠిత లానం

దింతురు. కాని యంతలో తాము సందర్శించినవి కల్పిత జీవములుగల యాకృతులని గుర్తింతురు. కవి తన నిపుణతతో నీ చిత్రముల నెంత విశదముగ ప్రదర్శించినను; పఠితలకుఁగల్గునది బాహ్యేంద్రియ సంతృప్తిమాత్రమే. తాత్త్విక తాదాత్మ్యమిందు కలుగలేదు. కాళిదా సొక్కఁడే యిట్టి కవుల పట్టికలో జేరఁడు. అతఁడిందుల కపవాదము. ఇట్టి స్థితి నతిక్రమింపఁగల శక్తి యీ కవీశ్వరున కొక్కనికే కలదు. ఏలయన నీతని కవితాత్మ పరిణత భావనాపటిష్ఠమయినది. ఈతని చిత్రీకరణము సృజనాత్మకమైనది. కేవల వర్ణరంజితమైనదే కా దీతని చిత్రీకరణము. పఠితలకెప్పుడును తాము గాంచినవి ప్రాణము కల్పింపఁబడిన చిత్రములను భావము కలుగనే కలుగదు. కాళిదాసట్టి స్థాయి నతిక్రమించిన సృష్టికర్త. తక్కిన కవులెప్పుడో సకృత్తుగా నాస్థాయి నందుకొందురు. అందుకొన్నను తాత్కాలికము మాత్రమే. కాళిదాసు సృష్టిపీఠమున సుప్రతిష్ఠితుఁడు. కాళిదాసేతర కవుల కావ్యములు ప్రధానముగా నాలంకారికములు. అవి నూటికి నూరుపాళ్లు కావ్యసృష్టి కాదు. ఇందున నాధ్యాత్మిక భావములు, సమకాలీన జీవిత మనఃప్రవృత్తులు, సంస్కృతిసంపద, ప్రతిబింబించును. కాని యిది కేవలము బాహ్యమునకుఁ జెందినదే. ఆంతరంగిక స్వరూప ప్రతిబింబన మందు మృగ్యము. ఉత్తమనీతిని, మతభావముల నీకావ్యములు కూడ ప్రతి పాదించును. అయినను నివి యనుభూతిచే నార్ద్రములైనవి కావు. ఈ ప్రబోధము మానసికస్థాయి నతిక్రమించునది కాదు. అందుచే రామాయణ మహాభారతములందుగల సజీవ నైతికశక్తి యిందు శూన్యము. ఆశ్రమజీవిత వర్ణనములుగూడ

కొన్ని కావ్యములందు గలవు. అట్లే రాజ భోగానుభవములును వర్ణింపఁబడినవి. ఇవియన్నియు బుద్ధిబలముచే నూహింపఁబడినవి. ఇవి స్నిగ్ధానుభవసిద్ధములుకావు. కావ్యవస్తువు నుండి బుద్ధిచే పృథక్కరింపబడినవి. బుద్ధిపరిశీలనమే యిం దధికము. వస్తుజీవముతో జీవించుశక్తి యీ వర్ణనలకులేదు. ఆంతరంగిక ప్రేరణము నీ బుద్ధి తిరస్కరించును. హద్దుమీరి వృద్ధిఅయిన బుద్ధిబలమువలన కలిగిన వ్యాధిలక్షణమేయిది. సాహిత్యమున క్షీణయుగారంభమునకు ముందిట్టి లక్షణములు పొడగట్టక తప్పదు. కాళిదాసొక్కఁడే యిందుల కతీతుఁడు. అందువలననే యీ కవీశ్వరునకు వ్యాస వాల్మీకుల ప్రక్కనే భారతజాతి యున్నతాసనము నేర్పఱచి, గౌరవాంజలులను సమర్పించును.

ఇట్టి బుద్ధి బలాధిక్యతతో వెలసిన, వేఱొక శ్రేణికిఁ జెందిన కావ్యములు సుభాషితములు. ఇవి సర్వకాలీన సత్యములను ప్రబోధించును. ఇందొక్కొక్క శ్లోక మొక పూర్ణ భావమును నివేదించును. ఒక్కొక్క శ్లోకము జీవిత క్లిష్ట సమస్యా పరిష్కార సాధకముగా నుండును. ఏవం విధ సుభాషిత కావ్యము లీ సాహిత్యమున తామర తంపరగా కలవు. ఇవి బుద్ధిమంతులకు, ఉపదేశికులకు మిక్కిలి హితమైనవి. ఇవి బహుముఖ జీవితానుభవములను వ్యక్తీకరించును. ఇట్టి వీనిలో తలమానికమైనది భర్తృహరి విరచిత సుభాషితములు. ఇందలి పద్యము లుద్రిక్తభావ సముత్ఫుల్లములు. ఈ కవీశ్వరునకు లయాత్మకమగు భావానుభవ విజ్ఞానము కలదు. అంతేకాదు. విస్తృత జీవితానుభవ పరిణతమూర్తి యితఁడు. ఇవి మూఁడు శతకముల సంపుటి. తొలిశతక ముత్తమ నీతులతోడను;

లోకానుభవ విశేషములతోడను; జీవిత విమర్శనముతోడను గూడినది. రెండవది శృంగార శతకము. తొలిదానికున్నంత ప్రభావము దీనికిలేదు. ఇది వాతావరణ ప్రభావమునకు లొంగి రచింపఁబడినట్లు కనుపించును. ఇందు కవీశ్వరుని నిసర్గ ప్రతిభా ప్రాభవము కానరాదు. మలిశతకము వైరాగ్యభావ ప్రబోధకము. మానవుని ప్రపంచ పరాఙ్ముఖుని గావించునది. భర్తృహరి విరచితమైన యీ శతకత్రయమునందు సమకాలీనమగు త్రివిధ మనస్తత్వములు గోచరించును. ప్రవృత్తి నివృత్తి భోగానుభవము లానాఁడు విపరీతముగ నున్నట్లు గ్రహింపవచ్చును. నివృత్తి భోగములకై యానాఁడు ప్రజలు క్రమక్రమముగా తమ ప్రవృత్తి భోగములను త్యజించినట్లు తెలియును. నివృత్తి మార్గమున ప్రవేశించిన మాత్రమున యాధ్యాత్మికానందము సిద్ధించదు. అలసి సొలసిన యింద్రియముల కిందు కొంత విశ్రాంతి లభించును.

*          *          *          *

సంస్కృత సాహిత్యమున రూపక ప్రక్రియ యగ్రతాంబూలము నందినది. శ్రవ్యకావ్యములందు ప్రతిబింబించినట్లుగానీ దృశ్య ప్రబంధములందు సమకాలీన పరిస్థితులు ప్రతిబింబించవు. దృశ్య కావ్యములందు, శ్రవ్యకావ్యములందువలె కవిత్వ మున్నతస్థాయి నందుకొనుట కవకాశము లుండవు. సంస్కృత రూపకములు విలక్షణములైనవి. ఇందు సృజనాత్మక కౌశల్యము తొణికిస లాడును. అయినను నివి గ్రీకు రూపకములవలెగాని, షేక్స్పియర్ రూపకములవలె గాని విశేష

వ్యాప్తికిరాలేదు. అందులకు ముఖ్య హేతువు— భారతీయులు విషాదాంత రూపకములను బహిష్కరించుటే. దుఃఖ మరణాది దుష్టపరిణామముల నైదొలఁగించియు, నుత్తమరూపక సృష్టి గావింపనగునను ప్రత్యయము వీరికిఁగలదు. అట్లని విషాదమేఘములు భారతీయ మానసాంబరమున నలముకొనవని కాదు. మహాభారతము విషాదాంతమైన గాథయే. శుభాంతమైన రామాయణమున కుత్తర రామాయణము చేరి విషాదాంతమే యైనది. అయినను సాత్త్విక సంపన్నమైన భారతీయ స్వభావమునకు, భావనకు, నంతమునందు ప్రశాంత పరిస్థితులను గూర్చుటే యత్యంతానుకూలము. జీవిత సమస్యలను సాహసాడంబరములతో పరిష్కరించుటందు వీరికెక్కువ మక్కువ లేదు. ఈ రూపకములు విశేషముగా శృంగారాత్మకములైనవి. ఇందలి వస్తువు చాలవఱకు ప్రాచీన గాథలే. సమకాలిక సంస్కార జీవిత విధానములను బురస్కరించుకొని రసవత్తరముగా నీగాథలే నాటకీకరింపఁబడినవి. వాస్తవిక జీవిత ప్రతిబింబములగు రూపకములును గొన్ని కలవు. ఇందును కొన్ని నగరవాసుల గృహ జీవితములను నిరూపించును. మఱికొన్ని చారిత్రకములు. రాజదర్బారుల ఠీవిని, పరిసర ప్రకృతి రామణీయకమును నిందు సందర్శింతుము. ఈ రూపకము లందలి విషయ మేదియైనను నేతరగతికిఁ జెందినదైనను నివి కళాత్మకముగ రచింపఁబడినవి. ప్రాకృత జీవితము లిందు పరుసవేదివంటి ఘంటముతో దివ్యముగా సంస్కరింపఁబడినవి. అయినను నిందు నాటకీయ సంచలన మల్పము. కాని మానవ తత్త్వ విమర్శనమునందు, మానవ చర్యా పరిశీలనమందు, కవిత్వ పటుత్వము

నందు నివి యేమాత్రము తీసిపోవు. ఉదాత్త గంభీర కవిత్వ సౌందర్యాకర్షణము; సూక్ష్మభావానుభూతి; చైతన్యోల్లసిత రమణీయ పరిసరములన్నియు నేకాకృతి వహించి కాళిదాసుని శాకున్తల రూపకమైనవి. అందుచేతనే సకలసాహిత్యము లందును శాకున్తలము సమగ్రసమాకర్షణశక్తితో శృంగార రూపక రాజ్ఞియైనది. సుకుమార మనోభావములను, చర్యలను, సురుచిరముగాఁ బ్రదర్శించుట; ముఖప్రతిముఖాది పంచసంధులతో క్రమవిధానమున కథాసంవిధానమును సమ కూర్చుట; భయానక సన్నివేశములనుగాని, బహుపాత్రసంకుల త్వమునుగాని కల్పింపక, నిర్మలప్రశాంతమాధురీ వాతావరణ మును బరిపోషించుట; సూక్ష్మమన స్తత్వములను సుందరముగా నున్మీలింపజేయుట; యుద్రిక్త రాజసిక ప్రవృత్తిగల పాత్రలను సృజింపకుండుట; మధుర సంభాషణములను, నర్మోక్తులను యుక్తియుక్తముగ సమయానుకూలముగ నేర్పఱుచుట, మున్నగునవి భారతీయరూపక సామాన్యలక్షణములు. భార తీయరూపకములు విశిష్టసంస్కృతీవిలసితులకు, సత్వభావనా సంపన్నులకు, ప్రశాంతరసానందాకృష్టులకు, సచ్చిదానంద సౌందర్యోపాసకులకు, మాత్రమే యుద్దిష్టమైనవి. ఇట్టి యక్షీణ భావసౌందర్య కళావిలసిత రూపక సృష్టి యీ సాహిత్యమున నవిచ్ఛిన్నముగ కొంతకాలము జరిగినది. భాసుని రూపకసృష్టి యవక్రమైనది; శక్తిమంతమైనది. భవభూత్యాదులు విస్ఫూర్తో జ్జ్వలరూపకముల నిర్మించిరి. సర్వాంగీణ సౌష్ఠవ సమగ్ర సౌందర్యోపేత నాటకసృష్టికర్త కాళిదాసు మాత్రమే.

సంస్కృత సాహిత్యమున బహుముఖీనములుగా వెలసిన రచనావిధానములన్నియు, వర్ణనావివరణముతో భాసుని హర్ష చరిత్ర మను నాఖ్యాయికలో నలముకొన్నవి. జాతకకథలు, కథాసరిత్సాగరములు, కథాకథన బృహత్కావ్యములు, పంచ తంత్ర హితోపదేశములు, జంతుజాలము పాత్రలుగాఁ గల యద్భుతకథలు- ఇట్టి గద్యకృతులు మత, వైజ్ఞానిక, రాజ కీయాది రంగములందు మానవుల కనల్పమగు పరిజ్ఞానము నొసఁగుచున్నవి. కాని యివి వాస్తవిక జీవితమునకు దూరమై కాల్పనిక జగత్తునకు సంబంధించినవే యగుటచే, భారతీయులకు వాస్తవిక జీవితచిత్రణమునందు ప్రతిభ లేదను విమర్శనమున కవకాశము కల్గెను. ఆ విమర్శన మెట్లున్నను, నీ రచనలు ప్రతిపాదించు తార్కిక తత్త్వచింతనము, మతానుభవము, అశేషభారతీయ ప్రజాజీవితములను సంస్కరింపఁ గలిగినవనుట వాస్తవము.



## ౪

# చారిత్రిక విమర్శ - విమర్శనము

భారతీయ నాగరకత, మహోజ్జ్వలస్థాయి నందిన యొకానొక యుగమునకు కాళిదాసు ప్రాతినిధ్యము వహించును. అతని కావ్యములు బహుముఖములగు తద్యుగ లక్షణములను బ్రతిబింబించును. వాల్మీకి వ్యాసుల రచనలలోఁగూడ వారివారి యుగలక్షణము లింత సమగ్రముగఁ బ్రతిబింబింపవు.

కాళిదాసు మాళవదేశీయుఁడని యూహింపనగును. కాని యాతఁ డుజ్జయినీ నగరమున మాత్రము పుట్టలేదని చెప్పవచ్చును. మేఘసందేశమునందు వర్ణింపఁబడిన యే గ్రామమునందో యాతఁడావిర్భవించి యుండును. అనంతర మాతఁడు, రాజధానీ నగరమునఁజేరి, క్రీస్తు పూర్వము ప్రథమ శతాబ్ద మధ్యకాలమున, మాలవీయులకు శకకర్తగా కీర్తిఁ గాంచిన (శ్రీ) విక్రమాదిత్య మహారాజపోషణ మనుభవించుచు, కావ్యసృష్టిఁగావించి యుండును. అతని యధ్యయన సంపత్తిని గూర్చియు, కులగోత్రములను గూర్చియు, శీల స్వభావములను గూర్చియు నాతని కావ్యములనుండి కొన్ని విషయములను సేకరింపనగును. కాని చారిత్ర కాధారము లేవియు లభింపవు. ఈతనినిగూర్చి యాధార రహితమైన గాథ లనేకములు వ్యాప్తిలో కలవు. అవి చాలవఱకు నసహ్యములుగను, వికృత ములుగను నుండును. అందుచే వీని కంతగా విలువనొసఁగ నక్కఱలేదు. వాల్మీకి, వ్యాస, కాళిదాసాదుల మహిమాన్విత

నామధేయములు మనకు సంప్రాప్తములు. ఈ నామముల కంటెను వీరి కావ్యసృష్టి మహిమోజ్జ్వలమైనది. అవి భారతీయ సాంస్కృతికసంపదకు కాణాచులు.

కాళిదాసెవరు? ఆతని కవిత్వస్వభావమునకు భిన్నమైన యాతనివ్యక్తిత్వమెట్టిది? ఈతని నాదరించి పోషించిన రాజేంద్రుఁడెట్టివాఁడు? కాళిదాసు మిత్రులెవరు? వీరితో నాతఁడెట్లు మెలఁగెడివాఁడు? ఈతని ప్రత్యర్థులెవరు? వారితో నీతని ప్రవర్తన మెట్లుండెడిది? ఈతఁడు మద్యమును, మదవతిని సేవించెడివాఁడా? ఎట్టి ప్రత్యేకవాతావరణమునం దీతఁడు తన రచనా కలాపమును నిర్వర్తించెడి వాఁడు? ఏ యే వ్యక్తుల ప్రభావ మీతనిపై ప్రసరించెను? ఈమున్నగు ననేక ప్రశ్నలు సహజోత్కంఠగల ప్రతిమానవునకును నుద్బుద్ధము లగును. కాని వీనికి స్పష్టమగు సమాధానములు లేవు. ఇది యత్యంత విచిత్రమగుపరిస్థితి. ఒకరీతిగాఁజూచినచో ఈ ప్రశ్నలకు సమాధానము లభింపకుండుటయు నదృష్టమే యనుకొందును.

చారిత్రిక విమర్శనపద్ధతి చాల ఆకర్షణీయమైనది. దానివలన కొన్ని ప్రత్యేక ప్రయోజనములు కలవు. అంతర్దృష్టి సారస్వత వివేచనము లోపించిన కవుల రచనలలోని యనేకాంశములను, తెలివితేటలతో సుస్పష్టముగ తెలిసికొనుటకీపద్ధతి యుపయోగించును. మానవుని మానసము పనిచేయు పద్ధతులను గూర్చిన పరిజ్ఞానమీవిధానముచే నభివృద్ధియగును. అంతేకాని సవిమర్శక కవితావగాహనమునకు మాత్రమిది సాహాయ్యపడదు. కవియొక్కయు, నాతని కావ్యముల యొక్కయు ప్రాపంచిక ధర్మములను గ్రహించుటకీ విమర్శన

ముపకరించును. కాని కావ్య ప్రభావగౌరవముల నవగాహనము గావించుకొనుపట్లనిది యవరోధకర మనక తప్పదు.

చారిత్రిక పద్ధతి నభిమానించువారు గుఱ్ఱముముందు బండిని నిల్పి, యా రెండింటి మధ్యలో తాముండి, బండిని తోలుటకు సాహసింతురు. కానియది నిష్ప్రయోజనకరమే కాదు; ప్రమాదముఁకరముగూడను. వారు తమ యవధానమును కవిత్వముపై లయింపఁజేయక, కవిపైన లగ్న మొనర్తురు. ఒక కావ్యమును ముందు మనము మథించి, దాని కవితా వైశిష్ట్యము నవగాహనము గావించుకొని యనంతరము, బాహ్య ప్రకృతితోడను, కావ్యలక్షణములతోడను, దానికిఁగల సంబంధమును, ఆంతరంగిక సాక్ష్యములను బురస్కరించుకొని కవి ఆత్మీయతను నిర్ణయించుకొనవలయును. ప్రతి సహృదయ పాఠకుఁడు సహజముగ నిట్లే గావించును. ఇట్లు నిర్ణయించుకొనఁబడిన కవి యాత్మీయతయే మన కత్యంతోపయోగము.

"షేక్స్పియరు" న కాతని సమకాలీనులతోఁగల సంబంధమును వ్యక్తీకరించు వ్రాఁతలు, చరిత్రకెక్కువ తోడ్పడును గాని కవితా ప్రశంస కుపయుక్తములుకావు. మానవశీల పరిశీలనమునకు, మానసవికాస గ్రహణమునకు నీ రచనలు సాయపడును. కాని షేక్స్పియర్ వ్రాసిన గేయములనుగాని, రూపకములనుగాని బఠించునపుడీ వ్రాతలతో నేమిపని? అంతే కాదు. ఇట్టి భౌతికాధారములు పఠితకును, కావ్యగతకవీశ్వరాత్మీయతకును మధ్య నవరోధము కల్పించును. ఏలయన బాహ్య చర్యలు మానవుని భౌతిక మానసిక రీతులనే స్పష్ట

పఱుచును. కాని రచన లాతని యంతర్బుద్ధిని, తార్కిక శక్తిని గుర్తింపఁజేయును. నిజమున కివియే మానవ నిజ స్వరూపము. ఇవి పరిగ్రహణ, పరిగణన పటుత్వము కలవి. 'విలియం హెర్బర్టు,' లేక హెన్రీరిత్ స్లె కొఱకో, లేక తనకొఱకో షేక్స్పియర్ తన గేయములను రచించియుండవచ్చునను విషయమును, షేక్స్పియర్ ప్రేమించినది మేరీ ఫిట్టనునామెనో లేక మరియొక యువతినో! లేక యసలే ప్రేమింపలేదో! యను విషయమును, అతని భాష యతిశయోక్తులతో గూడినదో లేక యుద్రిక్తమైనదో! యను ననేక విషయము లుబుసుపోకకును, ఆత్మాధిక్యము కొఱకును నుపయోగించునేమోకాని, కవిత్వావగాహనమునకు మాత్రము నిష్ప్రయోజనములు. షేక్స్పియరు తాను పద్యములు వ్రాయఁబూనినపుడు సంప్రదాయోచితము, నాలంకారికము నగు భాష వ్రాసెడు వాఁడను విషయము చారిత్రక సత్యమైన కావచ్చును. కాని యంతమాత్రముచే, మన కాతనిని గూర్చి కల్గు వికాస మేమియును లేదు. అది కేవల భౌతిక, మానసిక సంబంధవిషయమే. హైందవు లీ స్థితిని 'అన్నమయకోశము' 'మనోమయకోశము' నందురు.

షేక్స్పియర్ బుద్ధియు, నాతని యంతరాత్మయు నాతని సజీవరచనాముఖముననే ద్యోతకమౌను. సజీవరచన కాతని జయాజయములు, నుదాత్త ప్రేమ సద్భావములు, మానసిక ప్రేరణలు కారణములౌను. కావుననే యాతని రచనలు ప్రపంచము మన్ననల నందు కొన్నవి. మానవుఁడు సహజముగ నిట్టి భావోద్రేకజీవి. ఆ యుద్రేకము గత జీవితానుభవసంకలితము కావచ్చును. ఇట్టి యీ యుద్రేకశక్తియే, కవితావ్యక్తి

త్వము నేర్పఱుచునది. కాని, చారిత్రిక విషయములను, పఠిత కును నీ కవితావ్యక్తిత్వమునకును మధ్య నిలువనిచ్చినచో, కావ్యానుభూతియు, నానందోత్సాహములు, తాదాత్మ్య స్థితియు నందుకొనవలయునను నంతరాత్మ కాఘాతము కల్గును. భౌతిక విషయగవేషణకుఁ దన సహృదయ శక్తిని వ్యర్థపఱుచు నా పాఠకునిపట్ల కొంత సానుభూతి గూడ గల్గును. ఈ రీతిగా షేక్స్పియర్ ఆత్మీయతయు, నాతని కవిత్వానందమును బఠిత కనుభవనీయము కాక వ్యర్థమైపోవును. చారిత్రిక విమర్శనము లోని ప్రధాన దోష మిది. ఈ విమర్శన పద్ధతిని బురస్కరించు కొనియే "జాన్ సన్" 11 పండితుని రచనలలోఁ బ్రతిబింబించు నాతని యాత్మీయతకన్న, "బాస్వెల్" 12 క్రోడీకరించిన యాతని దైనందిన సంభాషణలు మన మన్ననలకుఁ బాత్రము లగుచున్నవి. "బైరన్" 13 లేఖలు గూడ నాతని కవిత్వ ముతో సమాన ప్రాతినిధ్యము వడసినవి. దైనందిన చర్యల యందు సామాన్య మానవ మనః ప్రవృత్తులే కానన గును. మహాకవులు కారయిత్రీ శక్తి ప్రభావ విలసితులు. అది వారి యంతరంగమునుండి స్వచ్ఛందముగాఁ బెల్లుబుకును. సహృదయ పాఠకునకు దాని సమగ్ర స్వరూప మా మహాకవుల కావ్యముల యందు సాక్షాత్కరించును. వారి నిత్యకృత్యములయందు తల్లే శము మాత్రమే గోచరించును. ఈ తారతమ్యము ననుస రించియే ప్రసిద్ధేతిహాస పాత్రలకంటెను, రూపక పాత్రలు మనకు సుపరిచితముగా నుండును. కాళిదాసు కేవల మహాకావ్యకర్త కాక, యుత్కృష్ట నాటక కవీశ్వరుఁడు. ఆతని "కుమార సంభవ" మహాకావ్య మందలి శివపార్వతు లక్షరరమ్యముగఁ దీర్చిదిద్దఁ

బడిన చిత్రములవలె ప్రత్యక్షమౌదురు. కాని శకుంతలా దుష్యం తులు, ఊర్వశీపురూరవులు, మాళవి కాగ్నిమిత్రులు, అన సూయా ప్రియంవదలు, చిత్రలేఖ, ధరణి, ఇరావతి మున్నగు వారు సజీవపాత్రలై మన పరిచయ సౌభాగ్యమునందిన ప్రియ మిత్రుల భాతి ప్రవర్తిల్లుదురు. ఆత్మావిష్కారకమగు భావను బట్టియు తులనాత్మకమగు నుచితానుచిత ప్రవర్తనను బట్టియు, శ్రవ్యదృశ్య కావ్యముల కీవిభేద ముప్పతిల్లును.

రూపకసృష్టితో సరితూఁగఁగల మహేతిహాసములు రామాయణ మహాభారతములే. ఇందలి కథాశిల్ప మాధునిక నవలను బోలినది. ఐరోపీయులు భావించు నితిహాస కవిత్వము కంటె నిందలి కవిత్వము భిన్నమైనది. నాటకీయపద్ధతు లిందిమిడి యున్నవి. అందుచేతనే యిందలి యనేక సూక్ష్మవివరణములు, క్షణికోద్రేక పరులగు నైరోపీయులకు విసువుపుట్టించును. పాశ్చాత్యేతిహాసములు తత్కాల సాంఘిక ప్రవృత్తుల ప్రభావమునకు లోఁగినవి. ఈ రీతిగా పరిసరప్రభావ పరిగణనము విమర్శన విధానమునందును నతిశయింపఁబడెను. సాంఘికచరిత్ర, సారస్వత చరిత్రవలె ప్రాముఖ్యము నందుకొనెను. కాని చరిత్ర, విమర్శనము కానేరదు. సారస్వత చరిత్రలో నెంత నిశిత పాండిత్యము గలవానికైనను, విమర్శనా దక్షత లేకపోవచ్చును. ఆధునిక కాలమున సారస్వత చరిత్రకారుల సంఖ్య పెచ్చు పెరిగినది. ఇది మహాప్రమాదము. వీరు విపరీత భారవాహకులు. వీరి కొక్కొక్కరి కొక్కొక్క సిద్ధాంతము, ఒక్కొక్క దృక్పథము నుండును. కాని వీర లత్యద్భుత భావయిత్రీ తేజః పుంజముతో నలరారు విమర్శక వరేణ్యులు మాత్రము కాక

పోవుట శోచనీయము. తమతమ కాలములకు ప్రాతినిధ్యము వహించు ననేకకవుల విషయముకూడ నిట్లేయున్నది. తమ కాలములకు ప్రాతినిధ్యము వహింపలేని మఱికొందఱు కవుల విషయమున సాంఘిక పరిస్థితుల ప్రభావము సన్నగిలినది. హోమర్, షేక్స్పియర్, కాళిదాసుల సాంఘిక జీవితములు, వారివారి కవితోపాసన కుపకరించువఱకు మాత్రమే మన కవసరము. వారి సాంఘిక ప్రవృత్తులు వారి కావ్యముల నుండియే విశేషముగ గ్రహింపనగును. అంతేకాని తత్కాల చరిత్రాంశములు పఠిత మానసమును సంచలన మొనరించి, కావ్యరస చర్వణమునందు తప్పుడు త్రోవలు దీయును. అట్లని చారిత్రిక విషయములవలన ప్రయోజనమే లేదని భావింపరాదు. అవి కేవల సామాన్యాంశములు. తత్త్వ ప్రతిపాదకములు కావు. చారిత్రిక పద్ధతి కావ్యమును గూర్చి కాక, కవిని గూర్చియు, నాతని భౌతిక జీవిత సంబంధమగు కావ్యమునుగూర్చియుఁ దెల్పును. అందువలననే యిది నిష్ప్రయోజనకరమగు పద్ధతి. ఇందు విమర్శకునిదృష్టి యప్రధానవిషయములయందు సమాహితమౌను. ఇందు ప్రధానవిషయము లప్రధానములౌను. అప్రధానవిషయములు ప్రధానము లౌను. ధిషణాధురంధరులైన వారి కీ సాంఘిక విజ్ఞానము కావ్యరస చర్వణమునం దవరోధము కాకపోవచ్చును. కాని సామాన్య మేధావుల కీ యవరోధ మనివార్యమే కాదు : అపకారకారకమ్ముకూడను. ఈ పద్ధతి కవిత్వమునుండి కవినికాక, కవినుండి కవిత్వ గ్రహణమునకు బంధించును. కవిత్వమూలమున కవి యాత్మీయతను గుర్తించుటే యుత్తమమార్గము. సాంఘికప్రవృత్తు లన్నియు

కవిపై ప్రభావమును జూపఁజాలవు. కవి మనః ప్రవృత్తులను సర్వతోముఖముగఁ ప్రతిబింబింపజేయున దాతని కావ్య దర్పణము.

బాల్యదశయందు 'షేక్స్పియర్' పై 'మార్లో' [14] 'కిడ్' [15] అనువారల ప్రభావ మెక్కువయని యాంగ్ల సారస్వత చరిత్ర తెల్పుచున్నది. ప్రథమ, ద్వితీయ శ్రేణికిఁ జెందిన కవీశ్వరులుకూడ, సాధారణముగా, వారి వారి బాల్యదశల యందు, తక్కువ జాతికిఁ జెందిన కావ్యప్రభావములకు లోనౌదు రని స్థూలముగాఁ జెప్పవచ్చును. కాని యంతమాత్రమున ప్రమాదము వాటిల్లదు. వారి మానసములు పరుస వేదుల వంటివి. అవి హీనకావ్యములనే కాదు, మఱి యెట్టి వస్తువుల నైన నపరంజిగా మార్చగలవు. అల్పమేధావులైన ఖండకవులు మాత్రమే విపరీతమగు స్వోపజ్ఞకుఁ బ్రయత్నింతురు. సారస్వత చరిత్ర, మనస్తత్వశాస్త్రము మానవమేధాసంజనిత శాస్త్రములుగా నేఁడు మిక్కిలి యభివృద్ధిగాంచినవి. ఇవిస్వోపజ్ఞ కెక్కువ గౌరవము నిచ్చుచున్నవి. కాని విమర్శనము నందు దీనివలన గల్గు ప్రయోజనము విశేషముగా నుండదు. "మార్లో" 'కిడ్' అనువారలు మనకును షేక్స్పియర్ కును మధ్య నిల్చి షేక్స్పియర్ కావ్యపఠన సమయమున మన హృదయములపైఁ బడు భావముద్రలను మసగయొనర్తురు. కావున మన కర్తవ్యమే మన, కవికిని మనకును మధ్య నిల్చిన యావ్యక్తుల ఛాయలను బరిహరించి, కవితో ముఖాముఖిని నిల్చి, యద్వైతానందము ననుభవింప యత్నింప వలయును.

చారిత్రిక విమర్శనము తడబాటు కల్గించును. దోష భూయిష్ఠమగు మానసికముద్రలు వేయును. సారస్వత ప్రత్యయమును నశింపఁజేయును. పఠితలను నీరసభావోపేతులను గావించును. సూక్ష్మపరిశీలనా విరహితమైన చరిత్ర పఠనము వలన నేర్పడిన కతిపయ పూర్వాభిప్రాయముల ననుసరించి "ఎలిజిబత్" యుగము వైభవోపేతమైనదనియు, నుత్తమ గుణరత్నముల కాకరమైనదనియు నేమేమో భావించి, తత్కాల సారస్వత పఠనమునకుఁ గడగిన, నాదినుండి యంతము వఱకును నా పఠనము ప్రశంసాత్మకముగనే పరిసమాప్తమౌను. అదియునుగాక తఱుచుగా కొందఱి పఠనము, విధ్యుక్త ధర్మముగ కొనసాగును. తమ పఠనమున కాధిక్యత గల్గించుట కొఱకును లేనిపోని ప్రశంసలు గావింతురు. మఱి కొందఱు, తాము రేయింబవళ్ళు కష్టించి సముపార్జించిన యీ విజ్ఞానముపట్ల తప్పనిసరిగా సానుభూతి ప్రదర్శింతురు. లేనిచో వారి పరిశ్రమము వ్యర్థమైనట్లు చింతింపవలసియుండును. మానవ శీలమును, సంపూర్తిగా గ్రహింప వలయునన్న కొంత సానుభూతియు, నభిమానమును గావలయును. విద్వేషము హ్రస్వ దృష్టిని కల్గించును. దురభిమాన మంధీభూతులను గావించును. కావున అసత్య విమర్శనము ప్రజా వివేకమును వక్రమార్గమున నడిపించును. సారస్వత సంబంధమగు విలువలను దారుమారొనర్చును. వర్తమాన సారస్వతముపై నేవగింపు గల్గించును. సరియైన భావుకుఁడీ విమర్శలకు లొంగఁడు. సత్యము చెప్పవలయునన్న, చారిత్రిక విమర్శన పద్ధతి పూర్తి భావనాస్వాతంత్ర్యము లేని యల్ప శ్రేణికిఁ జెందిన కవులపట్ల

మాత్రమే యుపకరించును. తమ కావ్యములకన్న నీకవుల జీవిత విశేషములే, పఠితల కాసక్తి గల్గించును. కాని యిప్పట్లను నసంఖ్యాకులగు సామాన్యకవులను గూర్చిన పొగడ్తలు శ్రుతి మించినవి; ఇవి పరిశోధనలను పెద్దనామముతో నాధునిక కాలమున చెలామణియగుచున్న యాధునిక విమర్శనములు. సూక్ష్మముగాఁ బరిశీలించిన, ఈ విమర్శన విధానముచే, రమ్య కవితారామములోనికి శాస్త్రము తన వ్యత్యస్త పాదములతో నడుగు పెట్టినది. ఇట్లనుట శాస్త్రము నగౌరవించుటకాదు. భూతము కూడ నొక పెద్దమనిషియేయని షేక్స్పియరంతటివాఁడు గౌరవ మొసఁగెను. భూతము కేవలము పెద్దమనిషియేకాదు. అంతకన్నను నధికమైనది; యత్యంత ప్రయోజనకారియు, ననివార్యము నైనది. అట్లే శాస్త్రముకూడ, బహుముఖ మానసిక వ్యాపార వృక్షమునకుఁజెందిన యొక బృహచ్ఛాఖ. రాక్షసునకు స్వర్గమందు స్థానములేనట్లే, శాస్త్రమునకుఁ గూడ నీ కవితోద్యానమున నడుగిడుపనిలేదు. విషయ సేకరణము గావించి, సాధారణీకరించుట శాస్త్ర విధి. దాని దృష్టిలో సర్వము సమానము. దైవసదృశుఁడగు మానవుఁడైనను, మత్కుణమైనను, విత్తనమైనను, విరియైనను దానిదృష్టిలో నొక్కటియే.

విమర్శనమునం దిట్టి పద్ధతి ప్రవేశించుటచే విషయ సాంద్రత యెక్కువైనది. సారస్వత రంగమునం దప్రధాన వ్యక్తులకు ప్రాధాన్య మేర్పడును. ఆ వ్యక్తుల ప్రాధాన్యము చరిత్ర సంబంధియైన కావచ్చును. సారస్వత దృష్టితోఁ జూచిన, వారు చైతన్యరహితులే. కాని, యీ పద్ధతివలన వీరే సారస్వ

తేయులుగాఁ బరిగణింపఁబడు దురదృష్టముగూడ వాటిల్లును. శాస్త్రీయమైన చరిత్ర, యే రీతిగా వ్యక్తిప్రాధాన్యమును రూపటచి, యుద్యమ ప్రాముఖ్యము నుద్ధరించినదో, యట్లే యీ విమర్శన విధానమును కావ్య విశిష్టతను పర్యుదాస మొనర్చి, కవి సాంఘిక ప్రవృత్తులకే పట్టము గట్టుచున్నది. అందుచేతనే యాధునిక కవులు, విశ్వజనీన భావముల నాదరించుటకు మారుగా, వాస్తవిక విషయములను, ప్రాంతీయ తాత్కాలిక నైతిక పతనములను, స్వకీయ మనః ప్రవృత్తులను, వైచిత్ర్యములను గావ్యవస్తువులు గావించుకొనుచున్నారు. ఇట్టి యల్పాల్ప విషయములు కావ్యవస్తువులుగా స్వీకరింపఁబడుట క్షీణయుగ లక్షణము. ఇది భావ దారిద్ర్యయుగమౌను. తనకుఁ బూర్తిగా బోధపడని విషయభారముతో నీ యుగ మాడంబరత్వమునకు, పాండిత్య ప్రకర్షకు గురియగుచున్నది. కవితా సృష్టి కలాపమునకు సామర్థ్యము చేకూర్చు శక్తులతో నీ యుగ మనుబంధమును ద్రెంచుకొనుచున్నది. ఇట్లు క్రమక్రమముగా నీయుగము మనఃపూర్తిగా నిజ పతనమున కొడిగట్టుకొనుచు, సారరహిత స్థాయికి దిగజారినది. ఏతత్కారణముచేతనే 'కాలిమోకస్'[16] 'అపోలోనియస్'[17] 'సిమొనైడ్సు'[18] లు అపర 'హోమర్లు'గా పరిగణింపఁబడిరి. 'టెనిసన్'[19] అపర 'షేక్స్పియరు' గను 'కిప్లింగ్'[20] అపర'మిల్టన్'గను బరిగణింపఁబడి గౌరవభాజను లగుచున్నారు. ఈ యుగములకును వానికి నశుభ దాయకమగు సామ్యములు కొన్ని సరిపడుచున్నవి. ఇంత కన్న పతన మింకేమి యుండును? కావున సారస్వతమున చారిత్రిక విమర్శ బహుళ ప్రమాదభూయిష్ఠము. ఇది పరిహారణీయము.

౫

# భారతీయ రూపకములు

భారతీయ కావ్య ప్రపంచము భారతీయుల జీవిత ప్రవృత్తులను ప్రతిబింబించుటకే ప్రధానముగ నేర్పడలేదు. రసానందమును ప్రసాదించుట దాని ప్రప్రథమ ధర్మము. మానవ హృదయ నిహితమగు రసపిపాసను మృదు మనోహరముగ ప్రేరేచుట దాని ప్రధాన లక్ష్యము. భారతీయ కావ్యములు నిశిత పరిశీలనాజనితమగు సజీవ భావచిత్రములను పాఠకుల మనఃఫలకములపై రమణీయముగ చిత్రించును. అంతేకాని మానవతత్త్వముతో సిగపట్లుపట్టి, రచ్చకీడ్చి, భీతినో, భీభత్సమునో, కరుణనో ప్రేరేపించుచు, చదువరులను తత్తద్భావములయందు తలమున్కలగునట్లు గావించుట, ఈ కావ్య మర్యాదకాదు. 'ఈడిపస్' [21] 'మాల్ఫీరాణి' [22] బాధలయందుగాని, 'మాక్‌బత్' [23] 'ఓథెలోల' [24], విషాద గాథలయందు గాని భారతీయ సహృదయునకు రసానందోత్కర్ష లభింపదు. ఆగాథ లొక విధమగు ననాగరకము, నాటవికమునగు చిహ్నములతో నొప్పునవి. ఉత్తమ భావోపేతము, సమాన సద్భావ విలసితము నగు నాధ్యాత్మిక ప్రవృత్తిగల హైందవునకీ చిహ్నములు రుచింపవు. ఇట్టి హైందవాధ్యాత్మిక ప్రవృత్తి కరుణారస రూపమున సుస్నిగ్ధమై, బుద్ధదేవుని పవిత్రాత్మ వినిర్గతమై బాహాటముగ గోచరించినను, రసానంద రూపమున భారతీయ కవితాకళయు నిట్టి యుదాత్త ప్రవర్తననే ప్రసాదించినది. కేవల హృదయాకర్షణమే కాక, హృదయోన్నతికిని తత్కాళ

సాహాయ్యా పడినది. ఇట్టియుత్తమాశయములు రసద్వారమున సునాయాసముగ సిద్ధించుచుండుటచే, రసపరిపోషణమే రూపక నిర్మాణమునకు ప్రాతిపదిక యనక తప్పదు. తక్కిన బాహ్యాంగము లంతగా ప్రధానములు కావు. కాన భారతీయులు, భయానక కృత్యములతో గూడినట్టి రూపకములందుగాని, ఎలిజబెత్తు కాలమున తామర తంపరగా వెలసిన విషాదాంత రూపకముల పట్ల గాని విశేషమగు మక్కువ చూపరు. ఇవియే కాదు. గ్రీకుల నాకర్షించిన విషాద నైతిక సమస్యా ప్రతిపాదకము లైన రూపకముల యందును వీరికి సహజ సానుభూతి లేకపోయెను. ఈరీతిగనే, తీవ్ర వ్యాధులను, విచ్ఛిత్తి విధానములను, ఆధ్యాత్మిక వినాశనత్వమును బ్రవేశపెట్టెడి యాధునిక రూపకముల యందును, కల్పనా కావ్యముల యందును, భారతీయులెట్టి యభిరుచినిచూపరైరి. అభినవ సౌందర్య సముద్దీపిత వాతావరణము, మధుర భావానుభవ సమత్వము, అత్యుత్తమ రాజమర్యాద లాంఛనా విలసితము, రమణీయ ప్రకృతి ప్రభావ ప్రత్యయములతో విరాజిల్లునవి భారతీయ రూపకములు. జాలి, భీతి యను భావములను; హృదయాను భూతులను సముద్దీపిత మొనర్చుటకు మాత్రమే యే తద్రూపక కర్త లుద్యుక్తులౌదురు. కాని వానిని చీల్చి చెండాడి వికృత మొనర్పరు. రూపకము మంగళాంతము కావలయును. మధ్యలో విషాద మేఘము లలముకొన్నను, అవి యచిర కాలముననే యంతరించును. ఇట్టి బృహత్కళానుభవమునందే యంతరాత్మ శాంతితో రమించును. అట్టిశాంతి రతిచే మృదుల సంస్కృతీ సంపదయు, స్వచ్ఛమగు రసానందము సంపాదింప నగును. ఏ

తత్సంపాదనాన్వేషణా తత్పరుఁడు, నవ్యవస్థిత నిత్య నైమిత్తిక పరుష జీవితమును విస్మృత మొనర్చుకొని, దివ్యాద్భుత కళాలోకమునకు ప్రయాణ మొనర్చును.

కథా సంవిధాన నైపుణ్యము, సన్నివేశ కల్పనమునం దనల్ప సామర్థ్యము, నిశిత కళాసౌకుమార్యము, విస్పష్టత, సంభాషణాచణత్వము, నాటకోచిత కవితాశైలి, మున్నగునవి ప్రదర్శన యోగ్యమగు రూపకమును రూపొందించును. కాని యొక మహా రూపక నిర్మాణమున కింతకన్న నత్యధికమగు భగవత్ప్రసాదిత శక్తి కావలయును. అదియే నాటకోచిత శీల చిత్రణము. ఇది యనేక రీతులుగా ననేకుల కలవడును. ఒక్కొక్క వేళ మానవ జీవితానుభవముల బట్టియు, మఱియొకప్పుడు నిశిత పరిశీలనా దక్షత వలనను, ఇంకొక్క వేళ నల్పసంఘటనలాధారముగా నూహాజేయు నైపుణ్యమును బట్టియు, వివిధ మానవాళియందు సంగమెఱుఁగని సానుభూతి కల్గి, తదనుభూతి నంతర్వ్యక్తము కావించుకొనుటయే కాక, దానినుండి సమయోచితముగ ప్రకృతము లైనవాని నెన్నుకొని ప్రకటింపగల్గుటను బట్టియు వివిధ రీతులుగా నీ శీలచిత్రణ విద్య రాణించుచుండును. పాశ్చాత్య పండితులు ప్రశంసించు నీ శీల చిత్రణాశక్తి, భారతీయ దృశ్యకావ్యములయందు కొఱంత నడినది. 'గథే' [25] వంటి కేవల కవి, కాళిదాస శాకున్తల రూపకము నఖండాద్భుతముగ ప్రశంసింపనచ్చును. కాని యాతనికంటె వైదుష్యము, విమర్శనా దక్షతగల పాశ్చాత్య విపశ్చిద్వర్యుఁ డెవ్వఁ డిట్టి పూజా ప్రసూనముల నా రూపకమునకు సమర్పింపఁడు.

భారతీయ కవిత్వమునందు కళాసంపత్తి కలదు. కాని, మేధావిదగ్ధత లేదు. విపరీతమగు నూహ కలదు కాని, విస్పష్టమగు భావన శూన్యము. శబ్దాడంబరత్వము ఎక్కువ. మానవత్వ విమర్శ మృగ్యము. సుందరమై హృదయమును గరగించు శక్తి కలదు కాని, యందు శీల చిత్రణ మసలే లేదని పాశ్చాత్య పండితులు విమర్శింతురు. ఆధునిక భారతీయ విద్యావేత్తలు కూడ తాము నేర్చిన ఈ చిల్కపల్కులనే పల్కుచుందురు. విస్తృత సంస్కృత భాషా పరిజ్ఞానముగల యొకానొక భారతీయ విద్వాంసుఁడే, భారతీయునకు తత్త్వతః స్వోపజ్ఞకమగు సృజనాశక్తి శూన్యమని వాదింప సాహసించెను. మహాభారతమందలి మహిమాన్విత మగు పాత్ర సృష్టియంతయు, వాస్తవిక ప్రపంచమందలి వ్యక్తులే యైయుందురనియు, లేనిచో భారత కవీశ్వరుఁ డెవ్వఁడుకాని యట్టి సత్యశక్తి యుక్తమగు పాత్ర సృష్టి గావింపఁ జాలఁడనియు నాతఁ డారోపించెను. ఇది యిట్లుండ, కేవల శాబ్దిక పాండితీ ప్రకర్ష లేనివారయ్యును, సారస్వతాభిరుచియు, నభినివేశమునుగల వంగీయ విమర్శకులు, కాళిదాస భవభూతుల పాత్ర సృష్టి సౌందర్య విలసితమైనదనియు, ఎలిజబెత్ యుగ రూపకమందలి యే పాత్రకును దీసిపోదనియు, ననర్గళముగ చాటుచున్నారు. ఇట్టి ప్రబల భావవైరుధ్యమును గ్రహింప నసాధ్యముకాదు. ఏలయన నిట్టి భావవైరుధ్య మనేక విషయముల యందు స్పష్టముగ గోచరించును. విమర్శనమునందు, జాతీయత యందు, జాతీయ పాత్ర సృష్టియందును, జాతీయ దురభిమాన మందును, ప్రౌఢ కవిత్వావగాహనము నందును గూడ నిది మనకు సువిదితమే. అభి

నయ ప్రధానమైన పాత్రలను ప్రశంసించు బుద్ధికుశలత సామా న్యాంగ్లేయునకుఁ గూడ కలదు. కాని నాటక రంగాభి ముఖమైన నాగరక పాత్రాభినయ విశేషములనుగాని, యొక హానముద్రలోని భావ గాంభీర్యమును గాని, సందర్భోచితమైన యొక్క మాటలోని మహితశక్తిని గుర్తించు యుక్తిగాని యాతనికి తత్త్వతః శూన్యము. యూరపు దేశములు మొత్తముపై నిప్పటికిని పరిపూర్ణ నాగరికస్థాయి నందుకొన లేదు. ఆ ఖండవాసుల మానసములు భౌతికకక్ష్య నతిక్ర మింపఁజాలవు. తేజో విహీనమైన, బాహ్యాడంబర జీవిత భోగానుభవములందే వారి కాసక్తి. ఇట్టి బాహ్యాడంబర జీవిత ప్రదర్శనములకు, నగ్న సౌందర్యమునకు, వశంవదులుగాని, సంస్కృతీ సంపన్నులే కొలఁదిమందియో సకృత్తుగా నుందురు. భారతీయుఁడు తన ప్రవర్తనమునందు దుద్వేగము సేవగించు కొనును. అతిభాషిత్వ మాతనికిఁగిట్టదు. ఆడంబరత్వ మంగీక రింపఁడు. మానవత్వము, సహాన సద్భావ విలసనము, సంయ మనము వానికి ప్రాణములు. అట్టి లక్షణములను పుణికి పుచ్చు కొనుట భారతీయుని పరమాశయము. ప్రతిఆర్యుఁడు, అనఁగా సచ్ఛీలముగల ప్రతివ్యక్తియు, మితాచారుఁడుగను, మితభాషి గను నుండును. ఇది భారతజాతీయ దృక్పథము. తద్దృక్పథము భారతీయ ప్రముఖ కావ్యములం దంతటను దర్శనీయము. మన వాఙ్మయమునందు మహాభారత మొక విలక్షణేతిహాసము. ఇది భౌతిక విషయములనే యధికముగ పేర్కొనును. అందుచే నితిహాసమును గూర్చి యైరోపీయనులకు గల యభిప్రాయమున కిది సన్నిహితముగ నుండును. అయినను తద్విరుద్ధమగు లక్షణ

ములును నింద నేకములు కలవు. ఇందలి ధీకుశలత; ఉద్రిక్త పాత్రలకు, ఘోర కృత్యములకు కారణ భూతమగు మానసిక పరిస్థితులు; అందందు గోచరించు పవిత్రాశయములు; నాగరికతా గభీరతలు; ఉదాత్తాశయములు; మున్నగు నార్యలక్షణములు ఐరోపియన్ పండితులకు బాధాకరములైనవి. అందుచే భారతీయ వాఙ్మయమును పరామర్శించిన పాశ్చాత్య విమర్శకులకు భారతేతిహాసమున భీముఁడొక్కఁడే యచ్ఛమగు నితిహాస పాత్రగా పొడగట్టును. అందులకు కారణము, భారత పాత్రలలో భీముఁడొక్కఁడే దుర్వార బాహువిక్రముఁడు; భయద స్ఫురణాపరిణద్ధమూర్తి; పేర్చిన కోపాటోపవర్తి. భారతీయుల యభిప్రాయము ననుసరించి, యితిహాస పాత్రలు. కేవలోద్రిక్త సంచలనత్వమునకు, స్వేచ్ఛా సంచాలనమునకుఁ గట్టుపడునవి కావు. సాధుత్వము, ప్రశాంతత్వము, ఆత్మ వితరణము, పావిత్ర్యము, మున్నగు ననేక గుణములను బ్రతిబింబించునవి భారతీయేతిహాసములు. రఘుకుల దీపకుఁడగు శ్రీరామచంద్రుఁడు, పితృవాక్య పరిపాలనార్థమై మహీరాజ్యము నతిప్రశాంత మానసముతో విసర్జించుటే కాదు; భీముఁడు కోపోద్రిక్తుఁడై, రోషాయితమూర్తియై, యజేయ్యుఁడై, కీచకాధముని పరిమార్చుటయు నితిహాస లక్షణమే. కాని పాశ్చాత్యేతిహాసములు తొలి తెరవుకన్న, మలి తెరవు నెక్కువగా నాదరించినవి. ఐరోపియను స్వభావము, సద్గుణముల యందుకన్న, దుర్గుణములయం దెక్కువ మక్కువ కలది. అది క్రైస్తవ గుణములను నిజముగా నిరసించినది. అవి యసమర్థతతోఁ గూడిన సద్గుణములే కాని, సమర్థతతో కూడిన సద్గుణములు కావని ఐరోపి

యనుల భావన. అందుచే సత్పురుషుల సానుభూతి సంపాదించుట కూడ నైరోపియన్ రచయితలకు దుష్కర మైనట్లు సారస్వత పరిశీలనమునుబట్టి తెలియును. ఇట్టి యీ లక్షణముల కన్నింటికిని భారతీయ దృక్పథము వ్యతిరిక్తమైనది. ఈ వ్యతిరిక్తత ఐరోపియను పండితులకు సహింపరానిదైనది. అందుచే వారు తమ యభిప్రాయములకనుకూలముగా, ప్రాచీనజానపదేతిహాసములవంటి యితిహాసముల రచించుట కుద్యమించి, తన్మూలమున తమ యుద్రిక్తతను కొంత సడలించుకొనసాగిరి. ఇట్లు రచింపఁబడిన యితిహాసము నందలి ప్రధాన పాత్రలు, భారతేతిహాసమునఁగల కేవల దుష్టపాత్రల వంటివి. అందలి సత్పాత్రలిందు దుష్ట పాత్రలుగా చిత్రింపఁ బడినవి. ఆ పండితమ్మన్యు లింకను, భారతేతిహాస మొక కపటమానుల వికటనాటక మనిరి. అది యాటవిక లక్షణాత్మకమగు భారతీయ గాథయఁట. భారతీయుఁడీ విమర్శనము నవ్యవస్థితాడంబర కుటిల భావనావికారమని భావించును. ఇట్టి యాడంబరత్వ మాగడ్డలోఁ బుట్టిన సెలయేఱు. కాలానుకూలముగ కొంత నాగరికత్వ మలవడినను, ఇంకను నాదేశీయులలో ప్రాచీనపుట నాగరిక చిహ్నములు నిల్చియే యున్నవి. తత్కారణముచే, మేధావికసితమైన నాగరికతపట్ల వారికి సంపూర్ణ సానుభూతి లేదు. సాధారణముగ, పాత్రపోషణము నందలి దృక్పథములలో గల ఈ తారతమ్యము; ప్రత్యేకముగ, రూపకేతిహాస శీల చిత్రణమునం దుద్భవించిన క్లిష్ట విమర్శనములోని ఈ విభేదము; సర్వత్ర నన్వయించుకొన నగును. కాని భారతీయ రూపక పరామర్శకు పృథక్పరిజ్ఞాన మవసరము. ఏలయన ఈ

విభేదత్వము లోలోతులకుఁ బాతుకొనిపోయి, యనేక బాహ్య
పరిస్థితులచే స్థిరమైనది.

భారతీయ రూపకములకును, ఎలిజిబత్తుయుగ రూపక
ములకుగల సామ్యము లందఱు గుర్తింపవచ్చును. గద్యమును,
పద్యమును వాడుట; కాలమును దేశమును స్వేచ్ఛగ నుపయో
గించు కొనుట; సుఖాంత రూపకములనుగూడ విషాద శబలిత
మొనర్చుట; నాటకోచిత కవితాశైలి; భావానుభవ ఋజు
త్వము ఈ విశిష్ట వాఙ్మయద్వయము నందుగల సామ్యములు.
ఈ రెండింటికి కతిపయ విభేదములుకూడ కలవు. కాని యవి
సామ్యములవలె సులువుగా గోచరింపవు. సామ్యములు రూపక
బాహ్య స్వరూపమునకు సంబంధించినవి. విభేదములు తత్త్వ
సంబంధులు. ఇవి సామ్యములకన్న శక్తిమంతములు; ఆంతరంగిక
ములు. ఎలిజిబత్ యుగ రూపక వాఙ్మయము, ప్రజాభిమాన
మును చూరగొన్నది. తత్కాల వాస్తవిక ప్రజాజీవన ప్రతి
బింబత్వమే దాని పరమాశయము. విమర్శనాదక్షమగు ప్రేక్షక
వర్గమును గాక, సామాన్యాసామాన్య ప్రేక్షకవర్గమును
సంతోషపెట్టుటకే యీవాఙ్మయ ముద్దిష్టము. అందుచే తదితర
ప్రజావాఙ్మయములకుఁ గల లోపాలోపములు ఈ వాఙ్మయము
నందును విశదము. తీవ్ర భావోద్వేగము, తదనుకూల చేష్టలు;
పరిపూర్ణ జీవితావగాహనము; మున్నగునవి ఈ వాఙ్మయ
మందలి సుగుణములు. అనాగరక తీవ్రచర్యలు; అసమగ్ర కావ్య
శిల్పము; సౌందర్య రాహిత్యము; అత్యుక్తుల యుత్కర్ష;
అమానుష చేష్టలు, మున్నగున వీవాఙ్మయమున సాక్షాత్క
రించు దుర్గుణములు. భారతీయరూపకము లిందులకు వ్యతి

రేకమైనవి. కవితాసంస్కృతీ సంపద్విలసితులచే, విద్యా సంపన్నులు, రాజోద్యోగులునైన ప్రేక్షకుల కొఱకివి రచింపఁ బడినవి. ఏతత్కర్తలు సమగ్ర కవితాతత్త్వమును మథించిన ధిషణా ధురంధరులు. అందుచే ఎలిజబెత్కాల రూపకకవితా హార ప్రమత్తులగు నాంగ్లవిద్వాంసులు, భారతీయ రూపకములలో, స్వభావోన్మీలనము మృగ్యమనియు, అసలు భారత రూపకకర్తలు సృజనాశక్తి విహీనులనియు, నేకకంఠమునఁ జేర్కొనిరి. భారత కవులకేకాదు; ఆసియాఖండ కవిత్వమందే సృజనాశక్తి శూన్యమఁట. ఈ లోపమును గప్పిపుచ్చుటకే తత్కర్తలు తమ కవిత్వమును వ్యర్థవిశేష వర్ణనలతోడను; బాహ్య ప్రకృత్యనుకరణలతోడను నింపింతురనియు వారు నిందింతురు. ఈ రీతిగా చెలరేగిన విమర్శనలను బఠించి, విద్యా వేత్తలైన భారతీయులును, భారతీయ కవితారసచర్వణ పరాఙ్ముఖులై, ఆ విమర్శనలకు 'తంధానతాన' పాడిరి. అయినను కాళిదాసాది భారతీయ మహాకవుల కవిత్వము నుపాసించు కళాప్రియుఁ డిందుల కే మాత్రము సంచలింపవలసిన పనిలేదు. భారతీయరూపక ప్రతిపాదిత విశిష్టాదర్శ సంఘము నాతఁడు విస్మరింపకుండు గాత !! శకుంతల యొక శూన్యవాచాలయని భావింప నవసరములేదు. ఊర్వశి యొక యందమైన కీలు బొమ్మ యనియు నీతఁడు తలంపకుండ నుండుగాక !! పాశ్చాత్య విమర్శనలు ద్వేష భావోత్పన్నములు. రచయితల బుద్ధి నైశిత్యమునకు, విమర్శనాపటుత్వమునకు నీ వ్రాఁతలు నిదర్శనము లగునేకాని వారి విశాల సహృదయత్వమునకు మాత్రము చిహ్నములు కానేరవు.

ఇటలీదేశమునందు పదునాఱవ శతాబ్దమున జరిగిన కొన్ని సంఘటనములను బురస్కరించుకొని 'వెబ్‌స్టర్' కవీశ్వరుఁడు రచించిన " వైట్ డెవిల్ "[26] వంటి రూపకమునుగాని; 'మార్లో' రచించిన "జ్యూ ఆఫ్ మాల్టా"[27] యను నాటకమువంటి దానినిగాని భారతీయకవి రచింపలేదేయని యాశించినవారు విఫలురు కాక తప్పదు. అది నిష్ప్రయోజనము. అతఁడట్టివిపరీత భయానకాద్భుత రూపకములను సృజింపఁడు. అందుచేతనే "కింగ్‌లియర్"[28] "మాక్‌బత్" ల వంటి రూపకములను భారతీయుఁడు సృజింపలేదేయని పెదవి విఱచినను లాభము లేదు. ఈ రూపకసృష్టి యంతయు నొకవిధముగ ననాగరిక ఆటవిక జాతీయవిధానమున కొకింత యాదర్శీకరణమన నగును. ఎట్టి విషమపరిస్థితుల యందుగాని, యెట్టి నిష్ఠుర కష్టసమయముల యందు గాని, యార్యుఁడు, తన నాగరికతా సహాన సంస్కృతీ స్వభావమును గోల్పోఁడు. ఐరోపియనులచే నాగరిక తుల్యుఁడుగాఁ బరిగణింపబడిన ఆఫ్రికాఖండ మూఢ ప్రజలస్థాయి కీతఁడెన్నఁడును దిగజారఁడు. 'బల్‌జాక్' వలె 'పెరిగోరియట్'[29] వంటి నవలను సృజించుట కుద్యమించినను 'గస్టేవ్ ఫ్లాన్‌బర్గ్' రచించిన 'మాడమ్‌బవరీ'[30] వంటి యద్భుత కావ్యమును వ్రాయ నుంకించినను నాతని ప్రయత్నము వ్యర్థమౌను. అండవి పాశవిక పాత్రలనుబోలినవ్యక్తు లన్ని దేశముల యందును నన్నికాలములయందు నున్నను, భారతీయ కళా సృష్టి యిట్టి కావ్య నిర్మాణమునకుఁ గడఁగి, పరిశుద్ధమగు నాత్మశక్తిని న్యాసపఱుచుకొని, నైతికపతనమున కొడిగట్టదు. ఏ వాఙ్మయము మనకెట్టి సౌందర్యసంపద్విశిష్టతలను బ్రసాదించు

లక్ష్యముకలదో గుర్తించి, యట్టిదాని నన్వేషించి యానం దించుటకుఁ బ్రయత్నింపవలయును గాని, అది యుద్దేశింపనిదాని నందుండి యాశించుట యవివేకమౌను. అది సహృదయ విమర్శన మనిపించుకొనదు.

---

# ౬
# శీలచిత్రణము
## (i) పురూరవుఁడు

సునిశిత పరిశీలనముతో కాళిదాసు, వివిధరాజన్యుల స్వభావ స్వరూపములను దన కావ్యములలోఁ జిత్రించెను. అట్టి పరిశీలనమునందు పురూరవుని శీలచిత్రణము ద్వితీయము.

పురూరవుఁ డగ్నిమిత్రునికన్న నన్నివిధముల విభిన్నుఁడు. అగ్నిమిత్రుఁడు యువరాజు; యోధుఁడు; సౌందర్యోపాసకుఁడు; కామోద్రేకరహితుఁడు; రాజలాంఛనోపేతుఁడు; సాధు పురుషుఁడు. అమాయికతాద్యోతక ముఖద్యుతి; యువరాజోచిత ఠీవి; ఝటితిస్ఫూర్తిగల యాలోచన; దయా ధర్మ వర్తనము గలవాఁ డీతఁడు. సమయానుకూలమగు సామర్థ్యము గలవాఁడు. అపరిమిత భోగానుభవలాలసుఁడు. మాళవికా నాట్యప్రయోగముపట్ల నీతఁడు ప్రదర్శించిన బుద్ధికుశలతను బురస్కరించుకొని, ధారణి, ''ఆర్యా ! రాజకీయములందును

నిట్టి చాకచక్యము, నేర్పరితనము ప్రదర్శించిన మేలు వాటిల్లును గదా!" యని తొలుతనే హెచ్చరించును. ఇట్టి వర్తనమే వక్ష్యమాణకథయందును గాంచనగును. తన ప్రేమకలాపమం దతఁడు ప్రదర్శించిన యమాయికత, నేర్పరితనము, సంతోష జనకమైనవి. కుటుంబవిషయములం దీత డెంతయో మక్కువ చూపెను. భోగాసక్తియుక్తమగు రసిక ప్రవృత్తిగల్గియు, వీరత్వముతో విలసిల్లు యుగమున కీతఁడు ప్రతినిధి.

కాని పురూరవుఁ డిట్టివాఁడు కాఁడు. ఈతఁడును వీరుఁ డైన చక్రవర్తియే. ఉత్తమవంశ సంజాతుఁడు; ఉత్తమగుణ రత్నాకరుఁడు. అయ్యును నీతని స్వభావము పార్థక్యముకలది. ముఖ్యముగా నీతఁడు కవీశ్వరుఁడు; ప్రేమికుఁడు. ఇట్టి శీలము లను 'షేక్స్పియర్'కూడ కొన్ని చిత్రించెను. "రెండవ రిచ్చర్డు"[31] ఇట్టివాడే! "రినాన్"[32] కవీశ్వరుఁడు తన "యాంటిక్రైస్టు"[33] నందును నిట్టి కల్పనము కావించెను. వీనితో తులనాత్మకమగు విమర్శఁగావించిన, యూరోపియన్ కావ్యమర్యాద లీ విషయముపట్ల నెట్లు ప్రవర్తిల్లెనో గ్రహింప నగును.

కవియే రాజగుట యూరోపియనునకు కిట్టదు. అట్టి యేర్పాటు వాని బుద్ధి కస్తవ్యస్తముగ నుండును. కవికి కావల సిన గుణములు, రాజ్యపరిపాలకున కవసరమైన గుణములు, తేజస్తిమిర న్యాయమున నుండునని యాతని భావన. ఆంతరంగిక భావన కవితాస్వభావమునకుఁ జీవగఱ్ఱ. ఆత్మభావనారతుఁడగు కవి, రాజ్యపాలకుఁడైనచో, ప్రజా జీవనావసరములు సక్ర

మముగా నిర్వహింపఁబడవు. అతనిమానసము భావాంబర వీథిలో విహరించును. ఆతని చింతన మాలంకారిక ప్రపంచమున సంచరించును. ఆతని యూహలు నేలను, నింగిని తాళములుగాఁ జేసి వాయించునవి. అట్టి యాతఁడు వాస్తవిక ప్రపంచధోరణికి దిగజార నేరఁడు. అందుచే నాతఁడు కార్యశూరుఁడు కానేరఁడు. అట్టి కవిచేతికి రాజ్యాధికార మబ్బిన, తన మనోధర్మము ననుసరించి ప్రవర్తించునేకాని, లోకధర్మ మర్మముల నవగాహన మొనర్చుకొన నేరఁడు. కార్యకారణ సంబంధ సంజనితము లగు సంఘట్టనముల నాతఁ డూహింపఁ జాలఁడు. ఆతఁడు భీరువు కాకున్నను, ధైర్య సాహసోపేతుఁడే యైనను, దుర్బలుఁడుగను, నసమర్థుఁడుగను పరిగణింపఁబడును. అంతేకాదు, అట్టివానిని నిరంకుశుఁడందురు. ఏలయన నాతఁడు తన్ననుసరించి ప్రవర్తించువారి నాదరించును. తన్ను వ్యతిరేకించు వారిని దండించును. అందుచే రాజకవి పరిపాలన దుఃఖాంతమే యగుచున్నది. ఆతని యంతఃపురము, హత్యలకు, నల్లకల్లోలములకు నాలవాలమగును. రాజ కవులనుగూర్చిన యిట్టి యుదాహరణము లనేకములు చరిత్రనుండి యుద్ధరింపనగును. "నీరో"[34] బవేరియా ప్రభువగు "లుడ్‌విగ్"[35] లిందులకు సముచితమగు దృష్టాంతములు. బ్రిటీషుదీవుల పాలకులలో మన కిట్టివారు విశేషముగ లభింతురు. 'స్టువార్టు' వంశీయు లందఱు పుట్టుకచేతనే కవీశ్వరులు. వారు తమ దురదృష్టము కొలఁది సింహాసననాయాథులు కావలసివచ్చినది. ఇందులకు "రెండవ ఛార్లెస్"[36] మాత్ర మపవాదము. 'ఆఱవ జేమ్సు'[37] పండితుఁడే యని సంకోచింపఁబనిలేదు. ఈతనిని కవితుల్యుఁడుగాఁ బరిగణింప

నగును. తక్కినవారందఱు కళాభినివేశము, భావుకత కల వారలు. ఆచరణయోగ్యముగాని యాదర్శములు కలవారు. ఇందు కొందఱకు, తమ కళాభినివేశ తత్పరతలను బరులపై పునుపునట్టి సామర్థ్యముకూడ కలదు. పైన పేర్కొనినట్లు రెండవ చార్లెసునకు మాత్రము వాస్తవికదృక్పథము కలదు. ఈతఁడు వాస్తవిక స్థితిగతుల నవలోడించి, యతిప్రశాంత చిత్తముతో నాచరణమార్గమునం ద డు గు వే య క ల ( డు. "మొదటి జేమ్సు"[38]నకు గూడ నిట్టి దక్షత కొంతవఱకు గలదు. కాని రాజకీయ దురాలోచనలచేతను; సమయోచిత వివేకహీనతచేతను; ప్రతిపక్షులపట్ల ప్రదర్శించిన కాఠిన్యము చేతను; దక్కినవారివలె నీతఁడును బలితుఁడు కాక తప్పలేదు. ఇట్టివారు భారతీయ చరిత్రయందును లేకపోలేదు. కల్హణుఁడు వ్రాసినట్లుగా కాశ్మీర దేశాధిపతియగు శ్రీహర్షుఁడు, నిట్టి రాజకవియని మనకుఁ దెలియుచున్నది. అందుచే నిట్టికోవకుఁ జెందిన పురూరవ పాత్రను కాళిదాసుఁ డే రీతిని తీర్చిదిద్దెనో పరిశీలించుట యాహ్లాదకరము.

భారతీయ కవీశ్వరుఁడు, రాజకవి పాత్ర చిత్రణమునం దసమర్థతను, పరాజయమును, విషాదమును బ్రదర్శింపకుండుట మన కాశ్చర్యము గొల్పును. పురూరవుఁడు మహాచక్రవర్తి. ప్రజానురంజకుఁడు. అప్రతిహత పరాక్రమోపేతుఁడు. గౌరవ భాజనుఁడయిన దేవమిత్రుఁడు. యుద్ధరంగమునందు, పరిపాలనా విషయమునందు, ప్రేమకళాకలాపమునందు నీతఁ డఖండవిజయ శ్రీ విలసితుఁడు. ఇట్లు చిత్రించుటచే కాళిదాసునకుఁ బ్రాపంచిక పరిజ్ఞానము లేదని కాని, మానవస్వభావము నెఱుఁగఁడని కాని

యననగునా ? ఇతర కావ్యములయందు నాన్యతో దర్శనీయ
మగు కూలంకషకళాప్రతిభ ప్రదర్శించిన కాళిదాసుపై నిట్టి నింద
మోపఁగల సాహస మేరికుండును ? కవితోపాసకులు: క్రియా
నిపుణులు, పరిపాలనా దక్షులును నగుట, మానవస్వభావ
విరుద్ధమని యెక్కడను శాసనములేదు. 'మొదటి చార్లెస్'[39]
'నీరో' యనువారలు కళాత్మకశీలురు. కాని వారు రాజరిక
ముచే శాపోపహతులైరి. గ్రీకుసార్వభౌముఁడు "అలెగ్జాం
డరు"[40] ఫ్రెంచి సార్వభౌముఁడు "నెపోలియన్ బొనా
పార్టు"[41] సమ్రాట్కవీశ్వరులే. వారెక్కడను నసామర్థ్య
మును, దుర్బలత్వమును బ్రకటించినట్లు మనకు చరిత్ర పేర్కొ
నుటలేదు. అంతేకాదు; కవితాస్వభావ విలసితులకు కాల పరి
స్థితుల నవగాహనగావించుకొనుటలో నొక్కొక్కప్పుడు విశేష
మగు బుద్ధికుశలత యుండును. కొందఱు తమ సృజనాశక్తిని
కాగితములపై కాక, విశాల విశ్వమునగల సజీవపత్రములపై
నుపయోగింపగల వరప్రసాదు లుందురు. ఇట్టి వీరిని భవిష్య
త్కాలమువారు ప్రశంసించిన ప్రశంసింపవచ్చును. నిందించిన
నిందింపవచ్చును. కాని వీరి తత్త్వము సమగ్రముగ గుర్తింప
రానిది. 'జోనాఫ్ ఆర్కు'[42] 'మాజని'[43] 'గారిబాల్డి'[44] ల
వంటివారివలె వీరు పతనోన్ముఖమైన దేశమును సముద్ధరింతురు.
లేదా ! 'నెపోలియన్' 'అలెగ్జాండరు'ల వలె ప్రపంచాధి
పత్యము వహింతురు. జాతీయ సమగ్రావగాహనముతో గూడిన
వీరోచితస్వభావము; జీవిత కళోపాసనాతత్పరత; ఆదర్శ గంభీర
దృక్పథము; సంతత వీరారాధనము, మున్నగు ననేకశక్తుల
సరసస మ్మేళనముచే నిట్టివారభ్యుదయ మందుదురు. భోగాను

భవేచ్ఛ ప్రబలకపూర్వము; బౌద్ధమత ప్రభావముకూడ వ్యాపింపకపూర్వము భారతీయులు వీరోత్సాహపూరితమైన జాతిగా విఖ్యాతిగాంచిరి. గద్యమును దృఢీకరించి, పద్యము పట్లనే భారతీయులు విశేషాదరమును జూపిరి. భావాంబర వీథిలో విహరించుచున్నను, వాస్తవోచితముగనే జీవితయాత్ర గావించిరి. ఇట్టి ప్రాచీన భారతీయస్వభావము కాళిదాసు కాలమునందును గొంత నిల్చినది. అందుచే నీ జాతీయ నాటక కవిచక్రవర్తి, కురువంశ మూలపురుషుఁడగు నీ పురూరవ చక్రవర్తికవి శీలమును జిత్రించుపట్ల దుర్బలత్వమునుగాక, సార ధీరత్వమునే పరిపోషించు టత్యంత సహజముగ నున్నది.

వాస్తవిక శక్తిసామర్థ్యములను, కళాస్వభావ మెంతటి ప్రబలహృదయమునైన నొకింత దుర్బల పఱుపక మానదు. అలెగ్జాండరు, నెపోలియనులు స్వార్థ దురహంకార పరాయణులు. విపరీత భావుకులు. అసాధారణాదర్శములు కలవారు. కావలయు నని వీరు దుష్టత్వము ప్రదర్శింపకున్నను, అప్పుడప్పుడు నైతిక నియమోల్లంఘనముచే, నమానుషకృత్యములఁ గావించిరి. అలెగ్జాండరు తన జీవితము నొక పాశ్చాత్త్యేతిహాసము గావింపవలయునని యాశించెను. నెపోలియన్ తన జీవితము సమానుషేతిహాసము గావించెను. నాటకకర్త లౌచిత్యపోషణ మునకు సమయోచితముగా ప్రాచీనకథావిషయములందు మార్పులు చేకూర్చురీతిగా వీరును తమ జీవితరూపకములందు స్వేచ్ఛగా మార్పులు గావించిరి. 'జోన్ ఆఫ్ ఆర్క్' కలలు గని యేమేమియో భావించినది. 'మాజని' 'గారిబాల్డీ'లు, కూడ

విపరీతాదర్శవాదులే. వీరిరువురు 'కావర్'[45] ను ద్వేషించిరి. కావర్ వీరివలె విపరీతాశయప్రేరితుఁడు కాలేదనియే వీరి యీ విద్వేషమునకుఁగారణము. వీరిజీవితాంతిమదశలు విషాద చ్ఛాయాశబలితములు.

నెపోలియన్ అంతవానిగతి యేమైనది? హెలీనా ద్వీపమునందు బంధితుఁడైనాఁడు. యూరపు ఖండమునంతయు గజగజ లాడించిన జగజెట్టి దిక్కులేని వానివలె, సముద్ర తరంగోపహత శిలాతలమున ప్రాణములను విసర్జింప వలసి వచ్చెను. 'జోన్ ఆఫ్ ఆర్కు' వంటి యకలంక దేశభక్త పారీణ కడకెట్టి దుర్భరబాధ లనుభవించి మరణింపవలసి వచ్చెనో కదా! ఆంగ్లేయు లామెను కాళ్ళుచేతులు కట్టి 'రోవెన్' ప్రదేశమున భగ భగ మండుమంటలలో నిలువున కూలఁ ద్రోసి, నిండు ప్రాణములు నిలువునహరించిరి. నిరుపమ దేశభక్తుఁడగు 'మాజినీ' గతి యేమైనది? ఆతని విప్లవోజ్జ్వల జీవిత మాజీవితము నిష్ఠురమగు నజ్ఞాత వాసాయాస క్లేశములకు గురియై కుమిలిపోలేదా? కాని అలెగ్జాండరు వీరికన్న నదృష్ట వంతుఁడు. అల్పవయస్సుననే యాతఁడు పరలోకగతుఁడౌటయే యాతని యీ యదృష్టము. మఱియొక యదృష్టము—ఆతని పరిజనులు మిక్కిలి వివేకులు. వారీతనిని గంగానదిని దాట నీయలేదు. ఇట్లే నెపోలియనునకుఁగూడ తన పరిమితిని గుర్తింపజేసెడి పరివారమున్నచో, వాని యంతిమదశ, అంత విషాదభరితమయ్యెడిది కాదు. వాని జననమువలె, మరణము కూడ కీర్తనీయమయ్యెడిది.

విక్రమోర్వశీయ రూపకమునందు పురూరవుఁడుకూడ నదృష్టశాలియే. దేవతాసాహాయ్య మాతని వెన్నంటియే యుండెను. దేవత లీతనిని దురదృష్టమునుండి కాపాడుదురు. అలెగ్జాండరున కకాల మరణము అదృష్టావాప్తికి తోడ్పడినట్లే యీ రూపకము నందలి పరిమితియే పురూరవుని భాగ్యశాలిని గావించును.

ఆత్మవినాశ కారకుఁడగు నసత్యకవితా స్వభావుఁడుగా కాక, పురూరవుఁడు, సత్యపరాక్రముఁడుగను; లలిత కవితా కళాప్రియుఁడుగను నిరూపితుఁడాయెను. ధీరోదాత్తుఁడైన రాజునందు కవి, ధీర లలితత్వమునుగూడ లలితముగ సమ్మిళిత మొనర్చుటచే పురూరవుని శీలమేర్పడినది. "కళ–కళకొఱకే" యనుసిద్ధాంత ప్రతిపాదనకుఁ బ్రాతిపదికమైన తరువాతి కవిత్వచ్ఛాయ లీ శీలమునందు పొందుపఱుపఁబడినవి. మానవజీవిత సౌందర్యసమీక్షయందు, చరాచర చేతన ప్రకృతిసంపత్పరిశీలనమునందు, నిర్హేతుకానందమును జూరగొనుటే యిట్టి యద్భుత శీలచిత్రణములోని పరమరహస్యము.

పురూరవుఁడు నృపాల శిరోమణిగను; వీరాగ్రేసరుఁడుగను; సమయోచిత ధైర్యసాహసక్రియా దక్షుఁడుగను; తొలుచూపుననే మనకు సాక్షాత్కరించును. అంతేకాని కాళిదాసీతని నిత్యనైమిత్తిక శీలప్రదర్శనముతో నంతగా ప్రమేయము కల్పించుకొనలేదు. అందాతని కాసక్తి తక్కువ. ఒకవేళ నిత్యనైమిత్తికములే ప్రదర్శింపవలసివచ్చినచో, కాళిదాసు లక్షించునది యాంతరంగిక సత్యసమున్మీలనమే. లలితకళోద్దిక్షమానసుఁ

డైన పురూరవుని, అనర్థకములగు దుర్బలత్వమునకు, ననర్హా
తకు గురికానీకుండ కాళిదాసు కాపాడును. పరిపక్వ కళా
ప్రతిభతోడనే యీ కవిసార్వభౌముఁ డీ శీలము నిట్లు చిత్రిం
చెను. ప్రారంభమునందే పురూరవుఁడు అసాధారణ సంచల
నత్వముతోడను క్షణకాలజనితమనోనిశ్చయము తోడను,
అధోగతాహార సంపాదనా లంపటమగు గృధ్రరాజము నందలి
మేఘ తిరస్కృతోద్వేగమువంటి యుద్వేగముతోడను మనకు
ప్రత్యక్షమౌను. వెంటనే సుకుమార భావనా విలసితుఁడగు
ప్రేమికుఁడుగా నీతఁడు గోచరించి, మన కాశ్చర్యము కల్గించును.
నాటకాంతమున పురూరవుఁ డింద్ర సాహాయ్యమునకై
యాహ్వానింపఁబడును. ఆద్యంతములయం దిట్లు వీరోచితముగా
తీర్చిదిద్దబడిన పురూరవున కూర్వశితోడి సంబంధ మొక యితి
హాసము మధ్య ప్రాసంగికముగావచ్చిన ప్రేమగాథవలె మనోజ్ఞ
ముగా నొప్పును. ఇంతేకాదు; భావకవితోదాహరణము
లనఁదగిన వర్ణనలు; పరిపాలనా దక్షత్వ సూచనలు; వీరరస
స్ఫోరకమగు వైదములు; ప్రత్యంకమునను, నప్రయత్నముగ
సిద్ధింపఁజేసిన కాళిదాసు కళావైదగ్ధ్యము ప్రశంసాతీతమైనది.
ఇందును నాతఁ డతివృష్టి, యనావృష్టి, దోషములకు గురి
కాలేదు. ఆతని కవితా శిల్ప స్వభావమే యట్టిది. మానవ
సహజమగు సరసమనోజ్ఞస్వభావము మూర్తీభవించిన పురూర
వునిలో, నృపత్వము తన ప్రాభవమును నెఱపఁ జాలక
పోయినది.

కావ్యారంభమునందే పురూరవునిలోఁగల ఈ స్వభావ
వైరుధ్యము సూచింపఁబడినది. స్వీయనామప్రకటనము నందే

యాతని రాజఠీవి, ప్రత్యయప్రదానము, నాకౌకసులతోడి సంబంధము, ఏకకాలమున మనోవీధిని మెఱయును. ఇది యితి హాసోచిత గాంభీర్య చిహ్నము. ఇంతటి రాజఠీవియందును బ్రస్ఫుటమగు నా వినయ సౌశీల్య మాభిజాత్య సంప్రాపితము. ఆతని శీలసంపద కీ వినయము మకుటాయ మానమైనది. చిత్ర రథుఁ డన్నట్లు, "వినయము విక్రమా లంకారముకదా!" సాంప్రదాయికమగు రాజఠీవి వైదొలఁగగనే పురూరవుఁడు తన సహజ మృదులస్వభావముతోఁ గానుపించును. దశదిశావ్యాప్త మగు కీర్తిచంద్రికలచే నుప్పొంగు మానసముతో, "చంద్ర పౌత్రుఁడు, సూర్యదౌహిత్రుఁడు, మహారథుఁడునగు పురూరవు నెఱుఁగు టంత దుర్ఘటము కాద"ని యాతఁడు సగర్వముగ నుద్ఘాటించును. మఱియొక సందర్భమున, తాను, "నానావనీ రాజచూడా కలోజ్జ్వల రత్నభాసి పదపీఠాప్తాధిరాజ్యాధినేత" నని నిస్సంకోచముగ పల్కును. ఈతఁడు మితభాషి. ఉజ్జ్వల సంభాషణాచతురుఁడు. ఇతని సంభాషణములలో సుకుమార భావన తామరతూడునందు బిసతంతువువలె నిమిడియుండును. నెపోలియన్ చక్రవర్తియు నిట్లే, ఠీవి తళుకొత్తునట్లు భావ పూరితముగ రాజకీయ ప్రకటనలు చేసెడివాఁడని వినికిడి. అలెగ్జాండరు, "బాటిస్" అనువానిని తన రథచక్రములకు బంధించి, గ్రీకు వీరుఁడగు "అచిలిస్" 46 వలె ప్రవర్తించి నాఁడు. ఇట్టి వీరిని యసత్యభాషకులని, యాత్మశ్లాఘాప్రియులని, వాచాలురని విమర్శనవిషమును వెల్రగక్కిన ప్రయోజనము శూన్యము. వీరిస్థాయి యందఱు నందుకొనఁజాలనిది. అది యట్లుంచుదము.

జాల్మ్రుఁడగు నసురుని దర్పము నడగించుటకై ఈశాన దిశకు గుఱ్ఱములను వడిగొల్పించిన యీ సూర్య దౌహిత్రుని హృదయ మాక్షణముననే తద్దృశ్య రామణీయకమున కాకృష్ట మైనది. ఆతని కవితాత్మ యావిష్కృతమైనది. రథచక్ర సంచాలిత వాయుతరంగములు వినీలపయోధర పంక్తులను విచ్ఛేద మొనర్చుచుండుట—భూసంచారమగు రథము, గాలిదుమారముల చెలరేపుచున్నట్లున్నదఁట. అపుడు రథచక్రములలో నేవియో క్రొత్తయాకులు చేరినట్లున్నదఁట. హయవహాళి చామరములు వినిశ్చలములై చిత్రములందువలె నిడివిగానున్నవఁట. ధ్వజాంతమునందలి పతాకము గాలితీవ్రతకు చక్కఁగా విచ్చినట్లున్నదఁట. ఏమి యీ సంభావనాచాతుర్యము? చరిత్రలో నే రాజేంద్రునకుఁగూడ నింతటి సరస సంభావనమున్నట్లుతోఁచదు. రెండవ రిచర్డునందుగూడ నీ చంద్రుని పౌత్రునకుఁగల భావ విశిష్టత మృగ్యము. ఈ నాటకమునగల సర్వోత్కృష్ట విశిష్టతలలో నిదియొకటి. ఇట్టి సరసస్రమాట్టు సాహచర్య ప్రభావమున—విదూషకుఁడగు మాణవకుఁడు, వేటగాఁడగు వేధకుఁడు, కంచుకియగు లాతవ్యుఁడు, సందర్భోచితముగ రమ్య కవితోత్సాహపరులై భాషింతురు. కాని వారి భావములు సామాన్యములు. అందలి కవితాశైలియు సర్వసాధారణము. రాజేంద్రుని శైలీగాంభీర్యము వీరియందుండుటయు ననౌచిత్యమే యగును గదా!! సంగమనీయమను చూడారత్నము నెరచి భ్రమచేత గ్రద్ద తన్నుకొనిపోవునపుడు, కిరాతి, "ఇదుగో! ఇదుగో! నోటికొనను తగుల్కొనియున్న బంగారపు దారములోని మణితో ఆకాశాన్ని చిత్రస్తూ ఉన్నదనేలాగ నుడుస్తున్నది"

యని భావనను ప్రేరేచు మాటలాడును. అప్పుడే పురూరవుని కవితాత్మ యుప్పొంగినది.

"నాకును గనఁబడుచున్నది."

తే॥ నోర మణివ్రేలు జాళువాదార మొప్ప,
మింట వడి మండలముల భ్రమించు కతనఁ
గొఱవి గిఱగిఱఁ దిరిగెడి తెఱఁగుదోఁప
రాగరేఖావలయము లేర్పఱుచుఁ బులుఁగు.

ఈ పులుఁగే దక్షిణపుతుదమీఁదుగా పోవుట గాంచిన రాజహృదయము మఱియొక రమణీయ భంగిమలో భావించినది :

తే॥ నిగ్గి లివురులఁబోలు మానికము చేత
మంజుళపు విరిగుత్తు చేబలె ఖగంబు
దిగ్వధూవక్త్రమునకు సాధించెఁజూడఁ
జారుతరము వతంస ప్రసాధనంబు.

మణితోఁగూడిన పక్షి యదృశ్యమగునంతవఱకు తన సరస సాహిత్య సౌహిత్యము సీతఁడు ప్రదర్శించును. ఈతని భావన రాగరంజితమైనది. అది స్వతః సిద్ధము. ఆతని యాలోచనా సంభాషణలు, దార్శనికత, దివ్యప్రేమ సంభరితములు. మధుర భావ చిత్రమగు నాతని మనఃఫలకమును, మనోజ్ఞపదవిన్యాసమునం దాలంకారికముగాఁ బ్రదర్శింపఁగల కవిత్వ పటుత్వ మాతనికి సమృద్ధము. ప్రకృతిసిద్ధమగు నొక రమ్యవస్తుసందర్శనము, ఒక సామాన్య భావోద్రేకము నాతని కవితాత్మ నుప్పొంగింపఁజేయఁగలవు. ఆతని గంభీర భావముద్రణావిలసితమైన ప్రతి సామాన్యవిషయము, నుదాత్తకవితావస్తువుగా.

రూపొందును. కవి కత్యంతావసరమగు నిశితభావోద్రిక్తత, పరిశీలనాదక్షతయు; దార్శనికశక్తియు నీతనికి వరప్రసాదిత ములు. అరుణోదయకాంతుల యరుణిమలు, మృణాళికా సూత్రధారియై, వినీలాకాశ వాహిని నెదురీదు నపరంజి రాగ రంజిత శ్వేతగరుద్గమనము; దరీవిభాగవిచ్ఛేద సామర్థ్యమగు ప్రవాహవేగము; నిశీథినీసమయమున హటాత్తుగా నుదయించిన నిశాకరుని యాశాజనక సందర్శనము; సంకుల ధూమవినిర్భిన్న ప్రచండ దావానల కాంతిరేఖలు—ఇవియు నవియు ననవేల ? ఇట్టి వనేకములు పురూరవచక్రవర్తి కవితా మానసోఽంబుజ మును ప్రఫుల్లమొనర్పఁగల పూతకవిత్వాంశములే. ఈతని కవితాప్రతిభ నిసర్గమనోహరము. అందుచేతనే తన పట్టమహి షిని ప్రశంసించునపుడుగూడ నీ రసజ్ఞరాజశేఖరుఁ డుద్రిక్తాను భూతియుక్తమగు మంజులాలాపములే గావించును. ఆ యాలా పము లెట్టి నీరసస్థితినైన నొక్కక్షణములో రసభరితము గావింపఁగలవి.

ఇట్టి గంభీర హృదయసంపన్నుఁడు కవితాకళా ప్రపూ ర్ణుఁడు; రమణీయ భావుకశిరోమణి; ధీరోదాత్తుఁడునగు పురూరవ చక్రవర్తికొక యమూల్య పరుసవేది లభించును. అట్టి దివ్య మణినాశించి సంపాదింపఁగల యర్హత యీతనికిదక్క నన్యు లకులేదు. ఆదివ్యమణియే యూర్వశి. సౌందర్యరసాధిదేవత. 'నరసఖమునీంద్రు నూరువున' జన్మించినది. 'తపోవిశేష పరి శంకితుఁడైన మహేంద్రుని కోమలాయుధము !' 'రూపగర్విత' యైన లక్ష్మీదేవికి గుండెతల్లడము !' 'స్వర్గాలంకారము' ఇట్టి నాకరమణిని విశ్వభావనా సౌందర్య పరాకాష్ఠ

స్వరూపగను; మానవాత్మ యనంతముగా పరితపించి, పరితపించి యందుకొనజాలని యాదర్శనారీరత్నముగను; అన్ని దేశములను, అన్ని కాలములను సౌందర్యాదర్శ పరితృప్తులగు వారి పాలిటి యిష్టదేవతామూర్తినిగను, నత్యంతమనోహరముగా సందర్శించి, యక్షరరమ్యముగా వంగ కవికుమారుఁడు, రవీంద్రుఁడు గాన మొనర్చెను. కావున వ్యక్తిమాత్రున కీమెవశము కానేరదు. ఏవ్యక్తి ధీరోదాత్తగుణసంపత్తిగల్గియు, కవితాకళాప్రఫుల్లహృదయుఁడో; ఏవ్యక్తి సర్వదేవతాకోటి గౌరవార్హతలను సంపాదించెనో; ఏవ్యక్తి జీవితజ్యోతిరొక మహాతపస్సదృశమైనదో; ఏవ్యక్తి చంద్రాంశునిభాస్పంద యశస్తుందిల దిక్కందరుఁడో; అట్టి కమనీయ మహనీయ మూర్తినే యీ త్రిభువనాతీత సౌందర్యతిలక వరింపఁగలదు. అట్టి మహావ్యక్తి పురూరవుఁడు. ఈతఁడు మనుపుత్రికయగు ఇళాదేవిపుత్రుఁడు. వేదవేదాంగ శాస్త్రార్థ విశద వాసనాత్త ధిషణాధురంధరుఁడైన బుధుఁడీతని జనకుఁడు. సూర్యదౌహిత్రుఁడు. ఊర్వశీ సౌందర్య పాశబద్ధుఁడై, యీతఁడు తన ధర్మపత్నిని, ప్రాపంచిక కీర్తిప్రతిష్ఠలను ననాదరించెను. కాని తన సహధర్మచారిణిపట్ల నాతని కార్ద్రభావముకలదు. అది కేవలము ధార్మికము; నిస్సంగమునైనది. అతని యాత్మీయతా సర్వస్వము దేవతా సంబంధమైనది. ఎంత హృదయ పూర్వకముగ నాకాంక్షించినను నీతనికి నూర్వశీ దివ్య సౌందర్యానుభవమవిచ్ఛిన్నముగ లభింపలేదు. ఊర్వశీ పురూరవులు గంధమాదనవనవిహారమున కేగుదురు. ఆ మిన్నేటి యిసుకతిన్నెల యందా రాజర్షి హృదయము ఉదయవతీ విద్యాధర కన్యయం

నొకింత చలించును. స్త్రీసహజమగు మాత్సర్య మూర్వశి యందును బొడగట్టును. కలఁత బాఱిన యెడందతో నీమె పరులప్రవేశమును సహింపని కుమారస్వామి తపోధ్యానమున నడుగు పెట్టును. అంతే. ప్రేమ మహార్ణవ విలీనులైన దంపతులకు వియోగము ప్రాప్తించినది! ఆత్మీయ సౌందర్యాధిష్ఠాన దేవతావియోగ దోదూయమాన మానసుఁడగు నా చక్రవర్తి విశాల ప్రకృతిలో పాదపాదమున, పాదప లతాగుల్మాదులందుఁ బ్రియాసౌందర్యచ్ఛాయలు పొడగాంచుచు; వీతరాగులను గూడ నుత్కంఠితులను గావించుచుండెను. దేవతాత్ముఁడగు హిమవంతుని దుహిత; సకల ప్రకృతిస్వరూపిణియు నగు గౌరీదేవి చరణసంజాతమగు మణిప్రభావముచే నీ వియోగులకు పునస్సమాగమము సమకూడినది. ప్రేమ ఫలించినది. 'ఆయువ' ను బుత్రుఁడుఁగూడ నుదయించెను. మానవ దేవతా సమాగమోత్కృష్ట జనితుఁడీ యాయువు కుమారుఁడు. భారతీయ పురాణగాథలలో నిదియొక విచిత్రమైన సన్నివేశము. కాళిదాసు తన యనన్యసాధారణ కవితా సంపత్తిచే దీనినొక సహజ మనోహర మానవ ప్రేమగాథగా బరిణమింపఁ జేసెను.

ఒక విధముగా బరిశీలించిన, పురూరవుని పూర్వరనజ్మమంతయు నూర్వశీ ప్రేమ సమాగమ ప్రయత్నమే యనిపించును. మహేతిహాసమువలె వైభవోపేతమగు తన జీవిత కాంతి ప్రసారముచే నీతఁడు తన భావనావీథిని రసమయమొనర్చి, భూమ్యాకాశముల వ్యాపింపఁజేసెను. అతఁడు నిజముగా సార్థక నామధేయుఁడు. పురూరవుఁ డనఁగా దిగ్దిగంతముల మాఱుమ్రోగినవాఁడు, కాని యంతమాత్రమున

నాతని కాత్మవికాసము కల్గలేదు. సందర్శన మాత్రముననే యాతని ప్రేమవాహిని యూర్వశీసౌందర్యార్ణవ మగ్న మైనది. స్వాభావగత కవితా సౌభాగ్యము, మనోగత చిత్ర విచిత్ర ప్రేమ భావనాచిత్రములు; స్వకీయ కీర్తిగతాత్మాభిమానము, వీర త్వము, ఘనత; సమస్తము నేకోన్ముఖమై జీవిత చరమ భావోద్రేకద్వారమున పెల్లుబికి, జ్యోత్స్నామయ దివ్యలోక మున స్థిరసౌదామినిగా వెలుఁగొందినది. ఆతని ప్రతిభావము; ప్రతిభావోద్రేకము నూర్వశీ ప్రణయ మహిమోపేతమై, సంస్కారపూతమగు మధుర భాషణములుగా వెలువడును. ఆయువు తనపుత్రుఁడని వినినంతనే పురూరవజనకునిలో వాత్సల్యరస ముప్పొంగినది. ఆయువును గన్నంతనే యాతని నేత్రద్వయమున నానందాశ్రువు లుబికినవి. స్వాంతము ప్రేమ మయ మైనది. మానసము ప్రసాదభరితమైనది. గాఢా లింగనము గావింపవలయునను వాంఛ ప్రగాఢమైనది. జీవిత మర్యాదలను బురస్కరించుకొని, నాటకౌచితి ననుసరించి, పురూరవ హృదయనిహితమైన పుత్రవాత్సల్యమును బహిర్గ తము కానీయక కవీశ్వరుఁడు చాలకాల మణచియుంచెను. అసలీ సంబంధమగు భావమునే యుద్బుద్ధము కానీకుండుటకై కవీశ్వరుఁడు, ఊర్వశీ పురూరవులకు వియోగమును జేకూ ర్చెను. ఏతద్విధానము చేతనే మూలకథ నాటకీయ నిర్వహణ మున కనుకూలమైనది. పురూరవుఁ డున్మాదము నందినంత స్వేచ్ఛాజీవి యైనాఁడు. ఈ రూపకమందలి చతుర్థాంకము కేవలము లాక్షణిక విధేయమైనది కాదు. నాటక నిర్వహణ

మున కిది యనివార్యమైనది. నాయకుని శీల చిత్రణమున కిది సమగ్రతను సమకూర్చుచున్నది.

పురూరవుఁడున్మాదుఁడని యంటిని. గాఢముగా నాలోకించిన ఆపద మాతనిపట్ల సముచితము కాదని యనిపించును. ఈతఁడు 'లియర్'[47] వలె గాని; 'ఒఫిలియా'[48] వలె గాని యున్మాదుఁడు గాఁడు. ఈతఁడు తాత్కాలికముగ మాత్రమే తన సహజస్థితిని కోల్పోయినాఁడు. ఇది మనోవైపరీత్యము కాదు. ఈతనిలో వెల్లువయై ప్రవహించిన యసాధారణ భావనాచైతన్యము. అది మహాకవుల యందు గాంచనగు మహోద్రేకము. చేతనాచేతన ప్రకృతి సౌందర్యమునం దాతనికి సానుభూతి హఠాత్తుగా ప్రసారితమైనది. మహాటవిలోని దావానలము ప్రతి స్వల్పవిషయమును సుస్పష్టముగ గోచరింపఁజేసి, రూపాంతరిత మొనర్చుచు, నుద్ధురతతో నుఱుకులు పెట్టురీతిగా నీ పురూరవార్ద్రానుభూతి ప్రజ్వరిల్లినది. సుమధుర శబ్దజాలము; అనిదంపూర్వమగు నాలోచనలు; సుదీర్ఘ పుటూహాలు; క్షణక్షణ సంచలిత భావోద్రేకములు; సుడులు చుట్టుకొని, ప్రకృతి సౌందర్య ప్రదీప్తములై, రాజర్షి విరహవేదనా మానసమును బ్రతిబింబింపఁ జేసినవి. ఈ దృశ్యము నతిక్రమించిన కవితా వైభవముగాని, కళాసౌకుమార్యము గాని గోచరింపదు. ఇందొక సూక్ష్మ సౌందర్యాంశము కలదు. అది యల్పముగనే బాహ్యదృష్టికి గోచరింపవచ్చును. కాని యందనల్ప కళావైచిత్రి కలదు. పురూరవుని భావోద్వేగ మందు క్రమోన్మీలన మందెను. ఒక వినీల పయోధర మాతని దృష్టికి క్రూర రాక్షసునివలె కాన్పించును. ఆతఁడు తన ప్రియురాలి నపహరించుచున్న

ట్లీతఁడు భ్రాంతిఁజెందును. అప్పుడీతఁ డాయుధవిహీనుఁడు. అంతటిమహాచక్రవర్తి కాస్థితిలో నొక శిలాఖండమే యాయుధ మైనది. దానినే విసరుట కుద్యమించినాఁడు. ఇది నిజమున కున్మాదస్థితియే. కాని యీ యవస్థ యెంతో కాలము నిలువ లేదు. మఱుక్షణముననే యాతఁడు తన విభ్రాంతి గుర్తించెను. భావోద్వేగ మొకింత చల్లారినది. కాని మానస ముల్లోల కల్లోలితముగనే యున్నది, ఆ వనమందలి ప్రతి స్వల్పవస్తువు నాతని కూర్వశీరూపముగనే మిఱుమిట్లు గొల్పును. ఆతని యంతరంగమును గలవరపఱుచును. మఱుక్షణముననే యథార్థ పరిజ్ఞానము కల్గును. ఇట్లొక్కొక్క వికలభావ ప్రతి క్రియ, యాతనికి కొంత కొంత మానసిక విశ్రాంతిని సమ కూర్చును. కొంతతడవున కాతని మానస మచేతనమునుండి చేతనములకుఁ బరువు లెత్తును. మకరందపానమత్తయగు మధుకరి, ప్రఫుల్ల కళాకలాపియగు కేకిసార్వభౌముడు; మధుర గాయినియగు కోకిలకోమలి; బాష్పజలార్ద్రవికలలోచనుఁడగు కరిపతి; మానసోత్సుకమగు కలహంసరాజము; గోరోచనా కుంకుమ వర్ణాంచితయగు జక్కవరాణి; కమలాధ్యాసితమైన మాధుకరము, నాతనికి గనుపించును. వానిని తనప్రియాన్వృత్తాం తమును యాచించి పురూరవుఁడు విఫలుఁడౌను. పిమ్మట కరిణీ సమేతుఁడైన కరిరాజును, 'దూర విజిత కమలారికాంతిని' యగు తన 'వేలుపుటింతిని' వీక్షించితే? యని పురూరవుఁడుపృచ్ఛిం చును. దానికిని తనకునుగల సాధర్మ్యమును బురస్కరించి దానియం దత్యంతానురాగమును బ్రకటించును. దానికి తనకు వలె 'ప్రియావిరహ దుఃఖము ప్రాప్తింపకుండవలయు' ననియే

చక్రవర్తి పవిత్రాశయము. అనంతరమచ్చరలకుఁ బ్రియమై విశేషరామణీయక శోభతోనొప్పు 'సురభికందర' మనుభూధర స్వామిని తన ప్రియా వృత్తాంతమును బ్రశ్నించును. గుహా ముఖమున వెలువడిన ప్రతిధ్వనినే దాని సమాధానమని రాజేంద్రుఁడు భ్రమించును. తొలుత నాతఁడు మృగపక్ష్యాదులకు సంభాషణా సామర్థ్యము నాపాదించును. కాని యీ పర్యాయ మాతఁడాలించినది తనమాటల ప్రతిధ్వనియే. ఈ విషయము నాతఁడు గుర్తించెను. క్రమ క్రమముగా నాతని తీవ్రమానసోద్రిక్తత సన్నగిలినది. అతని భావన సత్యమునకు సన్నిహితమయినది. ఏదోయొక యగోచరమగు దివ్యశక్తి యూర్వశినొక సుందరమగు ప్రకృతిలోని వస్తువుగా మార్చి యుండునని నృపాలుఁడు తలంచెను. అయిన నేమిగా నామె మార్పుచెందును ? 'క్షుభితాకరుణ శకుంతిక'యు, 'కలమధుకర ఝుంకారిత'యు నగు నదీమతల్లి యాతని నయనద్వయము నాకర్షించినది. తనప్రియురాలికిని, దీనికిని సన్నిహితసామ్యములు సుస్పష్టము లయినవి.

> ఉ॥ వీచులు గాఁగ భ్రూకుటులు, విక్వణ దండజ పంక్తి కాంచిగా
> వేచన జాఱు పైఁటవలె, ఫేనచయం బిటునట్టు నీడ్చుచున్
> ఏచిన మేటి సంస్ఖలిత మెంచుచు, క్షిప్రపదప్రయాతయై
> నా చెలి యోర్వలేక పరిణామము నొందె నదీ స్వరూపతన్॥

ఇన్ని సామ్యములు పొడగట్టినను నొకింత తీవ్రముగా యోజించిన పిమ్మట చక్రవర్తికే యీ భావనలోని యనౌచిత్యము పొడగట్టినది. "ఊర్వశి పురూరవుని వదలి సముద్రుని అభిసరింపదుగదా!" ఈయాలోచన మెంత సముచితము !

ఇంతేకాదు. నిర్విణ్ణతచే శ్రేయస్సులు కలుగవను నిర్ణయము కూడ నాతని మనసులో నేర్పడినది. తన పరిభ్రమణము నిష్ప్రయోజన మని నిశ్చయించుకొనినాఁడు. "ఎచట సువచన నాకంటి కగపడక దిచ్చు మొగమయినదో యచ్చోటికే యేగెదన"ని పరిక్రమించినాఁడు. ఇంతలో నొక కృష్ణసార మాతని దృష్టి నాకర్షించును.

'కానసేందిర తాఁ దమకమునఁ జూడఁ జాచినట్టి నిడుద కటాక్షము' వలె నొప్పు మృగశాబకమును బలుకరింపక యుండలేకపోయినాఁడు. ప్రియా వృత్తాంతమును దెలుపుమని కై మోడ్చినాఁడు. కాని దానికి సంభాషణా చాతుర్యమును గల్పించలేదు. లతా లతాంతములయం దాతనికి ప్రియావయవ వపుచ్ఛాయలు స్ఫురించును. కాని పూర్వము కల్గినంత విభ్రాంతి మహీపాలున కీమారు కలుగలేదు. వెనుకటి పురూరవుని లోఁగల శక్తిసామర్థ్యములు; భావములు; సత్యసామీప్యము నందు కొనుచున్నవి. ఇంతలో భగవానుఁడైన మృగచారి ముని సందర్శన భాగ్యము లభించినది. మునీశ్వరుఁడు పలుకరించి 'నగప్రభుపుత్త్రీ పదరాగ జనిత' 'సంగమనీ' యాఖ్య మగు మాణిక్యము ననుగ్రహించెను. ఏతదనుగ్రహము చేఁ బురూరవునకుఁ బూర్వపుఁ బుద్ధిసంపద లభించినది. పుష్పవిహీనయగు లతాతన్వియందే యాతనికి రతిభావము కల్గినది. ప్రియురాలిగా కాక, "ప్రియానుకారిణి"నిగా దానిని కౌగిలించుకొన వలయునను బుద్ధి పుట్టినది. తదనంతర దృశ్యమునం దంతటను సహజ మనోహర భావుకుఁడగు రాజర్షి యథార్థస్వభావము మన కవగతమగును. అంకాంతమున

నీభావుకచక్రవర్తి యాకాంక్షించి తన కులదేవతను బ్రార్థించిన దివ్యవాహన మెంత మనోజ్ఞమైనదో చూడుఁడు:

క. స్ఫురియించు మించు సిడముగ
సురచాపము నూత్నచిత్రశోభగఁ గ్రొమ్మ
బ్బురహించు విమానముఁ జే
సి రయంబున నన్ను వసతిఁ జేర్పుము తరణీ॥

ఇట్టి స్వేచ్ఛాప్రాప్త విమానము నాకాంక్షింపఁగల యర్హత, యుదాత్తత, రసికరాజపుంగవునకే కలదు. ఇట్టి నిశిత భావనా వైలక్షణ్యముతోఁ గూడిన కళాగోపన విధానమును గూర్చియే నేను విశేషించి వివరింప నెంచునది. ఇట్టి కళా విన్యాసమును గుర్తించినపుడు గాని కాళిదాసీయ కవితాకళా ప్రతిభా ప్రభలతో మన మానసాంబరము శోభిల్లదు. అప్పుడు గాని మన మా కవికుల సార్వభౌముని సర్వతోముఖ కవితా వైభవము ననుభవించినవారము కాఁజాలము.

భావోద్రిక్తతా నిమగ్నుఁడైనపుడే పురూరవుని సుస్వరూపము మనకు విశేషముగా నభివ్యక్తమౌను. ఆతని కవితా స్వభావ వైశిష్ట్యము; జీవిత లక్ష్యమందలి యాతని యనురక్తి; దుర్బలముగాని యాతని యాదర్శవాదము; మనోవాంఛాసాఫల్యమునందు స్వేచ్ఛా సంవిచారిణియగు విధినిగూడ నశక్తపఱుచు నాతని యదృష్టము; మనకీ దృశ్యమున సుస్పష్టముగ కనులకుఁగట్టును. ఎంతటి దక్షులైనను వారి కళా కౌశలము, సక్రమ క్రియా నిర్వహణము నెట్లు నిరోధించునో కూడ కొంత సూచింపఁబడెను. పురూరవునియందును నీ దుర్బల చిహ్నములు పొడకట్టక తప్పలేదు, ఔశీనరి యెదుటఁబడి నప్పుడీ

చక్రవర్తి యసహాయునివలె ప్రవర్తించును. అగ్నిమిత్రుఁ డిట్టి సందర్భములలో నింతకంటె సామరస్యపూర్వక సుభాషితములతో నిరావతిని తృప్తిపఱచును. సంగమనీయమణిని కోల్పోయినపుడుకూడ పురూరవుని ప్రవృత్తి విలక్షణముగనే యుండును. పరివ్రాజక, విశదా నగరమునకుఁ బయనించు సమయమున, మార్గమధ్యమున నడవిలో చోరులు బాధింతురు. ఆ కథ విన్నపు డగ్నిమిత్రుఁడు వారిని తన నిశిత నారాచమునకు గురిచేయునంతటి యుత్సాహమును జూపును. పురూరవుఁ డిట్లుకాదు. ఆపత్సమయములందును నీతఁడు రమ్యోపమలతోనే భాషించును. మణితో మింటియందు భ్రమించు గద్ద "కొఱవి గిఱగిఱ దిరిగెడు తెఱఁగుదోఁప రాగ రేఖావలయము లేర్పఱచున"ని వర్ణించును. "ఇప్పుడేమి చేయవలయున"ని యీతఁడు విదూషకుని నిస్సహాయునివలె ప్రశ్నించును. నిరంతర భావనానిమగ్న కవితాత్మగల వ్యక్తి, నూత్న సన్నివేశముల నెదుర్కొనవలసి నపుడెల్ల నిట్లే వాటిల్లును. ఇట్టి నిర్వీర్యత పురూరవునిలో బహుకాల శృంగారరస నిమగ్నతచే నేర్పడినది. ఇట్లశక్తతను బ్రదర్శించిన చక్రవర్తియే సమయము వచ్చిన సురాసుర సంగ్రామ ముఖమున నిలువఁబడ గల్గిన మహారథుఁడని మనము గుర్తింపఁగలము. పురూరవుని శీల మిట్లు సమయోచితముగ సవదరించుట కనుకూలమైన మార్దవము కలది. ఇది యిట్లుండ, నీతనిలోఁ గొన్ని నైతిక దోషములు కూడ స్ఫురించును. పురూరవుఁడాదర్శ చక్రవర్తిగను; నాదర్శ గృహస్థుఁడుగను ; నొకవంక దేవతలకు, మఱి యొకవంక మతమునకు హితము చేకూర్చవలయునని యాశించెను.

కాని యూర్వశీ పురూరవుల పునస్సమాగమానంతరము "ప్రతిష్ఠానము నుండి నీవువచ్చి చిరకాలమైనది. ప్రకృతులు నాపై అసూయవహింతురు. కావున మరలుదామ"ని యూర్వశియే జ్ఞప్తి సేయును గాని పురూరవున కీవిషయమే స్మరణయందున్నట్లు తోచదు. 'ఔశీనరి' పట్ల నీతఁడు గౌరవ ప్రేమలను బ్రకటించును. అది తన విధ్యుక్త ధర్మ౦మని యాతఁడు భావించును. ఆమెతో నెంతమార్దవముగ మాటాడినను, నెంత మృదులముగ ప్రవర్తించినను, నవి యాతని కాపట్యమునే ప్రకటించును. అగ్నిమిత్రుఁడు ధారణీ రాణతులపట్ల ప్రదర్శించిన దయా దాక్షిణ్య సద్భావ సమృద్ధి, యీతనిలో మృగ్యమనిపించును. చరమాంకమున నాతఁడు మతసంబంధమగు మానసిక విశ్రాంతి ననుభవింప వలయునని యారాటపడును. ఇది 'ఆండర్ సన్'[49] కథలోని రాజలాంఛనమును బోలినది. కాని పురూరవునకు మత నియమాచరణ మనివార్య మనిపించును. ఈతఁడు దేవతా సదృశుఁడగు చక్రవర్తి. అందుచే మానవదురదృష్టము లాతని మనసున కెక్కవు. వానియందాతనికి సత్త్వములేదు. నెపోలియన్ కూడ తాను మానవుఁడుగా నవతరించిన దేవేంద్రుఁడనని యహంకరించెను. విశాలోజ్జ్వల మేధాసంపద్విశిష్టుఁడు; నిరంతర తీవ్ర కార్యోన్ముఖ వీరుఁడునైన నెపోలియన్ చక్రవర్తి యవ్యవస్థిత ప్రవర్తనఁ గల్గి, వివేకముతోఁ బ్రశాంతముగాఁ బ్రవర్తింపఁ జాలనట్లే, ఇంద్రియలోలుఁడు, భావుకుఁడునైన పురూరవుఁడు గూడ నిష్ఠుర మత నియమాచరణము నందు నిష్ఠాసక్తులను బ్రతిష్ఠింపఁ జాలక పోయెను. ఇట్టి యీ దేవతాయోద్ధ ముఖమునుండి

కాళిదాసు, సనాతన కఠినమత నియమానుష్ఠానాదర్శము ఇంద్రియలోలుఁడైన సామాన్యమానవునకె ట్లుండని వ్రాసి పండో! విమర్శించి ప్రతిఘటించు నద్భుత పద్యరాజము నొక దానిని వినిర్గత మొనర్చెను.

"వేదజడుండు ప్రాఁదపసి, వీతసమస్త కుతూహలుండెటుల్
శ్రీ దొలఁకన్ మనోహరముఁ జేయఁగ నేర్చెడి నిట్టి రూపమున్"

ఇట్టి యీ నాయకపాత్ర ముందు, తక్కిన సామాన్య పురుషపాత్రలు వెలవెలఁబోవుచున్నను, ప్రధానపాత్రశీలమున కివి యుపపోషకములు. రథచోదకుఁడు; వేఁటకాఁడగు వేధకుఁడు; కంచుకియగులాతవ్యుఁడు; విదూషకుఁడగు మాణవకుఁడు నిట్టి వారలే. సూతుఁడును, వేధకుఁడును, నాయకుని యాత్మీయత నుద్దీపింపఁజేయుచు మంజులాలాపములఁ గావింతురు. కథాగాంభీర్యమునకు వీరు యథాశక్తిని తోడ్పడుదురు.

## (ii) ఊ ర్వ శి

సూక్ష్మ సుకుమారమైన కాళిదాస నాటకీయ ప్రతిభ, స్త్రీపాత్రచిత్రణమునం దత్యంత సహజముగ పరిణతిఁ గాంచి ప్రత్యక్షమాను. ఒక్కొక్క సమయమున కాళిదాసు, ప్రధానముగా నీ స్త్రీపాత్రలకు ప్రత్యేకత నాపాదించుపట్ల నంతశ్రద్ధ వహింపక పోవచ్చును. కాని యతిసామాన్య స్త్రీ పాత్రలకుఁ గూడ సర్వసాధారణముగా నొకవిధమగు వైయక్తికత్వము నాతడు కల్పించును. నామములందే కాక, భిన్నభిన్న స్వభావములతో స్త్రీపాత్రలు పరస్పరము వేఱుపఱుచుటకు వీలుగా

నుండును. స్త్రీ పాత్రల ప్రాధాన్యమును గుర్తించిన నాటక
కళాదక్షులైన వారియందే, యీపాత్ర చిత్రణమునకుఁ గావల
సిన దార్శనికత కొఱవడియుండును. సామాన్యముగా తాము
పరిశీలించినట్టిగాని, లేక లోకాతీతముగ గోచరించునట్టిగాని
యొండు రెండు వర్గములకుఁజెందిన స్త్రీలనుబోలిన పాత్రల
నే రూపకకర్తయైనను దన రూపకమునఁ జిత్రించి సాఫల్యము
నందవచ్చును. వీరి లోకాతీతపాత్రలను, దుష్టపాత్రలనియే
భావింపవచ్చును. క్లైటెమ్‌నెస్ట్రాన్;[50] విట్టోరియాకొరంబోనా[51]
బియాట్రిస్ జొహన్నాస్[52] మున్నగువారీతరగతికిఁ జెందిన
వారే. వ్యాసుఁడు చిత్రించిన స్త్రీ పాత్రలు; సోఫకిల్సు[53]
స్త్రీ పాత్రలు నొకశ్రేణికిఁ జెందినట్లు సామ్యములుగలవు. వీరొ
క్కొక్కరు నొక్కొక్క తరగతికిఁ బ్రాతినిధ్యము వహింతురు.
ఈ పాత్రలన్నియు ప్రశాంతముగఁ గన్పట్టుచున్నను, పురుష
స్వభావప్రాబల్యముతో నొప్పుచుండును. ఇది వీరి కాభిజాత్య
ముచే సంక్రమించిన గుణమై యుండును. తక్కిన కవులేదో
యొక స్త్రీ శీలమును జిత్రింపగల్గుదురే కాని,
తక్కిన స్త్రీల నందఱను భిన్నభిన్న స్వభావసంపద్విలసితులుగా
జిత్రించగలవారు కారు. ఒక ప్రాతను బోలియే మఱి
యొకపాత్ర యుండును. ఒకవేళ ఎట్లో పరిశ్రమించి చిత్రించినను,
నంత విజయవంతముగా నుండదు. అదియుఁ గాకున్న బాహ్య
ప్రపంచమునందలి స్త్రీలనే యున్నదున్నట్లు చిత్రింతురు. స్త్రీ
సహజస్వభావ పరిశీలనా ధురంధరులైన కవీశ్వరులను వ్రేళ్ళపై
లెక్కింపనగును. ఇట్టి వీరిలోఁ 'షేక్స్పియర్' మహాకవి యగ్ర
గణ్యుఁడు. నాటకకళా నిర్వహణానుకూలమగు దివ్యవర

ములలో నిది యొకటి. ఏతత్ప్రతిభాదక్షత యందీతఁడు వాల్మీకితో సదృశుఁడన నగును. కాని వాల్మీకి కున్నంత విస్తృతి లేదు. "రాసిన్"[54] కవికి గూడ పరిమితముగా నీ ప్రతిభ కలదు. కాళిదాసునం దీ ప్రతిభ యనంతము. కాని యితర నాటక కళా లక్షణములందువలె నిందును, కాళిదాసుని ప్రతిభ, షేక్స్పియర్ ప్రతిభను బోలి యతివేలమై, వైవిధ్యముతో గూడినది కాదు. ఇంకను గొందఱు కవులు కలరు. వీరు సర్వసాధారణ స్త్రీ పాత్ర సృష్టిఁ గావించిన వారే. ఈ సృష్టి, కేవల పరిశీలనా జనితమే కాని, అవిచ్ఛిన్నమగు నాంతరంగిక ప్రేరణా ప్రాబల్యమున నేర్పడినదిగాదు. 'మాళవికాగ్నిమిత్రము,' స్త్రీపాత్రలు విశేషముగాగల రూపకము. అందు స్త్రీలశుద్ధాంతములు, రమ్యోద్యానములు, నలంకారముల గలగలలు; నవ్యక్త మనోహారకంఠ కిలకిలారావములు; కేశభారసంజనిత సుగంధ వాయువుల సౌరభములు నధికము.

'విక్రమోర్వశీయము' న సగము దృశ్యములు నాటక వీరునకే కావలసియుండెను. అందుచే స్త్రీ పాత్రచిత్రణము చాలవఱకు, నిందు సంకుచిత పఱుపవలసి వచ్చినది. కాని యవకాశ మున్నంతవఱకును, కాళిదాసు, సుందరవదనా రవిందల సమూహముతో ముంచెత్తెను. ఇందు ప్రతివనితయు సుస్పష్టముగా గుర్తింపఁ దగినది. వీరే యప్సరసలు, ఊర్వశి యును. ఇట్టి యీయచ్చరల కవిత్వప్రబోధములను గ్రహింప వలయునన్న వీరియుత్పత్తి ప్రయోజనములను సమీక్షించు ట యుచితమగును,

# కాళిదాసకవిత

అది సృష్ట్యాదికాలము. అనంతకాలవాహిని యందు మానవజాతి యింకను మొలకెత్తలేదు. స్వర్గలోకములు సర్వము; ఖగోళములు సమస్తము; దివ్యకాంతివిభ్రాజమానులగు దేవతలచేతను; ఘోరరాక్షస సమూహముచేతను గ్రిక్కిఱిసియుండెను. వీరి కార్యకలాపసంఘర్షణముచే నఖండ విశ్వమున కేదో యొక స్వరూపాకృతి యేర్పడునట్లుండెను. ఇట్లుండగాఁ బ్రతిపక్షసభ్యు లొకపర్యాయము విశ్రాంతికొని, పాలసముద్ర తరంగములపైఁబడి మథింప మొదలిడిరి. కాని వీరిలక్ష్యము సిద్ధింపలేదు. ఎప్పటికి నొక్క పక్షము గావించు కృషి ఫలితమునకు రాదు. మంచి, చెడుతోడను; నాదర్శము వాస్తవముతోడను; నాత్మ యింద్రియ సమ్మిళిత శక్తితోడను; సద్గుణములు దుర్గుణములతోడను; స్వర్గము నరకముతోడను, గలిసి యొకేయొక లక్ష్యముతోఁ గృషి సల్పినపుడుగాని యా కృషి సత్ఫలితముల నొసంగదు. ఈ లక్ష్య మసాధారణమైనది; మనోహర మాధుర్యభరితమైనది. అతిక్లిష్టసాధ్యమైనది. అది యజరామరణస్థితిని ప్రసాదించి శాశ్వతానంద లోకమున సుస్థిత మొనర్చునది. ఇట్టిస్థితి నార్జించుటకే యనంతర కాలమున మానవుఁడు తన యావచ్ఛక్తులను ధారపోసియు సంపాదింపలేకున్నాఁడు. ఇట్టి లక్ష్యసముపార్జనమునకై, దేవాసురులు కలశపాథోరాశి తీరమునందు నిల్చి మంథరపర్వతమును కవ్వముగాను, సర్పేంద్రుఁడగు వాసుకిని త్రాడుగను, గావించుకొని యాధ్యాత్మిక సాగరమో! భావనా సముద్రమో!! సకలాశా స్వరూపమో!! యనఁదగిన యా పాలసముద్రమును మథింప నారంభించిరి. శతాబ్దములు, సహస్రాబ్దములు, శత

సహస్రాబ్దములు గతించినవి. వారి పరిశ్రమము ఫలించు సూచనలు కానరాలేదు. క్షీరాబ్ధి యుల్లోలకల్లోలిత మైనది; ప్రళయ సమయ పర్జన్య గర్జానురావము గావించినది. వాసుకి యలసి సొలసి పోయినది. నిర్భర హృదయ వేదనచే నది వాడి వత్తియై, సముద్ర తరంగమాలికలపై నల్లిబిల్లిగా పడినది. వాసుకీ విహ్వలజిహ్వామాలికా సంజాత ఘోరవిషానలము మందర మథన సంఘర్షణ తరంగసంజాత ప్రళయానలము నేకమై, సకలలోకకల్లోలమును గల్గించినది. దేవతలందఱు, పరమశివుని చరణసన్నిధికి పరువులెత్తిరి. కైలాసశిఖరవాసుఁడు, గంగాత రంగిత జటాజూటధరుఁడును దక్క, నన్యులెవ్వరీ కాలకూట మహావిషానలమును భరింప సమర్థులు ? ఎవఁడు విభూతి విభూషిత ధవళ దేహాంతరిత యోగిమానసుఁడో ! పరమయోగీశ్వ రేశ్వరుఁడో ! సుఖదుఃఖాది ద్వంద్వాతీతుఁడయ్యు నెవఁడు సదా దుఃఖమును, నిరాశా నిస్పృహలను, నున్మత్తతను వరించునో ! యెవఁడు భయాతీతుఁడో ! యట్టి పరమేశ్వరుఁడు దక్క నన్యు లెవ్వరీ విషసమృద్ధిని ధరింపఁగలరు ?

అనంతర మాపాలసముద్రమునుండి యపూర్వాద్భుత విషయము లుద్భవించినవి. అఖిల రోదసీ ప్రదేశమును నొక్క యంగలో నాక్రమింపఁగల ఉచ్చైఃశ్రవము తన కేసర సౌంద ర్యచ్ఛటలతో కనులు మిఱుమిట్లు గొలుపుచు ఖురనిస్వనములు, దేవలోకము నుపుజ గొనుచుండ, వియత్తల వీధి కెగసెను. అనంతరము వరుణదేవుని పుత్రి వారుణి, శతపత్రముపై *నిలువ బడి, యానంద సౌభాగ్యయుక్తయై యావిర్భవించెను. తద నంతరము, చేతనొకచషకమును ధరించి, సర్వరోగ బాధా

నివారణ దేవతామూర్తి ధన్వంతరి సాక్షాత్కరించెను. పిమ్మట పవిత్రకాంతిప్రభలచే భువన మోహన మొనర్చుచు, సర్వజగ ద్రక్షకుఁడును, లోకబాంధవుఁడును నగు విష్ణుమూర్తికి దివ్యాభరణమై, బాధాపరితప్తులకు ధ్రువతారయైన 'కౌస్తుభమణి' సంభవించెను.

ఈ సందర్భముననే క్రొక్కారు మెఱుఁగు మేనులు, పీనపయోధరములు, గ్రిస్సిన నడుములు, పిక్కటిలియున్న తొడలుములుఁ జక్కని జాపులును గల నప్సరోజనము జనించెను. ఇది యట్లుండ, ధర్మునకు దాక్షాయణియైన మూర్తివలన ప్రణుతగుణోత్తరులు, పరమపావనమూర్తులు, నరనారాయణు లుదయించిరి. వీరు బదరీవనమున నిరంతర తపోవృత్తినిమగ్నులై యుండిరి. విబుధాధిపుఁడైన యింద్రుఁడీవిషయ మెఱిఁగి, నిజపద పీఠాని కల్లునను జింతచే, దివిజకాంతామణులను వారి తపో విఘ్నము గావింపఁ బంపెను.

ఈ భావభవుని సేనావాహిని బదరికావనమును జేరినది. రూపవిభ్రమ కళాచాతుర్యసంపత్తిని బ్రదర్శించినది. నిరంతర ధ్యాన తపఃప్రభావనిరతులైన ఈ ఋషీశ్వరులు క్రోధమువలన తమతపస్సునకు బాధచేకూరునని, దివిజ భామలపై సత్త్వగుణ సంగతులై ప్రవర్తించిరి. అపుడు నారాయణుఁడు తన యూరువును జీరెను. అందుండి యూర్వశీ ప్రముఖ నారీజన కోటి యుద్భవించి, దివిజ నారీకోటి కాశ్చర్యము కల్గించెను. ఆశ్చర్యమేకాదు, వారిరూపవిలాస విహారముల కీయమరీజన మోడి పోయెను. అంతట వీరలు విఫలమనోరథులై యూర్వశిని తమకు ముఖ్యురాలిగాఁ జేకొని వచ్చిన జాడనే మరలిరి.

ఊర్వశి యన నిట్టిది. సూర్య సమాన తేజ; ఉషో నవారుణ రేఖ; అనంతసాగర నిర్మలాకాశకీర్తిసుధ; స్థిర సౌదామిని; సర్వ జగతీతలమున కందని యాశాఫలము; విభ్రమాశ్చర్య పరమావధి; రసనా దివ్యతపః ఫలము; మానవ సౌందర్యమును, మానవ జీవితమును మానవోద్రిక్తతను సమ్మోదపఱచు నొక యద్భుతశక్తియే యూర్వశి. ఇదియు నదియు నననేల? సమస్త కళలు, నఖండకవిత్వము, సమస్త భావనా విజ్ఞానము నీ నామమునందు పరిణద్ధమైన వననగును. కాళిదాసీ బాహ్య సౌందర్యోత్కర్ష నంతగా బాటింపలేదు. ఆతఁడు ప్రదర్శింపదలచినది ప్రేమపాశ ప్రగాఢ బద్ధయగు దివ్య సుందరి యూర్వశిని. ఆమె నాకలోక నివాసమహిమ; సర్వలోక పరివ్యాప్త కాంతిగరిమ; స్వేచ్ఛా విశ్వాసలాఘవము మున్నగు నవి యామె వాతావరణమును సూచించునే కాని యామె జీవిత విభాగములుకావు. ఆమె సహజ స్వచ్ఛందాకర్షణ మహిళా స్వభావము; అబలాజనోచితమగు భీతి; నారీ చాంచల్య స్వభావము; నపాయ రహితమగు క్షణికకోపము ఆనందముగ బ్రొద్దుపుచ్చుకో గల శిశుస్వభావము; మఱుక్షణముననే గృహ రాజ్యపాలనా దక్షతను బ్రదర్శించు ప్రశాంతస్థితి; అమాయికతతో గూడిన నిష్కలుష భావతీవ్రత; మాతృదేవీ పరిపూర్ణ వాత్సల్యము ; భగనీస్నేహభావప్రఫుల్లత ; హృదయవినిర్గత విమలభాషణము ; నొకవంక నాదర్శ కన్యాభావ సౌందర్యోత్కర్ష గుణములు; నింకొక వైపున నాదర్శనారీ గభీరతత్త్వము మున్నగు ననేకాంశములతో గూడిన రమ్యచిత్రము ఊర్వశి. ఆమె రాజశీవి గమ్యము కానిది. దివిజనారీదర్పముగాని

మానవాంతస్తు నతిక్రమించెడి వేషభాషలుకాని; సహజ హృదయభావానుభూతులను మఱుగుపఱుచు నెట్టి యవనిక గాని మన కిందు గోచరింపదు. ఆ నేత్రాంచలములయందు దోబూచులాడు నా చిఱునవ్వు దొంతరలు; యుత్కంచ ద్భావోత్కర్షకైన జాలువారు నా యానంద బాష్పములు, ఆ యమాయిక ముఖమాధుర్యగరిమ; మాటి మాటికి విస్రస్త మగు నా కేసర కాంచీదామము; నిత్యనూతనోల్లాస విలసితా వయవ భంగిమలు; సర్వము నలవోకగ నెట్టివారినైననాకర్షింప గలవు. ఈ దేవతాసుందరి యునికిచేతనే స్వర్గమునకును భూలోకమునకువలె సౌందర్య మలవడినది. హిరణ్యపురవాసి యగు 'కేశి' యను రక్కసుఁడు బలాత్కారముగ నపహరించి నపుడు ఊర్వశి భయభ్రాంత యగును. అప్పుడామె 'చిత్రలేఖా వలంబితహస్తభయ నిమీలితాక్షి' !! చిత్రలేఖ ఈమెను జక్కగానోదార్చును. "ఒసే! మనస్సును నిబ్బరంచేసికొనవే! అచ్చరలాగ తోచకున్నావే!" అని సోదరీసహజ ప్రేమో త్కంఠతో హెచ్చరించును. ఈ హెచ్చరికను బురస్కరించు కొనియే యామెలోఁగల మానవత, మన హృదయముల నాకర్షించి తొలుదొల్తనే మన సానుభూతి కామెను బాత్రను గావించును. ఆమె ప్రేమలో సౌకుమార్యము కలదు. క్షణ మాత్రములో నామె భయభ్రాంత యగుట, నీరసించుట మున్నగునవి మనల నాకర్షించు మానవ లక్షణములే. ఆమె ప్రేమలో నసూయ యున్న, నది తాత్కాలికము, బుద్బుద ప్రాయము నైన యసూయయేకాని పాతుకుపోయిన ద్వేషము కాదు. కేవలోద్రిక్త స్వభావముచేతనే యీమెకును బూరూ

రవునకును వియోగము ప్రాప్తింపలేదు. ఈమె కాత్మసౌందర్య ప్రత్యయములేదు. హృదయదౌర్బల్య మధికము. భయాకుల చిత్త. అందువలననే పురూరవునకును నీమెకు వియోగ మేర్ప డినది. కాళిదాసీమెలోఁగల ఈ లక్షణముల నెట్టివ్యాఖ్యానా పేక్ష లేకుండగనే స్పష్టీకరించెను. ఎప్పటికైన నేవిమర్శకుఁ డైన విశేష పరిశోధనచే నీమెలో దివ్యలక్షణముల నాపాదిం చునేమో యని కాళిదాసిప్పట్ల ప్రత్యేకశ్రద్ధ వహించెను. ఉర్వశిలో నెట్టి దేవకాంతోచిత దర్పమునుగాని, యాడంబర మునుగాని, సమ్మోహ చిహ్నములనుగాని, కవీశ్వరుఁడు ప్రదర్శింపలేదు. ఆమె, నిరాడంబరము నిష్కపటము నైన పవిత్ర దేవతాత్మ కలది. ఇట్టి సహజ పవిత్రహృదయము నందే యామె ప్రవిమల ప్రేమ భావాంకురములు మొలకలెత్తి పెరిగినవి. తన్ను దా మఱుఁగుపఱుచుకొనలేదు. తొందర పాటుతోఁబయటపడును. వక్ర సంభాషణ మెట్టిదో యెఱుఁగదు. అప్పుడప్పుడాటకాయితనముతోఁ బ్రవర్తించును. తానాసించిన దానిని సాధించుటలో సాహసము బ్రదర్శించును. తన శక్తిని తాను సులభముగ విశ్వసింపదు. ఇంతేకాదు. ఉదాత్తముగను, మధురాతిమధురముగను, ధీర గంభీరముగఁగూడ సంచరింపఁ గల శక్తి యీమెకుఁ గలదు. తృతీయాంకమందలి యీమె ప్రవర్తన మిట్టిదే !! చతుర్థాంకమునఁ బురూరవునితోఁ బున స్సమాగమమునుఁ జరిగిన పద్ధతి; పంచమాంకమునఁ బురూరవుని యర్థాంగిగను, నాయువుజనయిత్రిగను నీమె వర్తించిన విధా నము విస్మరింపరానిది. ఆరంభదృశ్యమునందును, కన్యాభావ విసర్జన సమయమున, నీమె ప్రదర్శించిన యత్యుత్సాహము,

హృదయాహ్లాదదాయకము. కొందఱ అతిసూక్ష్మ విమర్శకు లూర్వశియందు నాకవనితా పృథగ్లక్షణము లున్నవన్నారు. కాని నా దృష్టి కట్టివేమియును బొడగట్టలేదు. నాటకావధుల మధ్య, కాళిదాసు చిత్రించిన యూర్వశీ శీలమును నిశితముగఁ బరిశీలించిన, యూర్వశీ సౌజన్యము; సమాయికత; నిత్యో త్సాహోల్లాసము సుస్పష్టమౌను. నిక్కముగ నామె ప్రేమ, శకున్తలా మాళవికల ప్రేమకన్న ఋజువైనది; ఉత్సాహ భరితమైనది. అయినను నామె దేవవనిత. తత్సంబంధమగు నవ కాశ మొసఁగక తప్పదు. ఆమె బాహ్యప్రవర్తనలో భయభావ మెక్కువ. జీవితాధిక్రమణమునందు సాహస మధికము. అది యభ్యుదయ కారక మౌ గాదని నిర్ణయింపరానిది. తాను దిర స్కరణీ ప్రభావమున నదృశ్యగానున్న సంగతి మఱచి యూర్వశి, పురూరవుని ఎదుట తటాలున నిలువబడును. కాని పురూరవుఁడు గౌరవింపఁడు. అంత నామె "సఖీ నేను దరిసి ఎదుర నిలిచిననూ, మహారాజు దాసీనుఁడుగా నున్నాడే!" యని చిత్రలేఖతో బల్కి విచారించుచుండును. ఈ ప్రేమ రూపకము నందు హృదయమును స్పందింపఁజేయు కళాస్పర్శలలో నిది యొకటి! ఈ దృశ్యమునం దూర్వశి యుల్లాస స్వభావ మొకవంకను; తానుభర్తను కౌగలించుకొనఁ బోగా నాతని యుదాసీనత కాశ్చర్యచకితయై, తన చర్యను తాను సమర్థించు కొను తీవ్రస్వభావము మఱియొక వంకను; నేకమై నిష్కళంక భావ ప్రవర్తనయు, వ్రీడాకళాదుర్బలయునగు నూర్వశి శీలమును సుస్పష్టముగా వ్యక్తీకరించుచున్నవి. కాళిదాసీయ పాత్రచిత్రణశిల్పమునకు సంబంధించినవై, వ్యక్తావ్యక్తముగ

గోచరించు నీ సామాన్య విషయములందే యాతని యద్భుత కళా స్పర్శ యనుభవనీయము. చైతన్యవంత మగు పాత్రల యందీరీతిగా కాళిదాసీయ నాగరక జీవితాభిరుచి మూర్తీ భవించును. ఊర్వశిలోఁగల విలక్షణ లక్షణములు, ప్రవిమల భావోద్రేకము, ప్రేమ పరిపూర్ణత, బాహ్యాడంబర భావోపేతమగు ప్రతీచీ స్త్రీ పాత్రల తళుకు బెళుకులకు కేవల వ్యతిరేకము. ఈమె నిరాడంబరత్వము; నిర్వక్ర భాషణము; సహజ సులభ ప్రేమ స్వభావము, నడుగడుగున నలవోకగా గోచరించుచు, నాశ్చర్యము గొల్పును. మహారాజు స్వయముగా పాదపీఠమున నుంచుకొని, జులపాలు దువ్వుచు లాలించెడి బాలుని గాంచినపు డూర్వశి స్త్రీ సహజమైన యత్కించి దసూయాసూచకమగు కాకువుతో "ఈ బాలు డెవఁడ"ని ప్రశ్నించును. అంతలోఁ జెంతనున్న సత్యవతినిజూచి యామె యవగాహనఁ జేసికొనును. అయినను నామె యానందోత్సాహములతోఁ బొంగిపోదు.

"ఆహా! సత్యవతితోఁటి నాపుత్రకుఁడాయువు! పెద్ద వాఁడయినాఁడ"ని మాత్రమే యూర్వశి పల్కును. ఇంతటి పరిమిత భాషణమే సముచితమైనది. ఆమె నిరాడంబరాలాపము లన్నింటియందును నాకర్షణ మున్నది. నైర్మల్యర్జుత్వములచే వాని కీయాకర్షణత్వ మబ్బినది. ఆదినుండి యంతము వఱకును బురూరవుని పట్ల నీమెకు గలప్రేమాతిశయ మకలంక మనోహరము. "ఆహా! దానవులు నాకు మహోపకారమే చేసినారు సుమా!" అను నాందీ వాక్యము మొదలు, "అహాహా! నా హృదయమునుండి శల్య ముద్ధృత

మైనది!" యను భరతవాక్యము వలనకునుగల యీమె ప్రేమ రూపక మత్యంతానందదాయక మైనది. ఏ సందర్భమునందైనను, నీమె సంభాషణము, ఇతరాప్సరోగణముతోడి సంవాదము విస్మరింపరానివి. "సఖులారా! రండి! నన్ను గాఢముగా కౌగిలించుకొనుఁడు! మరల సఖుల ముఖము చూడఁగలనన్న యాశ నాకు లేకపోయినది కదా!" యను విలాపవాక్యముల యందును; "చిత్రలేఖా! సఖీ! నన్ను విస్మరింపకుమీ!" యనునార్ద్ర హృదయావిష్కారక మైన సఖీత్వ ప్రేమచిహ్నమగు వాక్యమునందును, నూర్వశి ప్రేమోజ్వల దాక్షిణ్య స్వభావమే ప్రతిబింబించును. తాపసిని వీడ్కొనునపు డీమె పల్కు పల్కులు సూక్ష్మసుకుమార ప్రేమభావ సంజనితములు. తన కుమారుని సమీపించి నప్పటి యామె యార్ద్రహృదయము, పెల్లుబికిన మాతృత్వము, పురూరువుని ప్రశంసకు పాత్రమైనవి. ఊర్వశి, శకున్తల అంతగా నుదాత్త మనోహరమయిన చిత్రణము కాకపోవచ్చును. కాని స్త్రీ స్వభావ మాధుర్యోన్మీలన మగు మఱియే యితరసంస్కృత రూపక నాయికా పాత్రకును నీమె తీసిపోదని నిరాఘాటముగఁ జెప్పఁ వచ్చును.

## (iii) సామాన్య పాత్రలు

నాటక కర్తకును, నాటకకర్తగా రాణింపవయునని యత్నించు కవికిని గల తారతమ్యము, వారిరువురి సామాన్య పాత్రచిత్రణా చణత్వమును బట్టియే గ్రహింపవచ్చును. కళా కారున కల్పవిషయమే యుండదు, నాయకపాత్రను విశాల·

పరిమితిలో నెంతటి శిల్పదృష్టితోఁ జిత్రించునో, యట్టి శిల్ప
సామర్థ్యముతోడనే, యాయా పరిమితులలో చిన్న చిన్న
పాత్రలను దీర్చి దిద్దును. "షేక్స్పియర్" సామాన్యపాత్రలకుఁ
గూడ విపరీతమగు జీవముపోయును. అతనిలోఁగల యసా
మాన్య సృజనాశక్తియే యిందులకు గారణము. కాని కాళి
దాసీయ నాటకశిల్ప మట్టిది కాదు. అది గభీరపయఃపారా
వారము. ఎన్నడును నది చెలియలికట్ట నతిక్రమించదు. ఈ
యుదాత్త కళాధర్మము నాతని ప్రతి రూపకమందును గాంచ
నగును. 'విక్రమోర్వశీయము'న పురూరవుని దేవేరియగు
'ఔశీనరి' కాళిదాసుని లలితకళాశిల్పమునకుదాత్త నిదర్శనము.
ఈమెయేకాదు. ఎప్పుడో యెక్కడో గోచరించు నప్సరసలను
గూడ నీ మహాశిల్పి యత్యంతావధానముతో, వివేచనా నైశిత్య
ముతోఁ జిత్రించును. వారల పల్కు పల్కును భావ
భరితము గావించును. వారి యుచ్చారణలోని కాకువునందు,
వారవలంబించు భావభంగిమయందునుగల కళాసంస్పర్శ, యను
భవనీయము. ఒకే సన్నివేశమున నొకే ప్రయోజనముగల్గి,
యొకే స్వభావముగల చంద్రబింబాననలు నాటకరంగముపై
గుమిగూడెదరు. వారిని వేఱుపఱుచుటే బహుకష్టము. అయినను
కాళిదాసు వారి వారి పలుకుబడులను, వ్యక్తిత్వములను, వేఱు
వేఱుగా పోషించి, యొకరినుండి మఱియొకరిని గుర్తించుటకు
వీలుకలిగించును. రంభ పిఱికిగుండె కలది. కాని ప్రేమమయు
రాలు. క్షణములో నీరసించి కలఁతఁ జెందును. తన యావేద
నను వ్యక్తపఱుచును. మేనక యిట్టిది కాదు. ఠీవితో
ప్రవర్తించును, సంభాషించును; ఆత్మవిశ్వాస మధికము.

'సహజన్య' గభీరహృదయ, మానప్రవర్తన. కాని భావన తక్కువ. రంభామేనకల కన్న కార్యశూర. ఈమెయే పురూరవునకు దానవుఁడేగిన మార్గమును జూపించినది. అప్పటినుండి మిన్నకుండును. ఇతరాప్సరస లెంత తహతహలాడినను నీమె కొంచెమైనను జలింపలేదు. పురూరవుఁడు పూర్తిగా నిష్క్రమించువఱకు నామె వేచి పరిశీలించినది. పురూరవుని పునరాగమనవార్త నుద్ఘాటించిన దీమెయే. "ఓసి! ఊరడిల్లండి! ఊరడిల్లండి!! ఇదిగో చలించుచున్న లేడి జండాతోటి ఆ రాజర్షి రథము సోమదత్తము కనబడుతున్నది. అతఁడు పోయినపని సాధించక, మరలఁడుగదా!!" యను నీమె సంక్షిప్త వచనములు సారవంతమైనవి. ప్రయోజనకరములు. వీనిచే మన మానసములలో ననుకొనకుండగనే యొకవిధమగు సహాయభావము, బలవిశ్వాసములు పొడగట్టును. ఇట్లీమె, మనకొక సుపరిచితమగు వ్యక్తియగును. చతుర్థాంకారంభ మందలి యర్థోపక్షేపకములో నీమెను మఱల మనము గుర్తింతుము. ఇం దీమె విధానము సుస్పష్టముగ దర్శింతుము. అసహాయ స్థితిలో వ్యర్థవిచారమున కీమె యవకాశ మొసఁగదు. ఆప్రేమ మిథునమును విధి వేఱు పఱచినది. తిరిగి యా విధియే వారి నేక మొనర్చును. ఇట్టి సాంత్వన వాక్యములతో నీమె తన విధ్యుక్త ధర్మనిర్వహణ కుద్యమించును.

ఇతరాప్సరసలకన్న చిత్రలేఖ మిక్కిలి యదృష్టవతి. మూడంకములయందు మన కీమె కంఠస్వరము వినిపించును. ఊర్వశికి హితురాలు; సన్నిహితసఖి; ఊర్వశి సౌభాగ్యమునకు నీమె బాధఁ జెందును. ఇది నాటకోచితము. ఏలయన నీమె

యూర్వశికన్న యత్కించిద్విభిన్నరాలుగా మాత్రమే యుండి దీరవలయును. అనఁగా నూర్వశి యాంతరంగిక స్నేహిత యీ చిత్రలేఖ. స్నేహితల కంఠధ్వనులు నాయికా కంఠధ్వనికి నణఁగి యుండట నాటకధర్మము. లేనిచో నాయిక యందు సమాహితమైన యవధానము చలించును. కావున నిట్టి పాత్రలలో విపరీతాడంబరముగాని, ప్రాముఖ్యముగాని, కూడదు. ఇట్టి నాటకావరోధము లెన్ని యున్నను, కాళిదాసు చిత్రలేఖ కొక ప్రత్యేక వ్యక్తిత్వము నాపాదించెను. ఆమె ప్రేమాతిశయము, ఆమె యాదార్యోల్లాసములు; ఆమె ప్రేమోత్కంఠలు; ఆమె నిస్సంగమగు హితవాక్యములు; మందస్మితముతో నూర్వశీ మనోభావముల కనుకూలించుట; జ్యేష్ఠసోదరిగా మాతృస్థానమునం దుండి యుచితానుచితము లుద్బోధించుట; మున్నగు ననేక లక్షణము లీ పాత్రకు నాకర్షణాదరముల సమకూర్చుచున్నవి. చిత్రలేఖ ప్రతిమాట, ప్రతిచేష్టము, నప్సరోచిత దివ్యతేజఃపుంజమును, చాకచక్యమును, నౌచిత్యమును ప్రస్ఫుటించును.

*

అప్సరోగణమునందు చేరక, ప్రాముఖ్యము లేకపోయినను, దయాదాక్షిణ్యములతో; మమతాగంధహీనమగు సంయమన స్వభావముతోడను, స్నేహమాతృత్వ భావ ప్రఫుల్లతతోడను గౌరవభాజనమైన పాత్ర, తాపసి—'సత్యవతి'. కాళిదాస రూపకములం దన్నింటను, మానవ దివ్యస్వభావము; నైష్ఠిక సౌందర్య పరివృత్తమగు సంయమిజన ప్రభావము పరిమళించుచుండును. కణ్వమహర్షి; సత్యవతి; 'మాళవికాగ్నిమిత్రము' లోని దురదృష్ట విద్యావతి, పరివ్రాజక యగు

'కౌశిక'యు నాయా రూపకములం దిట్టి వాతావరణమును గల్పించినవారలె.

* * * *

ఇఁక సామాన్య పురుషపాత్రలు కూడ నిట్లే స్పష్టమైనవి. కాని యివి స్త్రీ పాత్రలవలె విభిన్న వ్యక్తిత్వములతో విశేషశిల్ప పరిపోషకములు గావు. ఇది కాళిదాసీయ పాత్ర చిత్రణ విధానము. రథసూతునకును, వేఁటకానికిని, విశేష తారతమ్య మగపడదు. వారరుదుగా, నల్పముగా మాట్లాడుదురు. నిరంతరము పురూరవుని సాహచర్య ప్రభావ ముండుటచే వారి సంభాషణములందును యత్కించిదలంకారచ్ఛాయ పొడగట్టును. మాణవకుని గూర్చియు, ఆయువును గూర్చియు విశేషముగఁ జేర్కొన్న బాగుండుననిపించును. కాని వారి స్థానములనుబట్టి కాక, వారిలో విశేషమేమియు లేదు. విదూషకుని పాత్రనుబట్టి కాళిదాసీయ కళాసక్రమాభివృద్ధిని గ్రహింపవచ్చును. ఆయువుపాత్ర, కాళిదాస సుకుమార పాత్రీకరణ విధానమునకు, పరిమితత్త్వమునకు, చిహ్నము. ఇందాతని కళాలోభత్వమే కాన్పించును. ఏ పాత్రకెంతవఱకు నవకాశ మీయవలయునో, ఆ కళా ప్రయోజన మెట్టిదో ఈ పాత్రనుబట్టి యూహింపవచ్చును. విదూషకుని పాత్రకూడ నిందు ప్రశంసార్హమైనదే. అతని స్థిమితి విచారము; వార్ధకోచిత విశ్వాస భావము; శిథిల నిష్ప్రయోజక గౌరవము, పలిత కేశుఁడుగా నొసంగు సలహాలు; సాంప్రదాయిక పాత్రపోషణమునందును పార్థక్యమును గల్పించుచున్నవి. పురూరవుఁడు రాజ్యభారమును యువరాజుపై మోపి వానప్రస్థమునకై యడవుల కేగ

నిశ్చయించుకొనినపుడు "అయ్యా! మీ యిష్ట"మని యాతఁడు నిట్టూర్పుటలో నీతని వ్యక్తిత్వము స్ఫురించును. ఏల యన నిది యాతని కడపటి దౌర్భాగ్యము. పురూరవుఁడు యౌవనో త్సాహముతో ఘనతర కీర్తిశాలియై యుండుట నీ ముదుసలి బ్రాహ్మణుఁ డెఱుఁగును. ఆతనికొఱకే యీతఁ డీ వార్ధక్యము నందును బరిచర్య సల్పుచుండెను. పురూరవుని జీవితముతో నీతని జీవితము ముడివడియున్నది. అట్టి పురూరవుఁడు నిష్క్రమించి యొక్క నూత్న యువకుఁడు రాజైనచో యాతని కేమి యుత్సాహ ముండును? ఈ మార్పుచే నీ ముదుసలి జీవితము ప్రయోజన రహితమగుచున్నది. కాని యార్ద్ర విశ్వాసయుత విరక్తి భావముతో నీతఁ డిట్లు తన యలవాటు చొప్పుననే మాట్లాడును.

*

బాల్య మత్యంత మనోహరమైనది. క్రీడాస్వభావ చిత్కళకును, నవక్ర హృదయసంపదకును నీవయస్సు కాణాచి. కాళిదాసు రమణీయభావనము దీనిచే నాకర్షింపఁ బడినది. అందుచే నీతడు తన రూపకమునందు బాలకుల స్వభావమును నవనవోన్మేషముగను, నవవికసిత కుసుమ కోమలత్వము తోడను, సుప్రభాత పద్మదళ విగళిత తుషారబిందువుల వలెను దీర్చి దిద్దెను. ఇందు కళాస్పర్శ విశిష్టత, సత్యజ్యోతియు, దర్శనీయము. సామాన్యకవులు బాలపాత్రలను బరిపోషించు టలోఁ దికమక పడుచుందురు. కాని కాళిదాస కవీంద్రుఁ డెట్టి తొట్రుపాటును లేక బాలపాత్రలకుఁ జెందిన యొక సామాన్య సన్నివేశము గాని, సంభాషణనుగాని, భంగిమను గాని, నటనను

గాని యత్యద్భుతమగు నాటకీయశక్తి సామర్థ్యములతో సమ
కూర్చును.

షేక్స్పియర్ కవి తనకళానైపుణ్యమునంతయు విని
యోగించి విశదముగ పోషించిన "ఆర్థరు"[55] నిజమైన
బాలుఁడు కానేకాడు. అతఁడు వాచాలుఁడు. ఆర్ద్రత లేని
వాడు. భావభంగిమలను గుర్తించి ప్రసారించును. బాలురకు
నాట్యభంగిమ లుండవచ్చును. భావింపఁగల సామర్థ్యముగూడ
నుండవచ్చును. అవి కేవలము విలాసతుల్యములుగా మాత్రమే
యుండవలయును. వానిని గూర్చిన జ్ఞానమే వారి కుండదు.
వారు తమ భావములను, భావభంగిమలను సత్య పరిజ్ఞానము
తోడనే వ్యక్తీకరింతురు. అది తమ కర్తవ్యమనియే వారు
భావింతురు. వానిని సందర్శించుటకుగాని, గ్రహించుటకుఁ గాని
వారి కెట్టి ప్రేక్షక వర్గమును నవసరములేదు. మేధావులైన
వారికి కొన్ని యవధు లేర్పడును. షేక్స్పియర్ విపరీతమేధ,
యాతనిని రెండు స్వర్గధామములలో సంచరింపనీయకుండ నరి
కట్టినది. బాలహృదయము, మాతృహృదయములే యా రెండు
స్వర్గములు. షేక్స్పియర్ 'కాన్‌స్టెన్సు'[56] అను నామెను
'ఆర్థరు'నకు కేవల మొక లాంఛనాప్రాయమగు మాతృ
మూర్తినిగా మాత్రమే చేకూర్చెను. అప్పటి కప్పుడే వేష
ధారణము గావించుకొన్న కపటవ్యక్తిగ 'కాన్‌స్టెన్సు' గోచ
రించును. అద్భుతావహమగు నాటకసృష్టిఁ గావించిన యీ
మహాకవి, మాతృహృదయ మావిష్కరింపఁగల యొక్క స్త్రీ
పాత్రను సృజింపఁజాలకపోయెను. మాతృదేవీ పవిత్ర సౌందర్య
స్ఫూర్తిని గల్గించు కతిపయ శబ్దజాలముండిన యుండవచ్చును.

కాని యంతమాత్రమునకు సహృదయులు రంజింపరు. 'షేక్స్పి యర్' నుండి వా రెంతయో యాశింతురు. స్వార్థరహితమై, కాంతిసముజ్జ్వలమై, ప్రేమవాహిని వదన సీమను వెల్లువలై ప్రవహించు మాతృదేవి నాతఁడు చిత్రించి ప్రసాదింపవలయు నని మన మాకాంక్షింతుము. అట్టి ప్రయత్నమైన షేక్స్పియరు నందు గోచరింపకుండుట శోచనీయము. భారతీయుఁడీ విషయమునం దనూచానమగు ప్రేమానుభూతుల ననుభ వించును. అందుచే భారతీయకవి హృదయసంస్కార మా యా సందర్భముల, రసరూపమున సంపన్నముగా నావిష్కృత మౌను. కాళిదాసు తన యాంగ్లసహాధ్యాయు నీ సందర్భమున నతిక్రమించెననుట యఖండ సత్యము.

కాళిదాసుకూడ షేక్స్పియర్ వలె మాతృప్రేమ భావముకన్న, పితృప్రేమార్ద్రిత నధికముగ ననుభవించినట్లు తెలియును. కాళిదాస కావ్యములందును, రూపకములందును పితృ—పుత్రప్రేమద్యోతక మగు నావేశ భావప్రకటనా దృశ్య ములున్నంతగా, మాతృ—పుత్ర ప్రేమావిష్కారక దృశ్య ములు మృగ్యములు. వాల్మీకి సృజించిన కౌసల్యకు సదృశమగు పాత్ర కాళిదాసు చిత్రింపలేదు. అయినను మాతృత్వ మధుర మనోహార సత్యసముద్దీపిత భావోల్బణము నీతఁడు నిరూపింపక పోలేదు.

ఆయువును, నూర్వశియు, నీ రూపకమునందు పుత్ర మాతృప్రేమ ప్రదర్శించుట కుద్దేశింపఁబడలేదు. ఊర్వశి తన పుత్రు నన్యుల కర్పించి పెంచుమని కోరినది. ఆయువునకు తల్లి దండ్రు లెవరో తెలియదు. ఇట్టి సన్నివేశకల్పనము నిజమునకు

కఠినము. బాధాజనకమును. కాని యిఁట తన నాటకీయ
చాతుర్యముచే కవీశ్వరుఁడీ కల్పనకు మృదుత్వమును, పవిత్ర
తను జేకూర్చినాఁడు. ఎట్టైనను పరిస్థితు లూర్వశిపట్ల నొక విధ
మగు క్షమాభావమునే కల్గించునుగాని, యామె కృత్యమును
సమర్థింపవు. దురంత దుస్థితిలో నూర్వశి తన వివేకము నుపయో
గించి, రెండనర్థముల నోడిగట్టుకొనక, తక్కువదానినే భరింప
సాహసించినది. ఏలయన నాయువును దనకడనే పెంచిన, ఆమె
యాయువునేకాక పురూరవుని గూడ విడిచి పుచ్చనలసి వచ్చె
డిది. ఆయువును మృదులహస్తయు, వివేకవతియు, సాధు
జీవనయు నగు 'సత్యవతి' కప్పగించుటచే నూర్వశి యాతని
యోగక్షేమములను భద్రమొనర్చినది. ఈ త్యాగ మెప్పటి
కైనను జరుగవలసినదే. అల్లారు ముద్దుగఁ గన్న సంతాన
మును గురుకులమునకు బంపి, విద్యావినయవివేకములను సము
పార్జింపఁజేసి, వారిని సాంఘికాదర్శముగాఁ దీర్చిదిద్దుట యా
నాఁటి జననీ జనకుల బాధ్యత. ఆ బాధ్యత నొకింతముందే
యూర్వశి వహించినది. అంతేకాని తనలోని మాతృత్వమును
రూపఱఁజేసికొనునంతటి మూర్ఖురాలు కాదూర్వశి. సత్యవతీ
ప్రేమాంకిత మృదుల హస్తములయందు తన కుమారుఁడు
కుశలముగ నున్నాఁడని గుర్తెఱింగియే యుపశమితయై, యామె
భర్తృవాల్లభ్యమును జూరఁగొన్నది. ఆయువు యూర్వశి
కడకుఁ గొనిరాబడెను. ఊర్వశి యంతరంగమున నద్భుత
భావార్ణవము ఘూర్ణిల్లుచున్నది. కాని యామె యెట్టి వికార
మును జెందలేదు. ఆమె నిరాడంబర మృదుల స్వభావ. మౌన
ముద్రతో నామె కుమారుని సమీపించును. కాని యామె

చేలావృతమైన హృదయమునుండి మధుర స్తన్య ముబుకును. ఆతని సందర్శనానందముచే నామె యనివార్యమగు వియోగ మును గూడ విస్మరించినది. చిరకాలముగా నామెపుత్రసందర్శన సౌభాగ్య సంజాతానందమునకు దూరమైనది. ఇప్పు డది ద్విగుణీకృతమై పెల్లుబికినది. ఈ పరిస్థితి ప్రదర్శన చేతనే, యామెలోని, మాతృత్వమును కవీశ్వరుఁడు మూర్తీభవింపఁ జేసెను. మాటలకుఁగూడ నతీతస్థితి యిది. ఊర్వశిచే నెట్టి మాటలను బల్కించలేదు. అది యామె స్వభావమునకు విరుద్ధము. ఇప్పట్లు ఊర్వశి స్థితిని పురూరవుఁడు గాంచెను. సులభ కవితోద్రిక్తుఁడగు సీతఁడు వెంటనే యా స్థితి నీ రీతిగా వర్ణించెను.

కం॥ చనుదెంచెను గౌతుకమున
నినుఁగని కనుఁబండు వొంద నీ జనని, సుతా!
అనురక్తిమెయిం జేఁపిన
చనుగవపాలకుఁ దడిసిన చనువలిపెముతోన్.

ఒక్కచూపునందే, పరిమితభాషణమునందే ఊర్వశి తన యనుభూతి సర్వస్వమును ద్యోతమాన మొనర్చినది. ఆమె మౌనముద్రలో నిహితమైయున్న యనుభూతి సాంద్రత నవగత మొనర్చుకొనుట కామె నిత్యజీవితముతో నివసింపవలయును.

* * *

ఆయువు పాత్రకూడ ప్రశంసార్హమైన యొక కళాఖండ మననగును. ఇట్టిపాత్రను బోషించుటలోఁ గొంతక్లిష్టత కలదు. అది పెరిగడి వయస్సు. ఒకవంక బాల్యచాపల్యము, వేఱొక వంక తెలిసీతెలియని స్వభావము. అన్నిమానసిక దశలందును, నీ దశను నిరూపించుట మిక్కిలి క్లిష్టము. ఇదియొక క్షణక్షణా

పరిణామావస్థ. నాటకమునం దిట్టి పాత్రను బోషించుట కెంతో నైపుణ్య మవసరము. లేకున్న నది యతుకుల బొంతగా సిద్ధమగును. కాళిదా సిట్టి శిల్పమునను సిద్ధహస్తుఁడు. ఈతని భాషణమునందు సమయోచిత నైపుణ్యము, నవాంతర భేదములును గలవు. అదియు మిక్కిలి పరిమితముగను, నతి సామాన్యముగను నుండును. అట్లుండుటయే విపత్తరణోపాయముకూడ. ఎట్టిశ్రమయు లేకుండనే సర్వసామగ్రియు సమకూడినది. ఆయువు తపోవనమునుండి యొక్కమారుగా వైభవోద్దీపితమగు నొకానొక రాజసభాంగణమున నడుగిడును. ఆతఁ డితః పూర్వ మెఱుఁగని తల్లిదండ్రుల సమక్షమున నందు జేరెను. ఇది ఎంతటి క్లిష్ట సన్నివేశమో యూహించుట గూడ కష్టము ! ఆతనిలో నాత్మచైతన్య మావిర్భవించెను. అనేక సందేహములు పొడమినవి. తన సహజ పరిసరములకు వైదొలఁగు టాతనికి సహింపరాకుండెను. ఆతఁడు తన దౌర్బల్యమును గప్పిపుచ్చుకొనుటకై విపరీతమగు హుందాతనము నవలంబించెను. తెలిసీ తెలియక పెద్ద మనుష్యునివలె వర్తింపనెంచెను. అకాలభావపచేళిమ సూచన గూడ మన కీ పాత్రయందు గొంచెముగా గోచరించును. అపరిచితులగు వ్యక్తులు, తన్ను, తమవాఁడని సమీపమునకుఁ దీసికొనుచుండిరి. వారికిని తనకును నేదో బాంధవ్యమున్న ట్లాతని ప్రాచీనానుభవము ప్రబోధించుచున్నది. అతని స్వభావగతమగు పెద్దఱికము కొంత పెత్తనము వహించినది. కాని యతని యథార్థ మానసికస్థితి నర్థము గావించుకొనుటకై యదృష్టవశమున, నాతనిని పెంచిన దాది, తపోవన ప్రతినిధిగా, నాతనివెంట వచ్చినది. తల్లిచెంత

బిడ్డ కెంత చనువో, ఆమె చెంత నితనికిని అంత చనువు. అతఁ డామెవంకకు మరలినపుడుగాని, యామెతో సంభాషించినపుడు గాని, యతి సహజముగా మాటలోను, చేష్టయందును, తపోవనమున నామె కొంగు పట్టుకొని సంచరించిన సామాన్య బాలుఁడయిపోవును. బాలునివలె సంభాషించును; యోజించును; విధేయతతో నామె యాజ్ఞను శిరసావహించును. ఏమి ఈ మనోహర కళాజీవనములోని మాధుర్యభరిత స్వాభావికత్వము! ప్రకృతి కెంతటి సన్నిహితమగు ననుసరణ మిది !!

'మాళవికాగ్నిమిత్రము' లోని రాజపుత్రిక 'వసులక్ష్మి' నాటకరంగముపై కానరాదు. అయినను నగ్నిమిత్రుఁడు చిత్రఫలకమును సందర్శించి, దేవికిదగ్గరగా వ్రాయఁబడిన యపూర్వాంగన యామె పేరేమి యని కుతుకముతో ధరణినిఁ బ్రశ్నించినపుడు దేవి యా ప్రశ్నకు బదులుచెప్పక యనాదరమును జూపును. రాజు పేరును గ్రుచ్చి గ్రుచ్చి యడుగును. అపుడు బాల్యావస్థకుఁ దగిన ట్లీవసులక్ష్మి "అయ్యా! ఈమె మాళవిక" యని బల్కిన ముచ్చటయిన మూఁడు మాటలు భావికథకు గమనమును గల్గించును. అప్పటినుండి ధారణి మాళవికను గంటపడనీక జాగ్రత్తవహించును. 'శాకున్తల' రూపకమునందు సింహకిశోరముతో భరత బాలకుఁ డాడుకొను దృశ్య మెంత సౌందర్య సముద్దీపితమైనది! నూటికి తొంబది తొమ్మిదిమంది కవుల కిట్టి కల్పనఁ జేయఁగల సామర్థ్య ముండదు. కాని కాళిదాసు మధురహస్తములలో నీ కల్పన మనల్ప శిల్పగరిమతో జీవకళారమ్యతతో నొప్పారుచున్నది. పులిపిల్లలతో నాడుకొనుచున్న ఆ భరతుఁడు, పిల్లిపిల్లలతో

నాడుకొనుచున్నట్లు సహజశోభతో, మనకు కనుపించి యానందింపఁజేయును. పరిణత కళా ప్రాభవమన్న నిట్టిది!!

*　　*　　*　　*

ఇఁక విదూషకుఁడగు మాణవకుఁ డొక దుర్బలవ్యక్తి. సంప్రదాయానుకూలముగ సిద్ధించిన విదూషక పాత్ర కాళిదాస రూపక క్రమాభివృద్ధితోఁబాటు వృద్ధి జెందకపోవుట శోచనీయము. "మాళవికము"లోని విదూషకుఁడగు "గౌతమఁడు" జీవకళతో సమగ్రముగ నొప్పారు నొక వ్యక్తి. కథా సంవిధానమునం దీతనికిని ప్రాధాన్యము కలదు. సామాన్య విదూషకులవలె నితఁడును హాస్యప్రియుఁడు, అసత్యవాది, బాధ్యతా రహితుఁడు, తుంటరియే. కాని యీ లక్షణముల నతకరించి, ఈతనివలన నాటక కార్యమునకు కొంత ప్రయోజనము సమకూడుచున్నది. కాని "ఊర్వశి" రూపక కథా సంవిధానమున విదూషకున కిట్టి ప్రాముఖ్యము నొసంగిన దాని యత్యున్నత సౌందర్యస్థాయికి భంగము కల్గును. అది మహా దోషమేయగును. అందుచే విదూషకుని పాత్ర యొక సాధారణ సంభాషకుని స్థాయికిఁ దగ్గింపఁబడెను. పురూరవునకు విశ్వాస పాత్రుఁడైన యొక వ్యక్తి, సంభాషణార్థము కావలయును. అందులకే ఈ విదూషకపాత్ర ఏర్పఱుపఁబడినది. కానిచో రూపకమునందతనివలనఁ గల్గిన యేకైక ప్రయోజనము--తన తెలివితక్కువతనము చేత స్వయముగ పురూరవుఁడే ఔశీనరితో తన రహస్యమును భేదించియుండెనను నిపుణిక మాట నమ్మి, తానే యసలు విషయమును బైటపెట్టెను. అయినను రూపకమున కీ పాత్ర యొక వైవిధ్యవిలసితమైన శోభ

నాపాదింపఁ జేయుచునే యున్నది. ఈతఁడు మాళవిక, శాకుంతల రూపకములలోని విదూషకులకన్న విభిన్నుఁడు. గౌతముని కున్న శక్తిసామర్థ్యములు కాని, యుత్తమతత్త్వజ్ఞతగాని ఈతనికి లేదు. అతనికన్న కఠినముగను, మొరటుగను సంచరించును. విదూషకునకు సర్వసామాన్యముగా నుండు విపరీత భోజన ప్రియత్వము, నసభ్యాచేష్టాదికము, భీరుత్వములతోఁ బాటు సమయానుకూల పరుషహాస్యము, దైవ ఘటితమగు ప్రపంచ పరిజ్ఞానము, విలక్షణమగు కార్యదక్షత మున్నగు ననేక గుణము లీతనికి కలవు. ఇఁక పురూరవుని సాహచర్య ప్రభావ మున నలవడిన యాలంకారిక భాషాప్రయోగము విషయమై వేఱుగాఁ బేర్కొనఁబనిలేదు. ఇన్ని గుణము లుండియు, నాతని మానస మున్నతస్థితి నందుకొనలేదు. తనయంతరమునుండి యే యితరపాత్రల యుదాత్తత నూహించును. ఈతనిలో నెన్నదగిన మఱియొక సుగుణము కపటవేషములు వేయఁడు; తా నపహాస్యము పాలగుటకు సర్వదా సంసిద్ధుఁడు. కాంతి తఱిగి సర్వసమముగ వర్తించు నీ పాత్ర పురూరవుని గాన మనోహ రాదర్శ హృదయమును, కాంత్యాదర్శ విలసితమగు నూర్వశిని, వైవర్ణ్యముతో నుండియు పట్టమహిషి ఠీవితో నొప్పు ఔశీనరిని సర్వవిధముల రంజింపఁజేయగల సామర్థ్యము గలదనక తప్పదు. విదూషకుఁడుగా రూపకమునం దీతనికిఁగల స్థానమును బట్టియే కాని యొకవ్యక్తిగా నెట్టి ప్రాముఖ్యము నీతనికి లేదు. ఈతఁడు పెద్దగా నాకర్షింపజాలక పోవచ్చును. కాని నీరసమును మాత్రము కల్గింపఁడు. ఏదెట్లున్నను మాణవకుఁ డొక సజీవ పాత్రయని నిర్ణయింప వచ్చును.

* * * *

నాయికా నాయకులను బరివేష్టించిన ఈ సామాన్య పాత్రలలోనే, దూరముగా నిలువఁబడి యుదాత్త ప్రతిపాదనలతో స్వాతంత్ర్య శీల ప్రతిపత్తితో నొప్పువ్యక్తి 'యౌశీనరి,' మనదృష్టిని బలవంతముగ నాకర్షించును. ఔశీనరీదేవికి పదవిని బట్టి గొంత ప్రాముఖ్య మున్నను, నాటకచర్యయం దంత ప్రాముఖ్యము లేదు. ఈమె యసూయ నాటకచర్య కెట్టి యవరోధమును కల్గింపదు. ఆమె త్యాగము పురూరవుని ప్రేమను బవిత్ర మొనర్చును. నాటక కథానిర్మాణమున నీమెకు స్థానమే కనుపించదు. కాళిదాస నాటకశిల్పమునందీ పాత్రనుబోలిన పాత్రయే పొడగట్టదు. ఈమెను ప్రవేశపెట్టుటచే పాతకథకూడ ప్రవేశపెట్టఁబడినది. కాని యందులకై వినియోగింపఁ బడిన సమయ మత్యల్పము. భార్యకు సామాన్యముగా నుండు నీర్ష్యాభావ ప్రదర్శమునకే ఈమె మనకు కనుపించును. ఇది సాంప్రదాయికముగా నున్న విషయమే కాని యన్యము కాదు. వికసించిన గులాబి పుష్పమునకును, వికసించుచున్న గులాబి మొగ్గకునుగల స్పర్ధయే యీ స్పర్ధ. కాని మాళవికము నందిదే విషయము రూపకమున కంతకును ప్రాతిపదిక. ఇక్కడ మాత్రము దీని ప్రస్తావన యత్యల్పము. కేవల కథాగమన గతము. ప్రారంభాంకములలోని పాత్రలకన్నను, మాళవికము లోని 'ధారణి' కన్నను కూడ పురూరవుని పట్టమహిషి సార సుకుమార భావాన్వితయన నొప్పును. కాశీదేశపు యువరాణి ఉశీనరుని పుత్రిక, ఔశీనరిని గూర్చి ఆమె ప్రత్యర్థిని యగు నూర్వశి "ఈమె దేవీ శబ్దముచేత నుపచారమునందుట యుక్తమే. తేజమునందీమె శచీదేవి కేమాత్రము తీసిపోద"ను

ప్రశంసావాక్యములను బల్కుట పరికించితిమేని, యట్టి యీమె తన భర్త పురూరవుఁడు, తన్ను పర్యుదాసముచేసి, స్వర్గ వినిర్గత యగు నొక యప్సరసను ప్రేమించి, యందే విలీనమై తన సౌందర్యమున కాఘాతమును, విషాదమును గల్గించు చుండ; ప్రతిఘటించుట సమంజసమేయని మనము సానుభూతితో భావింపక మానము. 'మాళవికము'నందలి ప్రేమమాత్సర్యము లింతగ బలితములు కావు. ఇరావతీ యౌవనోద్రిక్త ప్రేమ కన్న, ఔశీనరి ప్రశాంతప్రణయభావమే ప్రగాఢమైనది. ధారణి, దాక్షిణ్యా స్వభావోచితమైన బుద్ధిపూర్వకమగు త్యాగముకన్న, ఔశీనరి యుత్తమ విషాదమును, నాత్మత్యాగ నిరతియు నెక్కువ శక్తిమంతములై, మన హృదయములను గదిలించును. ఈమె శీలచిత్రణమునందు నైశిత్యము, సంయమనము, యుదాత్త కళానిరూపణమును ప్రస్ఫుటము. ఇరావతిలో నుప్పొంగిన యసూయోద్రేకము ఔశీనరిలో నుప్పొంగలేదు. కాని ఈమె యసూయా స్వభావ మంతకన్న తీక్ష్ణము, ప్రచండమునైనది. అది యామె యాంతరంగిక ప్రౌఢప్రేమకు ప్రచ్ఛన్నాకృతి. ఆమె తన ప్రేమభావ తీవ్రత నిట్లు నర్మ గర్భముగ, నాత్మ నిందాపూర్వకముగఁ ప్రకటించినది.

"నీ యందపరాధములేదు. నేనే యిందులో అపరాధను. నేను ప్రతికూలదర్శనమై, నీ యెదుట నిలుచున్నాను. నే నిటనుండి వెళ్తాను."

ఇంతటి తీవ్రసముచిత నిరసనను బ్రకటించినను, తన్మూలమునఁ దనకుఁ గల్గబోయెడి పాశ్చాత్తాపము నామెగుర్తింపక పోలేదు. అందుచేతనే "నిర్దాక్షిణ్యము వహించినందుకు కలిగే పశ్చాత్తాపతీవ్రతకు వెరుస్తాను." అని యాత్మగతముగా నీమె

తలంచును. క్రోధము తాత్కాలికముగా నామె నాప్రదేశ మును వీడఁజేయును. కాని యీ యంకము తరువాత నామె పశ్చాత్తప్తయైనట్లు సందర్శింతుము. ఆగ్రహమునందును నామెకు బలీయమగు నిగ్రహముకలదు. సంయమన మధుర హృదయగభీరతా సంజనిత మగుటచేతనే యామె త్యాగ నిరతికి, కవితాముద్ర చిక్కగాఁ బడినది. విదూషకుఁడు తన సహజ పరిహాసవిధానముతో దెప్పుచూ మాటాడినపుడు, ఔశీనరీ ప్రేమపరిత్యాగ భావోద్రేకము హటాత్తుగా నిట్లు వెల్లుబుకును.

"మూర్ఖా ! నేను నా సుఖమును జంపుకొని ఆర్యపుత్రుని సుఖిత శరీరుని చేయఁగోరుచున్నాను. దీనిని బట్టియే ఆయన నాకుఁ బ్రియుఁడో! కాఁడో!! గ్రహించుకో!!"

పురూరవుని సత్యాసత్య ప్రేమాసక్తప్రతివాదనలను, దుఃఖితయయ్యు, మృదులముగా త్రోసిపుచ్చి, ఔశీనరి రూపక మునుండి నిష్క్రమించును. కాని ధౌతదుకూలయుగ్మము ధరించి, మంగళ సూత్రభూషయు, పరిమిత పుష్పాలంకృతయునై నవతృణ వితానచూర్ణ కచాళితో నా ప్రవిమలోదాత్త భక్తి ప్రపూత త్యాగశీలిని మనప్రక్కనే నిలువబడి త్యాగ సౌందర్య ప్రసూన సౌరభముల వెదజల్లుచున్నట్లు మనకు గోచరించు చునే యుండును. తిరిగి యామె మనకు రంగముపై కనుపించు నవకాశ మేలేదు. కాని పునర్లబ్ధుఁడైన యాయువునకు యౌవ రాజ్యాభిషేకము పూర్తియైన పిమ్మట, ఊర్వశి, పురూరవుని యవియోగము చే వర్ధిల్లు నానందోత్కట సమయమున, "వత్సా !! రా !! మీ దొడ్డమ్మకు నమస్కారము చేయు"

మని దొడ్డబుద్ధితోఁ గోరునప్పుడు మాత్రమే ఈమె పేరు నాటక రంగమున కడసారి వినిపించును. ఔశీనరి పవిత్రనామము నిట్లూర్వశిచేఁ దుష్యంతుదను స్మరింపఁజేయుటనుబట్టి, యూర్వశీ హృదయ మౌశీనరీత్యాగశీల సంబంధ పరిపూర్ణ విశ్వాస భరితమైనట్లును; భగవానుఁడగు చంద్రుఁడు రోహిణితో గూడి యధికముగా శోభించు తరుణమున ఔశీనరి, తానై కైకొన్న పవిత్ర వ్రతము ప్రత్యక్షరముఁగా బాటించి సుమనస్కయై నట్లును, నావిషయ మూర్వశిగూడ గుర్తించి, యా త్యాగ వ్రతకు లోలోన నంజలించు కొనుచున్నట్లును; మాటలచేఁ గాక, క్రియాత్మకమగుధ్వని మార్గమున నిరూపించిన కాళిదాసు కళావైదగ్ధ్యము నాన్యతోదర్శనీయముకదా !!

నీతి నియమయుత పవిత్రప్రభావప్రఫుల్లత; యూర్ధ్వ హృదయశక్తి సముత్సుకత; సుకుమార భావోద్రిక్తతాసంయు మనయుతమైన ఈ మహాకవీశ్వరుని శీలచిత్రణ శిల్పమునందు మానవకోటికి మహిమాన్వితమగు నభ్యుదయపథము సాక్షా త్కరించును. ప్రవిమల కాంతిమాధుర్యము; సత్య జీవిత ప్రవృత్తి; సుకుమారోల్లసిత కళాకౌశలము కాళిదాసు పూర్వ కృతులందున్నను; విక్రమోర్వశీయమునం దింతకన్న పరిణత మైన కళాప్రతిభావిన్యాసము, బహుముఖములుగా పరివ్యాప్త మైనవి. ఇందుండియే యా కవికులసార్వభౌముఁడత్యున్నత కళా శిఖరముల నధిష్ఠింప నుద్గమించె ననచ్చును.

## (iv) అప్సరసలు

మానవస్వభావ సౌందర్య మాధుర్యముల నున్మీలించుటే కాళిదాసు కవిత్వమునఁ గల యాకర్షణ విభూతి. ఆతఁడే విషయమును జేఁబట్టినను, నది యత్యద్భుత కళా ప్రపంచ సంబంధియై రసజగతీ సౌందర్య శోభల నవఘళింపఁజేయును. దివ్య కవితా వరప్రసాదుఁడగు నీ కవి మధురహస్తము నందు కవిత్వము పరసీమ నధిష్ఠించినది. అయినను నది సహజ శోభా విలసితము; మానవ హృదయ సన్నిహితము; మానవత్వ జీవన పరిపోషకమును గాకపోలేదు. 'షెల్లీ'[57] కవి విరచిత 'విచ్ ఆఫ్ అట్లాస్'[58] 'కీట్సు' కవి విరచితమగు 'సిన్ థియా'[59] కావ్యములు కూడ సుందరమైన కళాసృష్టులే. కాని యందులో జీవకళ యల్పము. అందలి దృశ్యము లస్పష్టములు; అస్థిరములు. కవులు కలలలో గాంచినట్లుగా నుండును గాని సుస్పష్టమగు దార్శనికశక్తి యందు మృగ్యము. అవి మన భావన కొకింత ప్రీతిఁగొల్పునే కాని, మన హృదయములను గదిలింపవు. అవి మత ప్రతిపాదకములగు భావనల కాలవాలమై దురవగాహముగా నుండును. అవి ప్రపంచేతర విషయభరితములు. హైందవుఁడు కూడ నొక స్వాప్నిక జీవిగను, తత్త్వచింతనారతుఁడుగను నిందింపఁబడును. ఈ యారోపణమునందు సత్యము కలదు. కాని కేవల మదే సత్యమనరాదు. ఒక విధముగాఁ జూచిన హైందవమానసము వాస్తవిక జీవిత సంబంధమైనది. మఱియొకవిధముగాఁ జూచిన ప్రపంచవిముక్తికి హైందవుఁడు సదా యన్వేషించుచున్నట్లుండును. భావము పాతుకొనుదాక నాతని

మానసము విశ్రమించదు. వాస్తవిక దృక్పథమును తులనాత్మకముగాఁ జూచిన చాల సులభము. సూర్యుఁడు, జలము, వాయువు, భూమి ఇతర పదార్థములన్నియు భౌతికవస్తు రహస్యములం దత్యుత్తమముగ నిమిడియున్న వనియు తెలిసికొనుట సులభము. కాని హైందవుఁడీ పరిజ్ఞానముతో తనియఁడు. ఆతని దృష్టి యాంతరంగికమైనది. తత్పరిజ్ఞాన సంపాదన మతని లక్ష్యము. అనంతము, నదృష్టము, తాత్త్వికమునగు జ్ఞాన సంపాదనమున కాతఁడు సదా తహతహలాడును. ఏతత్సంపాదనతోడనే యాతఁడు తృప్తిఁజెందక, యా యనంతమును పరిమిత మొనర్చుటకు; నదృష్టమును దృష్టమొనర్చుటకు; తత్త్వమునకు రూప మొసఁగుటకు సదా యత్నించుచుండును. 'కెల్టు' జాతి యనంతమును గూర్చి తన భావనను బ్రసరింపఁజేయును. సుందరమగు చిత్రములను జిత్రించును. తత్సంబంధమగు దురవగాహమైన కవిత్వముగూడ నల్లును. హైందవుఁడు తనహృదయమును, మేధను, కడకు తన సర్వస్వమును ఏవంవిధ భావనామార్గమున ధారవోసి, తన ఈ తపస్సునకు ఫలితముగా భగవంతుని దర్శించి, సృష్టిముఖతః వ్యాఖ్యానించును. ఇట్టి హైందవ ద్వంద్వ స్వభావమునందే హైందవ జీవిత, మత, వాఙ్మయ, నాగరికతా రహస్య మిమిడియున్నది. మహోన్నతాధ్యాత్మికత్వము, విపరీత భౌతికత్వముతో సామరస్య పూర్వకముగా కృషి సల్పవలయునని జయప్రదముగ యత్నించుచున్నది. ఒక వైపునుండి మనము సమస్త భౌతిక ప్రపంచమును నాధ్యాత్మిక దివ్యదృష్టితో తిలకింతుము. ఈ ప్రపంచము బుద్బుదప్రాయమని, మాయ యని భావింతుము. మఱియొక వైపునుండి యాధ్యా

త్మిక దివ్యతత్త్వమును సత్యసౌందర్య సముద్దీపిత రూపములుగా నిర్మించుకొని యానందరతుల మగుదుము. ఇది మహోదాత్త వేదాంత రహస్యము. ఇది యందఱకును నవగతమగు విష యము గాదు. దీనిని గ్రహించుట కొక విధమగు సంస్కారబల ముండవలయును. అట్టి సంస్కార ప్రాబల్య విరహితుఁడగు పాశ్చాత్యున కిది యంతయు గందరగోళముగ నుండును. ఇంకను, హైందవ సృజనాశక్తి నిదర్శనమగు విగ్రహారాధ నము, కతిపయ గ్రాంథిక సూత్రములను జిలుకవలె పఠించు క్రైస్తవునకు వికార మనిపించును. సామూహిక స్వభావము గల మఱియొక జాతిపట్ల నీమానసిక విభాగము విభిన్న వ్యతి రేక ద్వంద్వశక్తులుగా నుండి సామరస్యమునకు యత్నిం చుచు, క్రియాప్రతిక్రియలతో గూడి యొక గొప్ప భావచరిత్రగా సిద్ధమయ్యెడిది. బహుముఖీనములగు మనఃప్రవృత్తి గల్గి యొకే యొక మూర్ఖవిధానమునకు లొంగని హైందవుని మానస మిట్లు వింగడింపఁబడలేదు. తొలుదొల్త విభిన్నముగఁ గన్పించినను, కాలపరిణామమున నొక సమైక్యభావము సమకూడును. విలక్షణము, సర్వోత్తమము నగు హిందూ మానస మీ విభేదము లన్నియు సృష్టివైచిత్రిని సుస్పష్టముగను, సునిశిత ముగ గ్రహించుకొనుట కత్యంతావసరమే యని భావించును. ఇవి యన్నియు నొకే యొక సత్యము యొక్క భిన్నముఖము లనియు, పరిపూర్ణ సత్యజ్యోతిని సందర్శింపవలయునన్న, నీవిభిన్నముఖ పరిజ్ఞాన మనసరమనియు సరసుఁడైన హైంద వుఁడు తలంచును. కావున హిందూమతమునందలి యవాంతర భేదములను సహన సద్భావముతో సమాదరించుటే మానవుని

లోఁగల స్వేచ్ఛాతత్త్వమునకు ప్రముఖ నిదర్శనము. ఇందలి వివిధ దృక్పథములుకూడ, హిందూమానస మధిరోహింప నెంచిన పరమ జ్ఞానశిఖరమునకు సోపాన పరంపరయే కాని యన్యముకాదు.

జాతీయ మేధాప్రవృత్తియే తజ్జాతీయ కవిత్వమునందు గాఢమగు భావముద్రను వేయును. సంస్కృత భాషలో శృంగారాధ్యాత్మిక మగు ద్వివిధ మనఃప్రవృత్తుల యందు నిష్ణాతుఁడైన కవిపుంగవుఁడు కానరాఁడు. అతని పాదద్వయము భూమిపై పాతుకొనక పూర్వమే యాతని దివ్యదృష్టి వినీల విహాయస వీధియందు లగ్నముకావలయును. హైందవ భావాంబరమున సామాన్య విహంగము లేకాక, రాజహంసలుకూడ సమానస్వేచ్ఛతో విహరించును. అందుచే వివర్శకులకు సంస్కృత వాఙ్మయమున తత్త్వగర్భితమగు కవిత్వము విశేషముగా కానరాదు. ఆంగ్లవాఙ్మయానుకరణమున వెలసిన నవీన వంగకవిత్వ మిట్టిది. ప్రాచీన సంస్కృతకవిత్వముభావ, వస్తురచనాకళల త్రివేణీసంగమము. ఇందు నిగూఢత్వముండదు. ఈ కవిత్వము శక్తిమంతము, తేజోవంతము, సుస్పష్టమునైనది. ప్రపంచము మిథ్యయని ప్రకటించు నుపనిషత్తులుకూడ నొక నిశితాచరణ విధానము ననుసరించి, యనంతము నొక పరిమితి యందును, రూపరాహిత్యమును రూపమునందును బ్రతిపాదించుటకుఁ బరిశ్రమించినవి.

కాని మన కవీశ్వరు లందఱిలో నొక్క కాళిదాసునకు మాత్రమే ఇట్టి ద్వివిధములగు హైందవ మనఃప్రవృత్తుల నత్యుత్తమ కళాసౌందర్య సమైక్యతతో సముద్దీపింపఁజేయు

సామర్థ్యముకలదు. బహుముఖీనములగు శాస్త్రపాండిత్యము గల హైందవకవులలో నగ్రగణ్యుఁడనదగు నీకవికుల సార్వభౌముఁడు, మన సంప్రదాయములను, భావములను, దివ్యగాథలను నైతిహ్యములను, నివి, యవి యననేల ? యల్పము, ననల్పము, నుదాత్తము, ననుదాత్తమును నగు ననేక విషయములను తన మంత్రదండమును బోలిన లేఖినితో, తన కవిత్వస్వభావమునకు శ్రుతిగల్పుకొని వర్తించునట్లాదేశించును. అతని యత్కించిత్ మధురలేఖినీ సంస్పర్శమునకే యెట్టి ప్రాకృత విషయమును, ధీరగంభీరశృంగార రసాత్మకముగ పరివర్తించును; అత్యల్పవిషయమును జిత్కళాశోభ లెగజిమ్మును. దివ్య విషయములు ప్రాపంచిక విభూతి మాధుర్యములను సముపార్జించుకొనును. కేవల శృంగారాంశములు శక్తిమంతములై కాంతులీనును. ఆతని కావ్యములు నిక్కమునకు వినూత్న కాంతి పుంజము లెగజిమ్ము దివ్యజ్యోతులు. ఆ జ్యోతులు, భూ, జల, విభాగముల కపూర్వము లైనవికావు. నిత్యమును మనము సందర్శించు నుషః కాంతి పూరములే సౌందర్య పరివర్తనమున విరాజిల్లును. ఇది కేవలపరివర్తనమే కాదు. సూర్యకిరణ నిహిత దివ్యకాంతిగనే కాక మానవ సంబంధమగు మహితకాంతి గాకూడ నిదిసన్నిహితము. ఇది మనకు మిక్కిలి సుపరిచితమేకాని కవీశ్వరుఁడు గమనించి స్పష్టపఱచినపుడు కాని మనము తెలిసికొని యానందింపఁజాలము. మానవ హృదయ నిహిత విజ్ఞాన పరంజ్యోతియే భాస్కర ప్రకాశ రూపమున సందర్శితమాను. అదియే హైందవ భావనా స్వర్గధామము. అది ప్రతి హైందవ కావ్యమును నిట్టి దివ్య

నికేతనముగాఁ జేసికొని విరాజిల్లుచుండును. క్రూరమృగ రాజముసరసనే యమాయికకురంగరాజమునకుఁగూడ కునుకు పట్టించు స్వర్లోక మొక్క హైందవకవిత్వమునం దేకాంచనగును.

కాళిదాసు కావ్యము లందలి వ్యక్తులు విశేషముగా దేవతలో, దేవతాతుల్యులో, ఖేచరులో !! కాని వీరు దివ్య గాంభీర్య లక్షణోపేతులుగ వర్తించుచునే, మానవానుభవ స్థాయికి గొనిరాబడుదురు. వారి భాషణము, వారియాలోచన, వారియుద్రేకము మానవ సంబంధములే కాని యన్యములు కావు. ఇట్టి కారణముచేతనే, కవియు, నంతర్దృష్టిగల విమర్శ కుఁడును నగు "బంకించంద్రఛటర్జీ" "కుమారసంభవ" మహా కావ్యమును, "పేరడైజ్‌లాస్టు" మహాకావ్యము కన్నమిన్న యనినాఁడు. ఈ రెండు మహాకావ్యములు నొకే సారస్వత ప్రక్రియకుఁ జేరినవనియు, నుదాత్త విషయాన్వితమై, చక్కని ప్రణాళిక కల్గి, భావపరిపక్వమైన కవితాశైలితో నొప్పారుచున్న వని యాతని నిష్కర్ష. ఈ హైందవ కవిత్వమున హృదయద్రవీకరణ శక్తి కొంచెము న్యూనమైనది. కాని మానవ నిరాడంబరజీవిత మాధుర్యానుభవము లత్యుత్తమముగా నిందుఁ బరిపోషితములు. "పేరడైజ్ లాస్టు"నం దీ పరిపోషణము తులనాత్మకముగా జూచిన తక్కువయే యనవగును. నేనిప్పుడు ప్రసంగించు నీ మాన వత్వము, 'హెూమరు' కవీశ్వరుఁడు నిరూపించిన స్వభావ వాదముకాదు. హెూమరు పోషించిన దేవతావ్యక్తు లలో నుదాత్తతగాని వినూత్నతగాని మృగ్యము. వ్యక్తు లందుకన్న, నాయా పరిసములందును, సన్నివేశముల యందును నీ రెండులక్షణములును మిన్నగాఁ గన్పడును.

కాని కాళిదాసుని దేవతావ్యక్తులు, తత్తుల్యులైన వారు, మానవస్థాయికి గొనిరాబడినను, వారి వారి దివ్యలక్షణములను గోల్పోరు. ఇందుల కత్యుత్తమ నిదర్శనము 'మేఘసందేశము'. ఈ సుందరస్మృతికావ్యములందలి వ్యక్తులవంటి వ్యక్తులను 'షెల్లీ' కూడ కల్పించవచ్చును. వారిరువురును ప్రేమికులు. వారిది నదీపర్వత జలధర దేవతా పరివృతమగు స్వర్గధామము కావచ్చును. కాని మేఘయానమందలి లక్ష్యము, శివజటాజూటస్థిత చంద్ర చంద్రికాస్నాతమై, మహేంద్రపర్వత నివాసపయోధర పరివృతమై, జ్యోతిర్మయముగా గోచరించు నలకాపట్టణమునకుఁ జేరుట. మేఘారూఢమైన విహంగావలోకమునందువలె సమస్త ప్రకృతియు నిందు సమీక్షింపఁబడును. షెల్లీకవికూడ నిట్లే వర్ణించెను. కాని మేఘసందేశ వర్ణనలలోని దార్శనికవైశద్యమిందు శూన్యము. అంతేకాక షెల్లీ మన మానసమును బ్రేరేచి, తగురీతి తృప్తిపఱుపక గందరగోళపఱుచును. 'క్వీన్ మాబ్'[60] 'ప్రామిథియస్ అన్ బౌండ్'[61] 'విచ్ ఆఫ్ అట్లాస్' మున్నగు నీతని కృతులలోని వ్యక్తులు, దృశ్యములును నీ శ్రేణికి జెందినవి. కాని కాళిదాసు చిత్రించిన పురము తుషారావృతమై దృశ్యాదృశ్యముగ నుండునదికాదు. అలకా పట్టణమాతని సౌందర్యవైభవోపేతమగు నుజ్జయినీ నగరముయొక్క యాదర్శీకరణమే. అందలి మర్త్యవిషయములు పరిహరింపఁబడినవి. హైందవునకు సహజమగురీతిని, కాళిదాసు ఆదర్శమును సుపరిచిత భౌతిక ప్రపంచస్థాయికిఁ బరివర్తించును. తమ పుణ్యఫలమొకింత కొఱవడగా, నమరులు భూమి కరుదెంచునపుడు, శేషపుణ్యమున నొకించుక, స్వర్గమును తమ

వెంట దెచ్చిరా యనునట్లుగా నలక యొప్పుచుండును. సారస
మదకల కూజిత సారసమాసారకరణచణమై, సుఖాతిశయ
కారణమై యలక యుండెను. చాటూక్తులతో నూరించు
వయస్యునివలె, నుషస్సులలో శీతలసమీరము, సురతాంత
తాంతి నపనయించుచు వీచును. ఆ పురమందలి హర్మ్యములు,
లలనాపదరాగాంకితమై, సుమగంధముల నెగజిమ్మును. ఈ రీతి
వర్ణన లెంత హృదయంగమములు !! ఎంత మానవ సన్నిహిత
ములు ! ఎంత సాధారణములు !! ఇట్టి వీనిని పఠించునపుడు
మన మొక సౌందర్యధామమునకు సన్నిహితముగా నున్నట్లు,
లేదా తాదాత్మ్యమును జెందినట్లుందుము. ఇందలి వివిధ
జీవజాలము మన భావనకు క్రీడా వస్తువుల వంటివి కావు. ఇవి
నీరస నిత్యనైమిత్తిక ప్రపంచమునుండి మనల నొక
యానంద ప్రపంచమునకు తరలించును. కాళిదాసుపట్ల
భారతీయుల కానందోత్సాహము లిప్పటికిని తగ్గ కుండుటకు
కారణ మాతని కవిత్వములోఁగల ఈ యాకర్షణమే. ఆతని
శ్లోక మొక్కటి పఠించినంతనే మన పరిసరములు, జీవి
తము, మనల ననుసరించెడి మానవ పశుసంబంధమగు భూత
జాలమేకాక, మనముచూచెడి యచేతనములు సైతము,
హటాత్తుగా సౌందర్యసముజ్జ్వలములై, యితఃపూర్వముకన్న
నాత్మీయముగా కనిపించును. మన హృదయప్రవృత్తి మృగ
శకుంతసంతానములను గూర్చి ప్రసరించును. పాదపములు, తమ
శాఖామృదుల హస్తసంచాలనములతో సమీపమున కాహ్వా
నించును. నిరర్థకములగు మేఘములు, జ్ఞానహీనములగు పర్వ
తములు నారీతిగాకాక, స్నేహభావయుత వార్తాహరులుగా

నుండి, మన హృదయములను బల్కారించును. మన సామాన్య భావములు, ననుభూతులు, భావోద్రేకములు గణనీయములై సౌందర్యభరితములగును. అనంతరమిట్టి యానందోత్సాహాతిశయములతోడను, జీవిత ప్రేమ పరిజ్ఞానముతోడను; నీ సకల సౌందర్య సముద్దీపిత వస్తుసమూహామునందు నిహితమైన యనంతతత్త్వమును సుగ్రాహ్య మొనర్చుకొందుము. అంతే కాదు.ఇకనుండి యవి కేవలవిషయములుగా నుండక, యాంతరంగిక ప్రియాస్వరూపములుగా మారును. వాని విరహము నొకింతేని సహింపజాలనిస్థితి ఏర్పడును. ఈభౌతిక ప్రపంచమును దృణీకరించి, మనమా రసజగత్తునందే సదావసింపనాకాంక్షింతుము. ఈరీతిగా సామాన్యదృష్టికి విపరీతముగా గోచరించు చున్నను; హిందూ స్వభావమం దిమిడిన ఈ యలౌకిక సౌందర్యమార్గముననింద్రియ సాహాయ్యముతోపయనించి, సచ్చిదానందమూర్తి దివ్యసన్నిధికి జేరగల్గుచున్నాము. మన పూర్వులు 'యమనియమవిధి నిషేధక్రతు శాసితమైన బుద్ధి' మూలమున శ్రమించి సాధించిన లక్ష్యము నలవోకగా నీ మార్గము మనకుఁ జేకూర్చుచున్నది. హిందూ మానసము రుచిభేదముల ననుసరించి యనేక మార్గముల నన్వేషించినది. అన్నియు నా నిఖిలరసామృతమూర్తి యరుణారుణ పాదపద్మ సన్నిధానమునకు జేర్చునవియే. కాళిదాస కవిత భారత జాతి మానసమును, పురాణ ప్రవచనమత విధానమునం దెంత శక్తిమంతముగా మరలింప గల్గినదో! విజ్ఞాన ప్రపంచమునకు సువిదితము. ఆమహా కవిత్వము భారత జాతిని మాతృదేవీపూజా ధురంధరుల గావించినది. ఏతత్కారణమును బురస్కరించు

కొనియే, వాల్మీకి—వ్యాసుల సరసన కాళిదాసుకూడ మన జాతీయ కవిపుంగవుఁడుగా గౌరవింపఁబడు నర్హత నాతఁడు సంపాదించుకొనెను. అతిక్లిష్ట పరిస్థితి యందీ కవీశ్వరుఁడు, తన దివ్యకవితాశక్తిచే భారతజాతీయ మానసమునుబతనోన్ముఖము గానీయక, యవిచ్ఛిన్న సాంప్రదాయిక విజ్ఞానసరిత్తున మహా ప్రస్థానమును గావింపఁజేసెను.

ఈ మార్గమునే కాళిదాసు తన కవితాకళా సౌందర్య గరిమతో జయప్రదముగా 'ఊర్వశి' రూపకమున రూపొందించెను. అప్సరస లత్యద్భుత సౌందర్యభామలని, స్వర్గలోకవాసులని హైందవ పురాణము లుద్ఘాటించును. పాలసముద్రము నుండి ప్రభవించినదే తడవుగా వీరు జ్యోతిర్మయాంబరముల ధరించి, దివ్యాభరణాలంకారములఁ దాల్చి, సహస్రాధికమగు కిన్నెరలనుండి నాదసుధాలహరులఁ బ్రవహింపజేసిరి. వారి సౌందర్యదీప్తి సకలలోకములను కళకళ లాడించినది. సూర్య కిరణజాలమునందు వారు గుమి గూడిరి. స్వర్గసీమలో సౌదామినులతో వారును బ్రకాశించిరి. వినీల విహాయస వీధులలో హాయిగా వారు విహరించిరి. సూర్యోదయ సూర్యాస్తమయములకు వారరుణారుణ సందీప్తిని ప్రసాదించిరి. నిసర్గమనోహర గానమునందు వారు శ్రుతిగల్పిరి. జీవితాంతరంగమున వారు నివసించిరి. కవులకు, శిల్పులకు, చిత్రకారులకును వా రాదర్శప్రాయులైరి. వారి యాలింగన సౌఖ్యానుభూతి, భగవదనుభవానందసిద్ధుని గూడ పతితు మొనర్చినది. ఆనంద జీవితము, సౌందర్యసమృద్ధి, యింద్రియలోలుపత మున్నగు లక్షణములను ఆధ్యాత్మిక, ఆధిభౌతిక స్వభావము గలహైందవు లప్సరసలలో

నాపాదించిరి. ఈపద ముపయోగింపఁ బడినపుడెల్ల యీ యర్థము స్ఫురించుచుండును. ప్రాచీనపురాణగాథలయం దీ యప్సరసల విషయము వినిపించును. అందును బ్రాహ్మణముల యందు, విష్ణుపురాణము నందును గల యద్భుతమగు పురూరవుని గాథలో నీ యప్సరసలపాత్ర యపూర్వమైనది.

తరువాత కొంతకాలమునకు భౌతికప్రపంచమున సుప్రసిద్ధమగు పదమొకటి, శృంగార భావసూచకముగా కావలిసి వచ్చినది. గణికలను నొకవర్గ మేర్పడినది.

గ్రీకు సంఘమునందువలె, హైందవ సంఘమునందును నీ గణికాశ్రేణికిఁగొంత ప్రాముఖ్య మేర్పడినది. గ్రీకుగణికలకు గ్రీకు సంఘముపై నున్నంత ప్రభావము, హైందవ గణికలకు హైందవులపై కానరాదు.

గ్రీకు గణికలవలె హిందూ గణికలుకూడ చక్కని విద్యాపాటవము గల్గిన నాగరకులే. కాని వీరికి, వారికివలె కుటుంబినులపై నెట్టి యాధిక్యతయును లేదు. ఏలయన మహమ్మదీయ యుగమునకుఁ బూర్వము గౌరవాస్పదులైన స్త్రీలందఱు, 'ఎథీనియన్' మహిళయట్లు విద్యా విహీనలైన గృహిణులుకారు. పురుషులట్లు ప్రత్యేకముగా విద్యా సంస్థలలో శిక్షణము నందకున్నను, భారతీయ మహిళలు, విద్యావతులనియే యెన్ననగును. జననీజనకులు వీరికి సాధారణ సంస్కృతీ పరిజ్ఞానమును గఱపిరి. అట్లు వీలుపడనిచో విద్వాంసులను తమ గృహముల కాహ్వానించి, వీరు తమ దుహితలను సంగీత సాహిత్యములయందు; చిత్రలేఖన, శిల్ప,

భరత నాట్యాదులయందును నిపుణలను గావించుచుండిరి. నీతి శాస్త్ర పరిజ్ఞానమును, శాస్త్ర మర్యాదలును, వీరి కవశ్యము నేర్పఁబడెను. ఇందును నుత్తమ వంశ సంజాతులు, ధనాధిక్యతను బట్టి కన్యలుగనో, పూర్వసువాసినులుగనో, వేదాంత వాసనాశోభితు లయ్యేడివారు. కాని బౌద్ధ యుగమునకుఁ బూర్వ మిట్టి యుదాహరణములు విశేషముగా గన్పించవు. సామాన్య హైందవుఁడు, నారీ ప్రపంచమంతయు గృహసీమ యందే యిమిడి యున్నదని భావించును. భర్తృజీవితమునందు తాదాత్మ్య మొందనిచో, భార్య జీవిత మసమగ్ర మానని ఈతని నిశ్చయము. ఎట్లయినను, కులవధూ శాస్త్ర కళోపాసనము పారము ముట్టలేదనవలయును. కాని గణికావర్గ మొక వృత్తిగా సమస్త శాస్త్ర కళాధ్యయనమును గావించెను. అందుచే వారు తమ నిత్య కృత్యముగా దేవాలయములయందు నాట్య ప్రదర్శనము గావించుచున్నను, పట్టాభిషేకాది విశేష సమయములయందును, పర్వదినములయందును వారు సభా వేదికలపై తమ కళావైదుష్యము నంతయు నఖండముగ ప్రకటించుచుండిరి. అందుచే నున్నత వర్గమునకుఁ జెందిన రసికులు, ధనసంపన్నులు, నొకవంక సద్గ్రంథాంగులతోఁ గాపురము చేయుచునే, బాహాటముగా నీ గణికలతో రంజిల్లుచు, ద్వంద్వ జీవితములను నిర్వహించిరి. గణికావర్గమునకు సంఘము నందెట్టి నైచ్యమును లేదు. వీరతినీతిహీనులగు దొమ్మరివారివంటి వారు కారు. సాంఘిక నియమములు సడలినపు డీ గణికా వర్గమునందును ననేకులు నీతి బాహ్యులై కాముక ప్రవృత్తితో సంచరించిన మాట వాస్తవము. కాని యిది సహజముగా

నేర్పడిన పతనావస్థ. అయినను సున్నిత వైజ్ఞానికస్థాయియం దున్న వారుకూడ వీరిలో నొకవంక లేకపోలేదు. తమ కామ ప్రవృత్తియందు స్వాతంత్ర్యము నభిలషించి నీచవారకాంతగా జీవించుట కిష్టపడని యిట్టివారికి 'మృచ్ఛకటిక' రూపకమందలి 'వసంతసేన' ప్రాతినిధ్యము వహించును. ఈమెవంటి గణిక లనేకులు తమకు సరియైన ప్రియుల నెన్నుకొనుపట్ల పలువురను మార్చియుందురు. కాని వారి మానసమొకసారి స్థిరపడినచో, తాము వలచిన ప్రియుల భార్యల సమాధానమును బడిసియే వీరు ధర్మపత్నీత్వమును స్వీకరించెడివారు. ఇట్టి వారకాంతలు, ఉన్నత నీచస్థాయిలో నిన్న మొన్నటివఱకును వర్ధిల్లిరి. పాశ్చాత్య నాగరికతా ప్రాబల్యము బలసినకొలఁది, యీ వర్గము క్రమక్రమముగ నంతరింపసాగెను. వారి స్థానమున పాశ్చాత్య నాగరికతా ప్రభావముచే వ్యభిచారవృత్తితో జీవించు నొక నూత్నవర్గము తలయెత్తెను. అనివార్యమగు కాలపరిణామక్రమమున నేర్పడిన ఈ దుస్థితిని సంఘసంస్కార కరవాలముచే ఖండింప జూచుటంత సమర్థము కాదు. దీనికి మార్గాంతరములు కలవు.

కావున నప్సరసలు స్వర్గలోక గణికా సమూహము. వీరు నాట్య విద్యా ప్రవీణలు, సంగీత కళానిపుణలు. రాక్షసుల విధ్వంసక చర్యలనుండి తమ్ము తాము కాపాడుకొను ప్రయత్నముచే విసిగి వేసారెడి దేవతాకోటి నీగణికాకోటి తమ నాట్య కళా సంపత్తిచే నానందపఱచును. ఈ గణికలు తమ్ము చేపట్టువా రెవరని సంద్రమునుండి యుద్భవించిరని వాల్మీకి కథనము. దేవతలు కాని, రాక్షసులుగాని వీరిని స్వీకరించుట

కిచ్ఛగింపరైరి. అందుచే వీరందఱికిని జెందినవారైరఁట. అప్సరసయేల స్వర్గలోకపు గణికగా పరిగణింపబడెను? ఇంద్రియ వికార ప్రాబల్యమునకు, నాకర్షణకు నీ గణిక ప్రాతినిధ్యము వహించును. అవినీతి ప్రబలి, దైవచింత తఱిగినపుడు, కామము తన యింద్రియ సైనిక సాహాయ్యముతో రాజ్యమేలును. అట్టి కామశక్తిని తృప్తిఁబఱచుటకు స్వేచ్ఛ కావలయును.

నింద్రియ సౌఖ్యానుభూతికి ప్రపంచమున గణిక యవసరమని దీనినిబట్టి తెలియుచున్నది. ఏలయన, నప్సరస సౌందర్యాకర్షణము మానసవీథిని మసలుచున్నపు డది మఱెంత ప్రబలమై సంచలనత్వమును గల్గించును. ఆ సంచలనత్వము సఫలమగుదాక యితరాలోచనలు, కార్యములు కొనసాగవు. దీని నదుపులోనికి తెచ్చుట దుస్సాధ్యము. ఈ సౌందర్యాకర్షణము మనల నవినీతిపరులను జేయవలెనని యాశింపదు. కాని ఎట్టి నైతిక పరీక్షల నిది యంగీకరింపదు. ఎట్టి ధర్మము నిది పాటించదు. ఆకాంక్షా సాఫల్యమే దాని పరమలక్ష్యము. గణికాతత్వమేయిది. నగ్నచిత్రము, నగ్నశిల్పము నీతి విరహితమైనవి కావు. సౌందర్య ప్రపంచము ముఖ్యముగా నగ్నముగనే యుండును. వస్త్రధారణ మప్పు డప్పు డుపయోగించు నొక యలంకరణము మాత్రమే. ఈ రెండును బరస్పర విరుద్ధములనఁ జాలముకాని, ఈ రెంటికి నంత సన్నిహిత సంబంధముకూడ నున్నదని యూహింపరాదు. సమస్త కళలయాశయములు నప్సరసలో నిమిడియున్నవి, ఆమె యాటకత్తె, గాయని, చిత్రలేఖిని. సురాసురు లెవ్వరును వీరిని భార్యలుగా చేపట్టలేదు. అందుచే వీరందఱిని నానంద పఱుచువారైరి. మానవునిలోగల

నిర్మాణాత్మక శక్తులుగాని, విధ్వంసక శక్తులుగాని యింద్రియ సంబంధమగు నానందమును శాశ్వతముగా నవసరమని గుర్తింప లేక యట్టి యానందము తమ యాదర్శ సాధన కంతరాయ మని భావించి యుండవచ్చును. అందుచే నా యానందము తాత్కాలికముగనే పరిగణింపఁబడెను. ఇట్లుండ కొందఱకు కేవల మీ విషయ సౌఖ్యమే పరమావధియైనది. నిత్య జీవితాదర్శ సాధనమునందు నీరసులై, యీ యనుభూతియే యుత్తమమని యింక కొందఱు భావించిరి. ఇట్లెందరు చాంచల్య మును బొందినను, యనేకులు, మానవ పరిణామ విధానమునఁ బ్రశంసనీయులై, యవికారము, నచంచలము, నవనవోన్మేషము నగు నాంతరంగిక శక్తితోఁ దమ యాదర్శముల సాధనము నందే సంతతము నిమగ్నులయిరి. అన్నివిధముల దేవలోక మందలి యప్సరసకుఁ బ్రతినిధిగా భూలోకమున గణిక గణింపఁ దగినది. ఇట్టి యప్సరసా ప్రతిరూపము నేర్పఱుచుకొని హైందవమేధ తిరిగి, యింకొక్క మారు తన యతిలోక సృజనాశక్తిని ప్రదర్శించినది. ఈ విషయమున గ్రీకులు చూపిన దోషరహిత ప్రశంసాయుత నైపుణ్యమును, చాతుర్యమును, హైందవులు మఱింత విశిష్టముగ చూపగల్గిరి.

ఊర్వశి సృష్టినిగూర్చి కొంత ముచ్చటించుకొంటిమి. బ్రహ్మజ్ఞాన ప్రతిష్ఠితమైన మానస మెప్పుడైన తన దివ్యశక్తి ప్రభావముచే నింద్రియాధీనమైన భౌతిక జీవితమును గూడ రసమయ మొనర్పవచ్చును. ఏలయన వేదాంతాదర్శములు తమ ప్రాభవమును కేవలము మేధపై మాత్రమే ప్రసరింప జేసి యూరకుండవు. అది మానవుని లౌకిక జీవితముపైనను

వి_స్తరించును. అవి మానవునకు రసానందదాత్మక దృక్పథము నేర్పఱచును. అప్పుడా యింద్రియలోకము సౌందర్య భరిత మౌను; దివ్యకాంతి సముత్ఫుల్లమౌను; వినూత్న భావ సముత్సుకతతో, మానవాదర్శములను, విస్తృత మొనర్చుచు, సర్వాలను గాఢముగా నాకర్షించును. యమనియమ సాధనలచేఁ గృశించిన మహర్షి యూరువులనుండి జనించిన యూర్వశియే పాలసముద్ర తరంగములనుండి ప్రభవించిన యప్సరసలకుఁ దలమానికమై, సౌందర్య సౌదామినియై యప్సరస లందఱి యందును తాపసులకు గుండె గాలమైనది.

*   *   *   *

నాటక నిర్మాణమునకును, నుత్కంఠకును నీ యూర్వశీ గాథ యొకరమణీయమగు సృష్టి. ఇంతదనుక నూర్వశీ దివ్యత్వము, ఆ దేవవనితలో నిహితమైయున్న నారీస్వభావము విశ్వ వ్యాపితము కాలేదు. ప్రాచీన పౌరాణిక గాథపట్ల నెట్లు నిపుణతతో మెలగవలయునో సమగ్రముగ నెఱిఁగిన నెఱజాణ కాళిదాసు. మన మీ యూర్వశినిగూర్చి విశేష పరిజ్ఞానమును బడయవలయుననియు; ఆమె యతిలోక సౌందర్యాతిశయము రూపకమునం దంతటను బరివ్యాప్తము కావలయుననియు, ఆమె సంభాషణలయం దొక నూత్నవైభవము, ఆమె నాట్య భంగిమ మం దొకింత ఘనత, ఆమెను సామాన్యాప్సరసనుండి వేఱుపఱుచు దివ్యత్వము, అడుగడుగునఁ బొడగట్టవలయునని మన మాకాంక్షింతుము. కాని కాళిదాసు ఊర్వశీ దివ్యత్వ ఘనతల నే మాత్రము కావలయునని పొడగట్టనీయ లేదు. ఇది కాళిదాసు నిర్దుష్ట నిరుపమ కళానైపుణ్యమని నా యభిప్రా

యము. ఆతని నాటకీయ మనస్తత్వ పరిజ్ఞాన మట్టిది. ఊర్వశీ పురూరవులను సమానముగ, నాటకోచితముగ నీతఁడు తీర్చిదిద్దెను. ఇరువురును భావనయందును లక్ష్యము నందును సమానులుకారు. ఇరువురిని కవితా కళా వైభవముతో నాడంబరముగాఁ బ్రదర్శించినచో నాటకాభిరుచియు, నల్లికయు నిస్సారముగా నుండెడివి. ఆ వైభవము, నా మనోహర సంభాషణము లతిమధురములై వెగటుగొల్పెడివి. ఇఁక మనస్తత్వము ననుసరించి పరికించిన ఊర్వశీ దివ్యత్వము, విశ్వజనీన సౌందర్యాకర్షణము, సంభాషణాడంబరత్వమునందును, దివ్య వైభవమునందును, నిరూపింప బ్రయత్నించినచో నవి శోభించెడివికావు. సమగ్ర సౌందర్యమునకు ద్విముఖములు కలవు. దాని సహజ సౌందర్య సంపద యొకటి. ఇతరులపై స్వకీయ సౌందర్యముద్రణము రెండవది. మొదటిది నిరాడంబరమైనది; నిరలంకారమైనది; వ్యక్తిత్వ విరహితమైనది. నిరాడంబరమగు నొకచిత్రముకాని, శిల్పముకాని, సహజశైలీ విశిష్టమై, తత్వ సమృద్ధిగల్గి, మానవున కాదర్శోపేతమై, యుత్తమార్హత నాపాదించును. ఆడంబరాలంకరణములు, ఆంతరంగిక దివ్య తేజః పుంజము నతకరించును; అప్రతిహతమగు మమకార భావమును బ్రతిఘటించును. అంతేకాదు. సహజనిరాడంబరో ద్విగ్నమానసము; సౌందర్యముద్ర నద్భుతావహమగు రీతిని స్వీకరించి; యందే నిమగ్నమై, నూత్నభావ ముద్రలను బొందుచు, నిత్యచైతన్య శక్తినిగల్గి, ఎప్పటికప్పుడు క్రొత్త క్రొత్తభావ సంబంధముల నేర్పఱుచుచు, సజీవభావనా విలసితమై వర్ధిల్లును. సారస్వత మారంభదశలో కన్యాభావ

సౌందర్యముతో కళ కళ లాడును. అప్పు డల్పధీమంతులకు కూడ నానందమును బ్రసాదించు నితిహాసములు సృజింపఁ బడును. సారస్వత చరమదశయందు గత కాలసౌందర్య సంపద సమస్తము లీనమౌటచే, నద్భుతావహమగు భావసంపదతో, రసాతిశాయి, శబ్దాతిశాయియైన కావ్యసృష్టి జరుగును. ఊర్వశీ పురూరవుల కలయిక యిట్టి సారస్వత నియమమునే సూచించు చున్నది. ఊర్వశి స్వచ్ఛంద సౌందర్యరాశి. సకల ప్రపంచాకర్షణశక్తి. సకలానంద ప్రదాయిని. ఆమె కామెయే సాటి. ఆమె కెట్టి వాగాడంబరముకాని, మేధా సమగ్రతగాని యవసరములేదు. కాని యూర్వశి, తన సంపూర్ణ పవిత్ర రూపమును, దివ్య సౌందర్యారాధకుఁడగు పురూరవుని ప్రఫుల్ల మానసమందే విలీన మొనర్చి స్వకీయ కాంతిమత్తచే నాతనిని స్వాధీనపఱుచుకొనిఁ యాత్మీయవైభవ పరివేష మండలమునందే ప్రవర్తింప జేసినది. దివ్యత్వము మానవత్వ మును వరించినది. మానవత్వము దివ్యత్వము వాగర్థములవలె లీనమైనవి. ఒకదాని కొకటి పూరకమై సంపూర్ణతను బ్రసాదించినది. ఇది యీ రూప కాదర్శము!!

# ౭

# కుమారసంభవము - పార్వతి పాత్రోన్మీలనము

పాత్రోన్మీలనము విశిష్టమగు కావ్యశిల్పము.. ప్రపంచ వాఙ్మయములను సమగ్రముగ సమీక్షించిన సారస్వతేయులీ యున్మీలన విధానమును త్రివిధముల వింగడించిరి. అందు మొదటిది జాతి విలక్షణ పాత్రోన్మీలనము, రెండవది ఆదర్శ పాత్రోన్మీలనము, మూఁడవది వాస్తవిక పాత్రోన్మీలనము. ముప్వురు కవిమూర్ధన్యుల మధుర కావ్య సృష్టులయందీ మూఁడు విధానములు పరాకాష్ఠ నందెను. వారే వ్యాస కాళిదాస షేక్స్పియరులు. ఇందుఁ గాళిదాసు గావించిన యాదర్శ పాత్రోన్మీలనము నవలోకింతము.

కాళిదాసు శైవుఁడు. అతని మతము శైవాద్వైతము. పార్వతీ పరమేశ్వరు లాతని కిష్టదైవతములు. ఈ సృష్టి యంతయు తత్స్వరూపమే. ప్రకృతియే పార్వతి. పురుషుఁడే పరమేశ్వరుఁడు. కాళిదాసు తన ప్రథమకావ్యమగు ఋతుసంహారమునఁ బ్రకృతిని వర్ణించెను. అందుఁ బరమేశ్వరీ చరణ మంజీర నినాదముల నడుగడుగునకు నాలించినాఁడు. ప్రప్రథమమున మానవునకు గోచరించునది ప్రకృతిమాత్రమే. జ్ఞాననేత్రమును విప్పుటకు మొదలుపెట్టినచోఁ బురుషుఁడుగూడఁ గానవచ్చుచుండును. మొదట ప్రకృతియుఁ బురుషుఁడును భిన్నులుగాఁ గానవత్తురు. అట్టివారి కభేదము నెఱింగి యొక్కటిగాఁ గాంచుటయే జ్ఞానముయొక్క పరాకాష్ఠ. కుమారసంభవమున నా విషయమంతయుఁ గవి చక్కఁగా నిరూపించినాఁడు.

పార్వతి పరమేశ్వరుని యర్ధాంగలక్ష్మి యెట్లు కాఁగల్గి నదో! అట్టి సర్వోత్కృష్టమగు జగన్మాతృస్థానము నధిష్ఠించుట కెట్టి త్యాగనిరతి, అచంచలవిశ్వాసము, నిష్ఠాగరిష్ఠతయు నవ సరమో కవికులగురువగు కాళిదాసు పార్వతిపాత్రోన్మీలనముచే మనోజ్ఞముగ నిరూపించెను. ఇట్టి పాత్రల స్వభావోన్మీలనము చేతనే యీ కవిసార్వభౌముఁడు భారతీయ ప్రణయ రహస్య ములను గాంతాసమ్మితముగా నుపదేశించి రసలుబ్ధులకు రసా మృతము పంచిపెట్టెను.

పరమేశ్వర ప్రేరణమున దక్షుఁడు ప్రజాపతి యయ్యెను. ప్రజాసృష్టికిఁ గడంగిన దక్షునకు నఱువది కూఁతు లుదయించిరి. విధివిహితముగా వా రందఱిని దగిన భర్తల కొసంగెను. వారికిఁ బుట్టిన సంతానముచేఁ జరాచర మంతయు వ్యాప్త మయ్యెను. ఆ కన్యలలో సతి యను కన్య నాతఁడు రుద్రున కొసంగెను. కన్య నొసంగుటచే నతఁడు రుద్రునకు గురుస్థాన మధిష్ఠించెను. అందువలన రుద్రునికంటెఁ దా నధికుఁడ నను భావ మాతని మనమునఁ బొడమెను. దేవత లందఱు రుద్రు నధికునిగాఁ గొనియాడుట యాతని కసూయాకారణము కూడ నయ్యెను. అతనిని గొంచెపఱచుటకై దక్షుఁ డొకయాగము చేయఁగడంగెను. దేవతల నందఱిని యాగమున కాహ్వానిం చెను. పురాణపురుషుఁడైన యల్లునకుమాత్ర మాహ్వాన మంపలేదు. దక్షున కింత యహంకారమా! యని పరమేశ్వ రుఁడుతలఁచెను.

సతి పతివ్రత. భర్తనీ గతి తండ్రియెల్లిద మొనర్చుట యామెకు గష్టముగా నుండెను. "తండ్రి కింత యహంకార

మేల ? పట్టుదల యేల ?" యని తలంచినది. తండ్రి పట్టుదల మాన్ప సమకట్టినది. * "అనాహూతో౽ధ్వరం గచ్ఛేత్" అని పెద్ద లందురు. కావునఁ బిలువ కున్నను సతి తండ్రి యొన రించు యాగమున కరుగదలఁచెను. పరమేశ్వరుఁడు వలదని వారించెను. కాని యామె తనపట్టుదల మానలేదు. తండ్రిని బోలిన కూఁతురే యని శివుఁడు భావించెను. పిమ్మటఁ దండ్రి వలనఁ బరాభవము పొందినది. తన లోపము, నెఱిఁగి, యోగముచే శరీరము వదలి, పునర్జన్మమునకై శైలాధినాథుని తనయ యైనది.

దక్షుఁ డహంకారి. ఆతని కూఁతురగు సతికిఁగూడ నాదోషము సంక్రమించెను. అహంకారము రజోగుణ లక్షణము. శివుఁడు జగత్పిత. అతని భార్యయగు నీమె జగన్మాత కావలెను. రజస్తమోగుణోపహతి గావించిన సత్త్వోద్రేకముచేఁగాని యట్టి దుర్లభస్థానము లభింపదు. కావున నామె కింకను నట్టి పరిపూర్ణత సిద్ధింపలేదు. పరిపూర్ణతకై యామె యింకొకజన్మ మెత్తవలసి వచ్చెను.

సతీదేవి ధరణీధరేంద్రుని తనయగా మరల జన్మించెను. శివుని మహైశ్వర్య మెఱింగి యాతనియెడఁ బూజ్యభావము గలవాఁడే యామె తండ్రి యగుట కర్హుఁడు. హిమవంతుఁ డట్టివాఁడు. శివుని పాదరజము శిరముపైఁ దాల్చుకొనిన వాఁడు. నగాధిరాజు. దేవతాత్ముఁడు. ఓషధీశ్వరుఁడు. మహోన్నతుఁడు. అనేకరత్నప్రభవుఁడు. అట్టి రత్నములలోఁ బార్వతీ కుమారీరత్న మగ్రగణ్యము గదా !

---

* పిలువక పోయినను యజ్ఞమునకు పోవలయును.

శుభప్రదమై స్థావరజంగమరూపములైన శరీరు లన్నిటి కిని బార్వతీ జన్మదినము సుఖప్రద మయ్యెను. హిమవంతుఁ డంతకుమున్నే పుత్రవంతుఁడైనను నాతని ప్రాణమంతయుఁ గూఁతుపై నుండెను. ఆమె వలనఁ దాను పవిత్రుఁడైనట్లు; అలంకృతుఁడైనట్లు భావించెను. పార్వతి దినదినప్రవర్ధమాన యగుచుండెను.

బాల్యమున నామె మందాకినీసైకతవేదికలందు సఖీ సమేతయై క్రీడారసము చూఱఁగొనుచుండెను. ఇట్టి బాల్య విచేష్టితములందు సైత మామె ధర్మనిరతి వ్యక్తమగుచుండెను. తగిన యీడున నామె విద్య నభ్యసింపఁ దొడంగెను. శర త్కాలమున గంగానదికి రాయంచ లరుగుదెంచిన తెఱంగున, రాత్రియైనంత మహౌషధిని దనకాంతులు చేరు వడువున, నుపదేశకాలమునందే పూర్వజన్మ వాసనావశమున విద్య లన్నియు నామెకుఁ బ్రాపించినవి.

యౌవనావిర్భావమునఁ బార్వతి సర్వాంగసుందరి యయ్యెను. ఈమె విధాతృని యనిదంపూర్వసృష్టి. సౌందర్యము నంతయు నొక్కచోఁ జూడవలెనను కౌతుకముతో విధాత సర్వోపమాద్రవ్యములఁ దెచ్చి వేనిస్థానమున వాని నుంచి ప్రయత్నముతో నామెను సృష్టించి నట్లున్నది.

ఇట్లుండ నొకనాఁడు కామచారుఁడగు నారదుఁడు పితృసమీప మందున్న పార్వతిని గాంచి "ప్రేమచే హరుని యర్ధాంగమును హరించి యేకపత్ని కాఁగల" దని యాశీర్వ దించెను. రిత్తవోవని మునిసత్తముని మాట మదియం దుంచి

హిమవంతుఁ డామెకొఱకై యెట్టి వరాన్వేషణముఁ గావింప లేదు.

సతీవియోగానంతరము శివుఁడు సర్వసంగ పరిత్యాగ మొనర్చి హిమాలయమందే యొక రమ్యప్రదేశమున నేమి కోరియో ! తప మాచరించుచుండెను. అద్రినాథుఁ డీ విషయ మెఱిఁగి యయ్యష్టమూర్తిని బూజించి సఖీసమేతయైన తన తనయ నాతనిశుశ్రూష గావింప నానతిచ్చెను. ఇతరగుణముల నామె యెంత యున్నతయయ్యును పెద్దలయెడ వినమ్రురాలు. తండ్రియానతి శిరసా వహించి శివుని సేవించుచుండెను.

పార్వతి త్రినేత్రునికన్నుసన్నల మెలఁగుచు, శ్రమయనక పూజాప్రసూనముల సంతరించుచుఁ బరిచర్య గావించుచుండెను. అది రమ్యప్రదేశము. ఉపచరింపఁబడువాఁడు యువకుఁడు. తాను తరుణి. తారుణ్యామపరాధకారి. అట్టియెడ నెట్టిలోపము లేక, ధైర్యము చలింపనీక సేవించుట పార్వతి నిగ్రహమునకుఁ బ్రబల నిదర్శనము.

ఆసమయమున దేవతలకార్యము దీర్పనెంచి మన్మథుఁడు రతీ వసంతులఁ గూడి శివుని యాశ్రమమునకు విచ్చేసెను. వసంతవిజృంభణ మారంభ మయ్యెను. వసంతావిర్భావముచేఁ జేతనాచేతనములు కామపరవశము లాయెను. స్థాణు వనౌకసు లైన తపస్వు లా సమయమున నమిత ప్రయత్నముపై తమనో వికారముల నణఁచుకొనఁగల్గుచుండిరి. శివుఁడు సమాధినిష్ఠుఁడై యుండెను. దూరమునుండి యాతని దర్శింపఁగనే మన్మథుని చేతినుండి చాపశరములు జాఱి క్రిందపడెను. అతని పట్టుదల

సన్నగిల్లెను. శివుని సేవించుటకై వచ్చిన పార్వతిని గాంచి యతని ధైర్యోత్సాహము లించుక నూల్కొనెను. అప్పు డామె నవోదిత వసంత ప్రసూన భూషణాలంకృతయై, కిసలయవిరాజ మానయై, నడయాడు లతవలె నొప్పుచు తన చెలికత్తియలతో శివుని సేవావసరమును బ్రతీక్షించుచుండుట మన్మథుడు గాంచినాడు.

అది మిక్కిలి పరీక్షాసమయము. మన్మథుని మనోరథ మీ పర్యాయ మటో యిటో తేలిపోవలయును. అధరీకృతరతి సౌందర్య యగు పార్వతీ సౌందర్యమున కేమైనఁ జారితార్థ్య మున్నదో లేదో నిర్ణయింపఁబడు క్లిష్టసమయ మది. ఈ సమస్యను బ్రతిపాదించుటకే యిట మహాకవి పార్వత్యాగ మనము సర్వోత్కృష్ట కవితామాధుర్యములతో వర్ణించెను. త్రిభువనైకసుందరి యగు పార్వతీరూపమగు నాలంబన విభావ మైన, అకాల వసంతావిర్భావముచేఁ గల్గిన యుద్దీపన విభావ మైన యోగ నిష్ఠాగరిష్ఠుఁడైన శ్రీకంఠునిలో నిద్రాణమైయున్న స్థాయిభావమును ప్రబోధింపలేకపోయెను. కేవల బాహ్య సౌందర్యముచేఁ బరమశివుని మానసము రంజిల్లదను విషయము స్పష్టమయ్యెను. మన్మథుఁడు మర్యాద మీఱి వర్తించెను. తనయంతరము నెదిరియంతరము నావంతయుఁ దెలియక శివునిపై సమ్మోహనాస్త్రము ప్రయోగించెను. శివుఁడు చంద్రోదయప్రా రంభమున నంబురాశివలె ధైర్యము సన్నగిల్లఁ బార్వతీ బింబోష్ఠముపై మక్కువతోఁ జూపుల మఱలించెను. పార్వతి సిగ్గు దొంతరలు తొనకాడ మొగ మావలికిఁ ద్రిప్పి తన భావ మును వ్యక్త మొనర్చెను. శివుఁడు తన భావవికార మెఱిఁగి

వెనుకకుఁ దిరిగి మన్మథుని దుశ్చేష్టితమును గాంచి కోపముతో
నాతని భస్మావశేషుని గావించెను. ఇఁక స్త్రీ సామీప్యమును
బరిహరింపఁదలఁచి యతఁ డంతర్హితుఁడయ్యెను.

అట్టిస్థితిలోఁ బార్వతి యేడువలేదు. మూర్ఛ మునుంగను
లేదు. కొంతవడినిర్ఘాంతవోయి తెప్పరిల్లి తండ్రికోరిక వ్యర్థమైన
దనియుఁ, దన సౌందర్యము డిందువడె ననియుఁ, జెలికత్తియల
యెదుటఁ జిన్నతనమాయెననియు సిగ్గునందినది. ఇది తెలిసికొని
తండ్రి, వేగదీర్ఘీకృతాంగుఁడై తనయను సదనమునకుఁ జేర్చెను.

పార్వతి సిగ్గుపడెను. ఎందువలన ? శివుఁడు తన్నవమా
నించెననికాదు. తనసౌందర్యముచే శివుని స్వాధీన మొనరించు
కొనఁదలంచినది. అదివ్యర్థమయ్యెను. ఎట్టులైనను శివుని బరి
గ్రహించితీఱవలెనని యామె యభినివేశ మూనెను. దురభినివే
శము దూరమునం దుంచఁదగినదేకాని సదభినివేశము సర్వ
జనసంసేవ్యమే. దుష్కరకార్యము సాధించుట కభినివేశ
మావశ్యకము. శివుని బరిగ్రహించుట యిప్పుడు దుష్కర
కార్యము. స్త్రీసన్నిధానము తపస్సున కంతరాయ మని తలఁచి
యేదో నిర్జనస్థలమున కాతఁడు లేచిపోయినాఁడు. అతని వశ
మొనర్చుకొనుట యెట్లు ? అట్టి దుష్కరకార్యమును సాధిం
చుటకుఁ దపశ్చరణ మొక్కటే శరణ్యము. "యద్దుష్కరం
యద్దురాపం, యద్దుర్గం, యచ్చదుస్తరం, తత్సర్వం తపసా
ప్రాప్యం, తపో హి దురతిక్రమమ్",* అనికదా పెద్దలన్నారు.

* ఏదిచేయుటకు శక్యముకానిదో; ఏదిపొంద శక్యముకానిదో;
ఏది తరించుటకు శక్యముకానిదో, అది యంతయు తపస్సుచే పొందనగును,
తపస్సుమాత్రము దురతిక్రమమైనది.

కవియు "అవాప్యతే వా కథ మన్యథా ద్వయం తథా విధం ప్రేమ పతిశ్చ తాదృశః"♦ అని తపఃప్రభావము నుగ్గడించినాఁడు. కావునఁ బార్వతి తపస్సుచేయ సంకల్పించెను. ఆమె హృదయము వజ్రసదృశము. ఆమె శరీర మెంత మృదువో యామెహృదయ మంత కఠినము. ‡ "వజ్రా దపి కఠోరాణి, మృదూని కుసుమా దపి, లోకోత్తరాణాం చేతాంసి కోహి విజ్ఞాతు మర్హతి"

పార్వతి తన హృదయమును దల్లి కెఱింగించెను. వలదని యామె యెంతయో వారించెను. ఈప్సితార్థస్థిరనిశ్చయమైన మనస్సును, బల్లమునకుఁ బాఱునీటిని నెవఁడాపఁగలఁడు? మమకారముచే వారించు తల్లిమాట యామె పాటించలేదు. సఖీముఖమునఁ దన నిశ్చయమును దండ్రి కెఱింగించి యనుజ్ఞ కోరఁగా నతఁ డామె యభినివేశమునకు మెచ్చి యనుజ్ఞ నొసంగెను.

ఒక యుత్తుంగశృంగమునఁ బార్వతి తన తపోవనమును నిర్మించుకొన్నది. ముత్యాలహారములఁ దీసి రుద్రాక్షమాలికలను బూనెను. మెత్తని పట్టువస్త్రముల మాని కఱకువల్కలములఁ గట్టుకొనెను. కందుకకేళి వదలి యామె హస్తములు కుశాంకురాదానపరిక్షతము లయ్యెను. కేశములు జడలు కట్టెను. కటికనేలఁ బరుండెను. పుత్రవాత్సల్యముతో వృక్షకము

---

♦ ఆవిధమగు ప్రేమ, అటువంటిపతి - అను నీరెండు నన్యరీతి నెట్లు పొందఁబడును ?

‡ ప్రపంచాతీతులగు వారి మనస్సులు వజ్రముకన్నను కఠినములు. పుష్పముకన్నను మృదులము. వానిని తెలిసికొనుట కెవ్వఁడర్హుఁడబ్బా!

లకుఁ బయస్సు లొసంగెను. ఇట్లు ప్రకృతితో నభిన్నత్వ మందెను. ఇప్పు డామె కాంక్షించుచున్నది పురుషునితో నభిన్నత్వము. పార్వతి యనన్య తపోదీక్షాపరతంత్రత ధర్మ వృద్ధులగు యతీశ్వరులను గూడ దిదృక్షారతులఁ గావించెను.

పార్వతి కీతపశ్చర్య పరితృప్తి నొసఁగలేదు. శరీరమార్దవ మును బరిగణనసేయక కఠోరనియమములఁ బాలింపఁదలంచెను. గ్రీష్మమునఁ బంచాగ్ని మధ్యముననుండి శుచిస్మితయై జప మొనర్చెను. వర్షాసమయమున నారుబయట జోరునఁ గొట్టు వాన గాలి కగ్గమై కటికఱాలపైఁ బరుండినది. హేమంతమునఁ గుత్తుకబంటినీటిలో నొంటియై నిలిచినది. పర్ణవృత్తిత్వము తపస్సునకుఁ బరాకాష్ఠ. పార్వతి దానినిగూడఁ బరిత్యజించి యపర్ణ యయ్యెను. మృణాళికా పేలవమైన శరీరముతో దృఢకాయులైన తాపసుల తపస్సులనుగూడఁ నిస్సార మొనర్చెను. ఆమె కిప్పుడు యౌవనమత్తత యంతరించెను. హావభావలీలాచాపల్యము రూపుమాసెను. రజస్తమము లడు గంటి సత్వ ముద్రిక్త మయ్యెను. ఆమె సత్వోద్రేకము చే నాశ్రమమునందలి విరోధిసత్వములుగూడ మైత్రి పాటించు చుండెను. ఉమాదేవి తపోమహిమ నలుదిశల నలముకొనెను. పరమశివునకుఁగూడ మెచ్చు వచ్చెను. ఆతని కిప్పుడు సతి స్మృతిపథమున నిల్చెను. తనకుఁ దోడునీడగానున్న సతి యీనాఁ డట్లయినది. కావున నీమె నగ్నిపరీక్ష గావించికాని పరిగ్రహింపరాదని తలంచెను.

ఇంతదనుకఁ గవి ప్రత్యక్షపద్ధతిలోనే పార్వతి పాత్రను బోషించెను. ఇఁకఁ బరోక్షపద్ధతిచే నత్యంత రమణీయమగు

ధ్వనిమార్గమునఁ బార్వతి కులగౌరవాధిక్యములను, మహా దేవునికై యామె పొందిన మనోవేదనలను, నామె కఠోర నియమపాలనమును దెలియఁజేసెను. ఈ ఘట్టము కవికుల సార్వభౌముని నాటకీయ ప్రతిభకు నాందీప్రస్తావన మననగును. ఇందలి ప్రతిశబ్దము, ప్రతి సమాసము, కవి యంతరంగమున మథింపఁబడి చక్కని చిక్కని యమృతరసము నొలుకుచున్నది. ఇందు శబ్దమునకుఁ గల వాచకవ్యంజకశక్తి చరితార్థమైనది. వ్యాజస్తుతి, వక్రోక్తు లిందు సార్థకములైనవి. ఔచిత్యపోషణ మున కీ ఘట్టము నికషోపలము.

ఉమాదేవి యిప్పుడు సమదర్శనముగల పండితురాలు. ఆమెకడకు 'అజినాషాఢధరుఁడు' 'ప్రగల్భవాగ్విలాసుఁడు' రూపుఁగొన్న బ్రహ్మచర్యమా! యనిపించునట్లు శివుఁడు వటు రూపమునఁ బ్రత్యక్షమయ్యెను. వచ్చినవటువు పార్వతి యొసఁగిన సపర్యల స్వీకరించి యించుక విశ్రమించినట్లు నటించి యామెతో సంభాషణమునకుఁ గడంగెను. ముందు కుశలప్రశ్నల నొన రించెను. పిమ్మట నామె తపోమహిమ నుగ్గడించెను. ఇట్లామె నభిముఖురాలిఁ గావించి మెల్లఁగా నామె యొనరించు నుగ్ర తపములకుఁ గారణ మడిగెను. ఆమె బదులుచెప్పుటకు సిగ్గుపడి చెంతనున్న తన చెలికత్తెకుఁ జెప్పుమని సన్నయొనర్చెను. చెలి కత్తెయు నామె పరమశివుని బతిగా నభిలషించుచున్న దనియుఁ, దద్విరహవ్యథచే వాడినత్తలైనదనియు, నాతని బడయుట కుపాయాంతరము గానక తపమ్మునకుఁ గడంగె ననియు, నామె తన యాశ్రమములో నాటిన చెట్లు ఫలవంతములైనవి; కాని యామె మనోరథము మాత్రము ఫలవంతము కాలేదనియుఁ

జెప్పెను. ఆ మాటలు విని వటువు చాల సంతసించియుఁ బైకి పొంగక పార్వతివైపు మఱలి "యామె చెప్పినమాట నిజమా? పరిహాసమా?" యని తన భావివిమర్శకు బీజావాప మొనర్చెను. పార్వతియు సిగ్గువై పలుకలేక మితముగా "నయ్యా! ఆమె చెప్పినది నిజమే. నేను సర్వోచ్చస్థానము నభిలషించితిని. దాని కొఱకే యీ తపస్సు. కోరికలకుఁ గోరలేనిది లేదుకదా" యని పలికెను.

అంత వటు విట్లు పలికెను— "తపోధనురాలా! నేను మహేశ్వరుని బాగుగా నెఱుఁగుదును. అంత యమంగళాభ్యాస రతుని జూడఁబోము. ఆతని వరించి యపకర్షకు, నవమానమునకు, నవహేలనమునకు, ననుచితత్వమునకుఁ దావలమైతివి. అతని రూపోత్కర్షత విరూపాక్షత్వము నిరూపించును. ఆతని భాగ్యము దిగంబరత్వముచే వెల్లడియగుచున్నది. అతని జన్మ వృత్తాంత మెవ్వారికిని దెలియదు. కావున వరునియందుఁ గోరఁదగు గుణ మొక్కటియు నాతనియందుఁ గానరాదు". ఇట్లు పార్వతిమనస్సు పరీక్షింపఁదలఁచి వటుఁడు శివదూషణ మాచరించెను. చాపల్యసర్పము నాహరించుటకీ దూషణము కిరాతగానము. పార్వతి హృదయమునందలి చాపల్యపంకమును దపఃకతక మిదివఱకే హరించినది. శివదూషణ మామెకు దుస్సహమయ్యెను.

ఆనాఁడు శివదూషణమును దన జనకుని ముఖతః విని నపుడే సహింపలేక దేహపరిత్యాగముఁ గావించిన సతీదేవియగు పార్వతి, యపరిచితుఁ డగు నీ యువకుని నిందోక్తుల నాలింపఁ గలదా ? ఆ యప్రియాలాపముల కామె యధర మదరఁ

జొచ్చెను. నేత్రాంచలములు కెంపువహించెను. సుభ్రువు భ్రుకుటి వికటమయ్యెను. * "అలోక సామాన్య మచింత్య హేతుకం, ద్విషన్తి మందాశ్చరితం మహాత్మనామ్" "మూఢులు అలోక సామాన్యమైన మహాత్ముల చరితమందలి యాథార్థ్యము నెఱుఁగఁ జాలక వారలను నిందసేయుచుందురు" అని ప్రపంచ మందలి యీ రీతి వారి నందఱిని శాశ్వతముగ మందలించిన దాతపస్వి. బ్రహ్మచారినిందోక్తుల నన్నియుఁ దననిశితోక్తులతో నిరాఘాటముగ ఖండించినది. లోకాతీత మహిమాస్పదునకు, సంపద లెట్టివో! భూషణము లెట్టివో! వాహనము లెట్టివో గ్రహించుటకుఁగూడఁ గొంతసంస్కార ముండవలయును. శివుఁ డమంగళాభ్యాసరతుఁడఁట!! విపత్ప్రతీకార పరులకు, భూతి సముత్సుకులకు మంగళా మంగళ విచారణము; కాని సకల జగచ్ఛరణ్యుఁడు, నిరాశిషుఁడు, ఆశోపహతాత్మవృత్తియునైన శివున కీ నింద చెల్లదు. దిగంబరుఁడయ్యు సంపత్ప్రభవుఁడు, శ్మశానవాసి యయ్యును త్రిలోకనాథుఁడు, భీమరూపుఁడయ్యు శివుఁ డగు నాతని యాథార్థ్య మెవ్వరెఱుఁగుదురు? విభూష ణోద్భాసి కానిమ్ము; సర్పధారి కానిమ్ము; గజాజినాలంబి కానిమ్ము; దుకూలధారి కానిమ్ము; కపాలధారి కానిమ్ము; ఇందుశేఖరుఁడు కానిమ్ము; విశ్వమూర్తి శరీర మిట్టిదని యెవ్వఁడు చెప్పఁగలఁడు? నృత్యాంతమున నాతని యొడలినుండి రాలిన చితాభస్మమునకై దేవతలు తోత్రోపులాడుదురు. ఇట్లాతపస్విని యనన్య శివభక్తి ప్రపత్తిని ప్రదర్శించినది.

* లోకాతీతమై కారణము లూహింపరానట్టి మహాత్ముల చరిత్రమును మందులు నిందించుచుందురు.

♦"విచిత్రరూపాః ఖలుచిత్తవృత్తయః" అన్నట్లు ఎవరివిశ్వాసము వారిది. తన విశ్వాసమునకు భిన్నమని మరియొకరి విశ్వాసమును మార్చుకొనుమనుట సందర్భముగాదని తలంచిగాని, * "మూర్ఖం ఛందాను గోధేన" న్యాయమును దలంచిగాని "చాలు వివాదములు!! నీవు విన్నట్లే యగుగాక!! శివభావైకరసపరిప్లావితమైన నా మనస్సు అతనియందే స్థిరమైనది. ప్రేమప్రకోపితమగు చర్యలు నిషేధమును గణింపవు" అని పలికెను. ఏమి యీ రాచకీవితో గూడిన హెచ్చరిక. ఈ హెచ్చరిక యొక్క బ్రహ్మచారికే కాదు. భగవద్విశ్వాసమునుగూర్చి నిందించు వారి కందఱకు ననువర్తించునది. భగవద్విశ్వాసము అనుభవైకవేద్యము. వాద ప్రతివాదములతోను, తర్క-వితర్కములతోడను గుదురునది కాదు. పార్వతి భగవద్భక్తి సామ్రాజ్యమున కధిరాజ్ఞియైనది. ఆమె విశ్వాస మమోఘమైనది. అచంచలమైనది. ఎట్టి వాద ప్రతివాదము లామె నా స్థానమునుండి చలింపఁజేయవు.

వటుఁడింకేమియో మాటలాడ యత్నించినట్లు దేవి గుర్తించినది. ఆతని యధర మొకింత చలించినది. ఇతఃపూర్వమే వ్యర్థమగు వాదమున కవకాశము కల్గించి, తన మనోనాథుని నిందింపగా నాలింప వలసివచ్చినందులకే యామె పశ్చాత్తప్తయైనది. మరల నట్టియవకాశమీయరాదని నిశ్చయించుకొని "ఓచెలీ ! స్ఫురితోత్తరాధరుఁడై యీ వటువు మరల మాటలాడ నుంకించుచున్నాఁడు. ఇతనిని వారింపుము !!

---

♦ చిత్తవృత్తులు చిత్రవిచిత్రములు కదా !

* మూర్ఖుని వాని భావము ననుసరించి వశపఱుచుకొనవలయును.

మహాత్ములను నిందించువారికే కాదు ! వారి నిందావాక్యములనాలించు వారికి కూడ మహాపాతక మంటుకొను" నని పల్కియు తన మాటను విమర్శించుకొని రాజసమును వారించి సత్యస్ఫూర్తి నెగడునట్లు తానె యచ్చోటు వీడ ముందు కడుగిడినది. ఈమాటలకు ప్రచ్ఛన్న రూపమునందున్న పరమశివుఁడు పరితోషమందినాఁడు. ఇంకను నామెను పరీక్షించుట కా దయాళుని హృదయ మంగీకరించలేదు. భక్తుల నంత కఠినముగఁ బరీక్షించుస్వభావ మాతనిదికాదు. పార్వతి యాకాంక్షించిన పదవి మహోన్నతమైనది. అందుచేతనే అంత మాత్రముగ నైనఁ గావింపవలసి వచ్చినది. సంతుష్టహృదయుఁడైన పరమేశ్వరుఁడు, వృషకేతనుఁడై, స్వస్వరూపమునంది, స్మితాననముతో పార్వతి పాణిగ్రహణము గావించెను. శైలాధిరాజతనయ సరసాంగయష్టి చలించినది. ఎత్తినపాద మెత్తినట్లే యుండి యెటుపైపునను మోపఁజాలక నిలఁబడి పోయినది. అచట నిలువజాలక సిగ్గు పడినది. ఈ స్థితినంతయు *"మార్గాచల వ్యతికరాకులి తేవ సింధుః" అని చిత్రించుట కాళిదాసు కవితా శిల్పము ననల్పముగా వ్యక్తము చేయుచున్నది.

అచలముచే నడ్డగింపఁబడిన మహాప్రవాహమువలె నున్న దామె. ఇట్టి యవస్థయందున్న నా ముగ్ధతో పరమేశ్వరుఁడు ముద్దుముద్దుగా నిట్లు ముచ్చటించెను. "ఓ యవనతాంగీ! నీ తపస్సుచే నీకు నే నమ్ముడు పోయితిని. నేఁటినుండి నేను నీ దాసుఁడను." పార్వతి తపస్సు ఫలించినది. తక్షణమే కఠోర

* మార్గమందలి పర్వతాటంకముచే కల్లోలితమైన ప్రవాహమువలె.

నియమసంజనిత క్లేశమంతయు నామె కొక దృశ్యమైనది.
♦ "క్లేశః ఫలేన హి పునర్నవతాం విధత్తే"

పరమేశ్వరుఁ డింత హృదయంగమముగా మాటలాడి నను గౌరి యొక్కమాటైన బదులాడలేదు. తన సఖిచే విశ్వాత్మకుఁ డగు శివున కిట్లు సందేశ మంపినది. "భూభృన్నాథుఁడే నన్ను దానము చేయగలవాఁడుగా నంగీకరించునది".

కాళిదాస మహాకవి ఈ సందర్భమున భారతీయ ప్రణయ రహస్యమును కాంతాసమ్మితముగా నుపదేశించెను. భారత దేశమున గాంధర్వ వివాహమునకు గౌరవము తక్కువ. అందు ప్రేమోద్ధృతత్త్వము, యౌవన చాంచల్య మధికము. పార్వతి యీ స్థాయి నతిక్రమించి పరమ పవిత్రతా ప్రణయపీఠమున సుప్రతిష్ఠిత యైనది. అందుచేతనే యామె సర్వోత్కృష్టము సంసారోపేతము నగు బ్రాహ్మవివాహ విధానమునే యాశ్రయించి పరమేశ్వరున కట్టి సందేశ మంపినది.

పార్వతీ సౌందర్యము లోకాతీతము. దానిని కవి తన యసాధారణ శిల్ప సామర్థ్యముతో నుత్తమ చిత్రకారునివలె చిత్రించినాఁడు, పార్వతి యీ సమయమున నొక యుత్తమ ప్రబంధ నాయికయే యైనది. తా నట్టి సౌందర్యవతినని గిరిరాజ సుతకు గూడఁ దెలియును. యౌవన మీ యహంకారమునకుఁ గరావలంబన మొసంగినది. ఈ స్థితిలో నామె శివుని వశీకృతుని గావించుకొనుటకై శుశ్రూష యొనర్చినది. ఈమెకు మన్మ

♦ ఫలసిద్ధిచేత క్లేశము తిరిగి నూతనత్వమును సమకూర్చునుగదా!

ఘుఁడు, మన్మథుఁ డీమెకు, నిరువురకు మాధవుడు సాయపడి విఫలురైనారు. భౌతికశక్తి ఆత్మశక్తి నెప్పటికిని జయింపలేదను నాధ్యాత్మిక రహస్యమిందు కావ్య మార్గమునఁ బ్రబోధింపఁ బడినది.

అహంకారము రజోగుణలక్షణము. రజోగుణ మడంగినఁ గాని సత్త్వోద్రేకమున కవకాశములేదు. సత్త్వోద్రేకమునఁగాని శివవశీకరణము సాధ్యముకాదు. ఈ విధముగా నామెకు సాధన సంశుద్ధి లేదు. ముందుగా శారీరక సౌందర్యాహంకార మణఁగ వలయును. అప్పు డామె యందలి రజోగుణ మడంగును. పిమ్మట తప మొనరించినచో సత్త్వ ముద్రేకించును. నైష్ఠిక సౌందర్య జ్యోతి వెలుఁగొందును. అప్పు డామె తనకుఁ బరిగ్రహణయోగ్య యగునని యెంచి యౌవనాహంకార కారకుఁ డగు మన్మథుని భస్మమొనర్చి, శివుఁ డంతర్హితుఁ డయ్యెను.

మన్మథ నిర్మథనముతోఁ బార్వతి యౌవనాహంకార మంతరించెను. శివుఁ డరూపహార్యుఁ డనియు, అతనిని సాధించుటకుఁ దన సుందర శరీర సంపద నిరర్థక మనియు సమర్థించుకొన్నది. దుర్లభుఁడైన శివుని సమాగమమునకు మార్గాంతరము గానక తపోదీక్ష వహించినది. ముందు సర్వసమత్వము నలవఱచు కొన్నది. వృక్షలతాదులందు, కురంగ శాబకములందు వాత్సల్యము నెఱపినది. శీతోష్ణాది ద్వంద్వములందు సమభావమును సాధించినది. ఈ విధముగా పార్వతి ప్రకృతితో నభేదము నొందినది. ఇఁకఁ బురుషునితో నొందవలసి యున్నది. నిరాహారాభిముఖ[illegible] ననన్య చిత్తముతో నాతనిఁ బర్యుపాసించినది. పరమేశ్వరు నాకర్షించినది. ఆతని అగ్నిపరీక్షలో

నెగ్గి కై వశము గావించుకొన్నది. శారీరకముగా గూడ నద్వైత సిద్ధినంది లోకారాధ్య యైనది.

ఈ విషయమున రతికిఁ బార్వతికిని విశేషాంతరము గలదు. సౌందర్యము తప్ప నిరువురకు నెందును సామ్యము లేదు. పార్వతికిఁ గల గుణౌన్నత్యముగాని యాత్మార్పణము గాని రతికిఁ గానరావు. సౌందర్యాభిమాని యగు కాముఁ డామెకు భర్తయయ్యెను. అతనితోఁ గలిసి యిష్టసుఖముల సొలయుటచేఁ గృతకృత్యురాలైన ట్లామె భావించెను. మన్మథుఁ డవివేకి. ఎదిరిని తన్నుం దెలియు వివేక మాతనికి లేదు. శివునిపైఁ జెలరేఁగి రూపుమాసెను. కన్నుమూసి కన్ను దెఱచునంతలో నింతపని జరిగెను. రతీదేవి దుర్భరమైన దుఃఖములో మునిఁగి పోయెను. సుఖముననైనను దుఃఖముననైనను నామెను బట్ట శక్యముగాదు. ఆమె భోగవినాశమును గూర్చియే విలపించెను గాని యాత్మార్పణ మొనర్చుకొనిన ప్రణయ నాశనమునుగూర్చి కాదు. దుఃఖసమయమున ధైర్యమన నెట్టిదో యెఱుఁగని దుర్బలహృదయ యామె. భర్త జీవితమునుగూర్చి తాను నిరాశురాలైనప్పుడు ప్రాణపరిత్యాగము నకే సమకట్టెను. ఇది సామాన్య మానవ లక్షణము. పార్వతి యాదర్శ సతీమణి. కష్టములలో నామె ధైర్యము పురుషులకుఁ గూడ లేదు. "పార్వతి సౌందర్యము ప్రణయమునందును, ప్రణయము పరిణయమందును, పరిణయము కుమార ప్రభవము నందును సార్థకత నొందెను." శివుని వశీకృతుని గావించు కొనుటతో నామె ప్రేమ తనవి సనలేదు. అతని మెప్పించి శరీరార్ధము నాచికొన్నఁగాని కృతకృత్యత భావింపలేదు.

జగత్పితకు భార్యయై జగదుద్ధారకుఁడగు కుమారస్వామిని ప్రసాదించి జగన్మాతృ గౌరవము నందుకొన్నది. ఇందలి క్రమ పరిణామము, పాత్రోన్మీలనవిధానము, భారతీయ ప్రణయరహస్య గోపనము, భావించుకొలఁది భావింపఁజేయును. ఆనందించు కొలఁది ఆనందింపఁ జేయును.

♦ శ్లో॥ పరస్పర తపస్సంపత్ఫలాయిత పరస్పరౌ
ప్రపంచ మాతాపితరౌ ప్రాంచౌ జయాపతీ స్తుమః॥

---

# ౮

# శకున్తల!!

"నవయౌవన వర్షోదయ ప్రసూనదామమా!! వసంత కాలాంత పరిపక్వ ఫలరాజమా!! భవదీయ సౌందర్యాతిశయమున, నా హృదయము మంత్రముగ్ధమై, పరవశమై, సకలేంద్రియ సంతర్పణానుభూతిచే నమృతత్వ మందినది. స్వర్గ భూతలములు నీ యందే యనుసంధానించెను. ఓ శకున్తలా!! యనఁగనే నా హృదయ రసాధిదేవత సాక్షాత్కరించును.

* * * *

---

♦ ఒకరి తపస్సంపద కొకరు ఫలముగా నైనట్టియు; ప్రపంచమునకు మాతాపిత లైనట్టియు; నాదిమ దంపతులును నగు పార్వతీ పరమేశ్వరులను స్తుతించుచున్నాము.

ఐరోపియన్ కవీశ్వరులలో నగ్రగణ్యుఁడు "గెథే" యీ రీతిగా శాకున్తల రూపకమును గూర్చి కావ్య విమర్శనము నొక చిన్న పద్యమున నాశువుగా నఖండముగా సంగ్రహించెను. ఈ పద్యమొక కరదీపిక వంటిది. అయినను నిది సమస్త రూపకము నొక్క క్షణములోఁ బ్రకాశింపఁజేయును. దాని యాంతరస్వభావమును సుస్పష్టముగఁ బ్రదర్శించును. గెథే పేర్కొనినట్లు శాకున్తలము నవ యౌవన వసన్తోదయ ప్రసూనదామ మేకాదు; వసంత కాలాంత పరిపక్వ ఫల రాజము కూడను! స్వర్గభూతలముల నొక్కచో ననుసంధానించు దివ్య ధామము!!

ఈ ప్రశంస కేవలము కవితోల్బణము కాదు. శాకున్తలము దివ్య కవిత్వ సంభరితమని గెథే భావించి యిట్లు పరవశత్వముతో ప్రశంసించినట్లు మనము స్థూలముగా తలంపవచ్చును. కాని సూక్ష్మముగా పరిశీలించిన, ఈ పద్యము గెథే కవీశ్వరుని కాళిదాస కవితా పారవశ్యానుభూతి కొక యుత్కృష్ట మాత్రమే కాదనియు; నొక విమర్శకాగ్రేసరుని మనోజ్ఞ కవితా తత్వ నిర్ణయ మనియు తీర్మానింపవచ్చును. ఆతని యుక్తులలో మహిత సత్యము గర్భితమై యున్నది. శాకున్తలము సంపూర్ణ క్రమ పరిణామవిధానము కలదు. ప్రసూనము ఫలముగను; అచేతనము చేతనముగను; భూతలము స్వర్గముగను బరిణమించు పద్ధతి యీ రూపకమునఁ బ్రత్యక్షమని గెథే యభిమతము.

నిజమున కీ రూపకమునం దనేకానుసంధానములు కలవు. ఇందొక క్రమాభివృద్ధి కలదు. ప్రథమాంకమున, భౌతిక సౌందర్యము, అంతిమాంకమున దివ్యాశ్రమ నైష్ఠిక సౌందర్య

మీా రూపకమున ననుసంధానిత మైనవి. ఒక ప్రత్యేక భావో ద్రేకమును బ్రేరేచి పరిపోషించుట కీ రూపక ముద్దేశింపఁబడ లేదు. ఒక ప్రత్యేకపాత్ర క్రమోన్మీలనమును బ్రదర్శించుటకు మాత్రమే యిది రచింపఁబడినదికాదు. మొత్తము కథా విషయమునే యొక లోకమునుండి మఱియొక లోకమునకుఁ దరలించుట యిందలి యుద్దిష్టనిర్దిష్టలక్ష్యము. భౌతిక సౌందర్య పరిమితమైన ప్రేమను, నైష్ఠిక దివ్యప్రణయావధుల కుద్గమింపఁ జేయుటే కవీశ్వరుని పవిత్ర ప్రయత్నము.

కాళిదాసు స్వర్గభూతలముల నలవోకగా ననుసంధా నించెను. భూతలము స్వర్గముగా పరిణమించు టతిసహజముగా జరుగును. అప్పుడు దాని సరిహద్దు రేఖలను గూడ గుర్తించుట సాధ్యముపడదు. ప్రథమాంకమున శకున్తలా భౌతిక పతన మును కవి సుస్పష్టముగఁ జూపించెను. నాయికా నాయకుల యందుగల కామవాంఛ యీా సందర్భమున నెంత గాఢముగఁ బనిచేసెనో కూడ నాతఁడు నిరూపించెను. ఆ యావన మత్తత యట్టిది. అది సిగ్గుదొంతరలమధ్య తొణికిసలాడుచు, పొగడ్త లుగా, నుద్వేగోత్సాహములుగా పొంగిపొరలినది. శకున్తల నిరాడంబరత్వమున కిది యొక నిదర్శనము. ఇతఃపూర్వ మీామెకు భావోద్రిక్తత యన నెట్టిదో తెలియదు. దుష్యంతుని యాగమనముచే, నీమె కిట్టి యుద్రేకము కల్గినది. ఇప్పుడు పొంగిపొరలెడి యుద్రిక్తత నెట్లు సంయమించు కొనవలయునో తన మనోభావముల నెట్లు మఱుఁగుపఱుచుకొన వలయునో శకున్తలకు బోధపడలేదు. ఇంతకుముందామెకు మన్మథ తాప మన నెట్టిదో తెలియదు. అందుచే నామెకు రక్షణమవస

రము లేకపోయెను. తనలోని ప్రేమభావమునందుగాని, తన్ను ప్రేమించిన ప్రియుని ప్రవర్తన మందుగాని యామె కెట్టి యప్రత్యయమును లేదు. ఆశ్రమశాబక మెట్లు నిర్భీకయో ! అట్లే యాశ్రమ కన్యయు నిర్భీక ! !

దుష్యంతుఁడు శకున్తలాహృదయమును చూఱగొనుట యతిసహజముగ చిత్రింపఁబడెను. శకున్తల యమలిన ప్రవర్తనను, నిసర్గ మనోహర ప్రవిమల కన్యాభావ సౌందర్యమును సిద్ధహస్తుఁడగు కవీశ్వరుఁడు స్వాభావసిద్ధముగ పరిపోషించినాఁడు. పర్యవసానమున శకున్తలా ప్రవర్తనము పతనమూయనేయని, తరువాత గోచరించిన గోచరింపవచ్చును. అది వేఱువిషయము.

అడవిలోని కుసుమ దళములపైగల దుమ్మును శుభ్రపఱుచుట కెట్టి పరిచారకుడును పనిలేదు. శకున్తల యట్టి కుసుమము. ఆమెపై దుమ్ము రాలినది. అయినను నామె సౌందర్యము చెక్కుచెదరదు. తనశరీరము ధూసరితమైన ట్లామె గుర్తింపదు. ఆటవిక కురంగమురీతిగా; పర్వత శిఖరోద్గత ప్రవాహమట్లీ శకున్తల యెట్టి యమలిన భావ వికారములును నెఱుఁగని ముగ్ధ.

ఆశ్రమ పరిపోషిత యౌవనోద్భాసితయగు కాళిదాసుని రూపకనాయిక, శంకారహిత స్వభావ. ఆమె నెప్వుడును గవి యదుపులోనుంచుటకు యత్నింపలేదు. అయినను కాళిదాసీమె నొక భక్తి భరితయగు నాదర్శ ధర్మపత్నిగను, సంయత శీలగను; కష్ట సహిష్ణువుగను; నిష్ఠురాధ్యాత్మిక క్రమశిక్షణా వశమగు జీవితముగల దానినిగను, గావించెను. ఆరంభమునందామె తన్నుఁదామఱచుచు; స్వభావోద్రేకములకు విధేయ

యైనది. అంతమునందామె హృదయము – ఉన్మత్తరహితమై, నిష్ఠురకష్టసమయముల యందును ప్రశాంతమధురమై, పవిత్ర ధార్మిక నియమ వ్రతపాలనముతో, నిష్కాగరిష్ఠముగా ప్రత్యక్షమాను. నాన్యతోదర్శనీయమగు కళా విదగ్ధతతో, కాళిదాసు తన నాయికను కర్మాకర్మములకు; ప్రకృతి – వికృతులకు; సాగరవాహినులకు; సంగమస్థానము కావించెను. శకున్తలా జనకుఁడు – తపస్వి; జనయిత్రి – దేవతా వారకాంతయగు నొక యప్సరస. నిరంతర తపోనియమభంగముచే నీ తపస్వికి శకున్తల జనించినది. కాని స్వేచ్ఛాయుతమగు ప్రకృతియు – కఠిన నియమవ్రతపాలనమును నే యాశ్రమమందు కేంద్రీకృతమాయెనో! యెందు సౌందర్యోత్కర్ష – జీవిత సంయమనము; సరసముగా సమ్మిళితమాయెనో!! యట్టి పవిత్ర వనవాటికలో నామె ప్రవర్ధమానయైనది. అచట సాంఘిక నియమము లేవియును లేవు. కాని యంతకన్న కఠోరమగు మత వ్రతాచారములు కలవు. శకున్తలాదుష్యంతుల గాంధర్వ వివాహము కూడ నిట్టిదే. అందు ప్రకృతిలోని యాటవికత్వముతోపాటు, వివాహ మను సాంఘిక నియమబంధముకూడ కలదు. స్వేచ్ఛయందు మధురమగు సంయమనమును జక్కఁగాఁ బరిపోషించును గావుననే యీ రూపకము ప్రపంచ వాఙ్మయాంబరమున నద్వితీయ ధ్రువతారవలె వెలుఁగొందుచున్నది. ఇందలి సుఖదుఃఖములు; సంయోగ వియోగములు; ద్వివిధములగు నీ శకున్తలా వైరుధ్యమునుండి యుద్బుద్ధమైనవే!!

శకున్తల సహజ నిరాడంబరశీల. కాని షేక్స్పియర్ ‘టెంపెస్టు’ 62 (తుపాను) రూపకమందలి ‘మిరండా’ యిట్టి

సహజ నిరాడంబర శీలకాదు. ఇందులకుఁ గారణము వీ రిరువ్వు రును బెరిగిన వాతావరణములు విభిన్నమైనవి. శకున్తల నిరాడంబరత్వముకన్న 'మిరండా' నిరాడంబరత్వము కృతకము, తాంత్రికమునైనది. ప్రథమాంకమందు శకున్తల చెలు లిరువురు, నామెలో నవయౌవన వసంత మావిర్భవించెనని హెచ్చరింతురు. ఆమెలో క్రీడావిలాసములు తొణికిసలాడుచున్నవి. ప్రపంచమునుగూర్చియు నామెకుఁ గొంత పరిచయముగలదు. ఏలయన నీ వనవాటిక, కేవలము సంఘబాహిరమైనది కాదు. ఇందును గృహమేధి జీవితనియమము లాచరణీయములే. శకున్తల ప్రాపంచిక వివేకశూన్యకాదుగాని యందు విశేషానుభవము మాత్ర మామెకులేదు. కాని యొక్క విశ్వాసభావ మామె హృదయపీఠిక నధిష్ఠించెను. ఏతద్విశ్వాస జనిత నిష్కపట ప్రవర్తనమే యామె పతనమునకుఁ గారణభూతము. అయినను తిరిగి యామెను శాశ్వతముగా నుద్ధరించినదికూడ నీ నిష్కాపట్యమే. ఈ ప్రత్యయమే శకున్తలా సహాన సద్భావములకు శక్తిని ప్రసాదించినటి. ఈ ప్రత్యయమే యామె క్షమా ప్రవర్తనమునకు, ప్రేమయుత దాక్షిణ్యమునకు – మధ్యలో నెంత యవరోధము కలిగినను – జీవము వోసినది. మిరండా జీవితమున నిట్టి విషాదసంఘటనలే లేవు. ప్రపంచపరిజ్ఞానముతో నామెకు సంబంధముగాని వైరుధ్యము గాని లేనేలేదు.

ఇక్కడ నట్లు కాదు. మనలోని విప్లవోజ్జ్వల భావోద్రేకములు తుపానువలె చెలరేఁగును. లావాతోఁబోల్పఁదగిన తీవ్ర మనోవేదనమును గాళిదాసు, పశ్చాత్తప్త హృదయ

వినిర్గత బాష్పధారలచే చల్లార్చినాఁడు. కాని కవి యీ మనోవ్యధను విశేషముగఁ జిత్రింపలేదు. తద్భావ సౌదామినిని మన మనోవీధిని మెఱపించి, యవనికను వ్రాల్చినాఁడు. వాస్తవిక జీవితమునందు, బహుభార్యాసక్తుఁడగు దుష్యంతుఁడు, తన నవనవాభిరుచులను బట్టి శకున్తలను విస్మరించుటలో నెబ్బరికములేదు. దుర్వాసః శాపము కారణభూతముగ నిరూపింపఁబడినది. లేకున్నచో శకున్తలా నిష్కాసనము మిక్కిలి క్రూరమై, హృదయ విదారకమై, రూపక సమైక్యస్థాయినే రూపఱఁజేసెడిది. కవి పంచమాంకమున తెరచాటు నుండి పల్కించిన కొన్ని పల్కులు రాజకృత్యములోని పాపములను మనకు ధ్వనింపఁజేయును. శకున్తల రాజమందిరమున బ్రవేశించుట కించుక పూర్వము, రాణి యగు హంసపదిక, సంగీతశాలలోఁ దనకుఁ దానై యిట్లు పాడుకొనును.

ద్వి॥ క్రొత్త పూఁదేనియఁ గ్రోలంగ నీవు
చిత్తంబు ననుగోరి స్వేచ్ఛగా నపుడు
క్రొమ్మావి విరిదేనెఁ గోర్కి తీఱంగ
నమ్మాడ్కి హాయిగా ననుభవించియును
నిపు డీవు మధుపమా! యింతలో నిచట
నపురూపమైన యీ యబ్జసద్మ
మరగి సుఖించెడి మాత్రాన నెట్లు
మఱవఁ గల్గితి తొంటిమావి మంజరిని? (కం. వీ.)

శకున్తలా దుష్యంతుల మధుర ప్రేమచే సుస్నిగ్ధమైన మన హృదయముల కీ హంసపదికా శిథిల హృదయ విషాద సంజనిత గాద్గదిక గీతాలాప మత్యంత వ్యాకులత్వమును

గల్గించును. గతాంకమునందే శకున్తల, పూజనీయుఁడు, పలిత
కేశుఁడు నైన కణ్వమహర్షి మహితాశీర్వచనముల స్వీకరించి,
సమస్త వనవాటీ భవ్యసద్భావ సముపలాలితయునై, యెట్టి
పవిత్ర ప్రశాంత మధుర వాతావరణమును, హృదయ భార
ముతో వీడ్కొనినది గమనించి రసపరవశుల మైతిమి. మనము
కొండంతగా నాశించిన శకున్తలా ప్రేమ సౌధ మింతలోనే
బీటలు వాఱినది.

హంసపదికా గీతార్థ మేమి? యని విదూషకుఁడు రాజును
ప్రశ్నించును. దుష్యంతుఁడు చిఱునవ్వునవ్వి, "ఈమె యొకప్పుడు
నాచేతఁ బ్రేమింపఁబడినది. అందుచే వసుమతీదేవి విషయమై
యీమె నన్ను నిందించుచున్నదను కొందును. మిత్రుఁడా!
మాఢవ్యా! నన్ను నిపుణముగ నెత్తిపొడిచితివని హంస
పదికతో నామాటలుగాఁ జెప్పుము." అనును. రాజప్రేమలోని
క్షణిక స్వభావము నిట్లీ పంచమాంకారంభమునఁ గవి
సూచించుటలో నెంతో ప్రయోజనము కలదు. దుర్వాసుని
శాపము కృతకమైనది కాదనియు మానవస్వభావ నిహితమైన
విషబీజము నదిఖండించుట కేర్పడినదని యద్భుత కళానైపుణ్య
ముతో కవి మనకుఁ జెప్పకయే చెప్పినాఁడు.

చతుర్థాంకము నుండి పంచమాంకమునకు వచ్చునప్పటి
కొక నూత్న వాతావరణములోనికిఁ బ్రవేశింతుము. ఆదర్శ
పవిత్రాశ్రమ వాతావరణము నుండి, కఠినహృదయపరిపాక
కపటప్రేమావృత రాజసభా ప్రాంగణమునకు మన మనుగ
మింతుము. ఆ సుందర వనవాటికా జగత్తు విచ్ఛిన్నము
కాఁబోవుచున్నట్లుండును. శకుంతల వెంట నేతెంచిన ముని

కుమారు లిరువురును, తా మొక విపరీత ప్రపంచమునఁ బ్రవే శించినట్లు భావింతురు. శార్ఙ్గరవుఁడు "పలుజనులున్న యీ గృహము వహ్నిపరీత గృహమట్లు తలంతు" ననును. ఈరీతిగా ధ్వని మార్గమున కవీశ్వరుఁడు పతితలను శకున్తలా తిరస్కార సంఘర్షణమునకు సంసిద్ధ మొనర్చును.

శకున్తలా బహిష్కారము రానే వచ్చినది. శకున్తలకుఁ దలపై బిడుగుపడి నట్లైనది. చేరదీసి, ప్రేమించి, లాలించిన మృదులహస్తము చేతనే కఠినముగా దెబ్బతిన్న లేడిపిల్లవలె, నీ వనకుమారి భయవిషాద విహ్వలాకుల చిత్తయై, రిక్త చూపులుచూచును. చిరకాలమునుండి యున్న యాశ్రమము నుండి శకున్తల విసిరి వేయఁబడిన దనుమాట సత్యమైనది. తన సఖులను, మృగశాబకములను, లతావిహంగములను నొక్క మాఱుగా విసర్జించినది. ప్రశాంత మాధురీ సౌందర్య విలసిత మైన పూర్వజీవితమున కామె స్వస్తిఁజెప్పినది. ఇప్పుడు నిలువ నీడలేక, యొంటరిదై నిలుపలేక నిలువఁబడి యున్నది. ఒక్క క్షణములో నాల్గంకములలోని యసాధారాణ సంగీత మాధుర్యము మాటుమణఁగినది.

పాప మా శకున్తలను గంభీర మౌనముద్రాంకితమైన యేకాంతత్వ మావరించినది. తన మృదులహృదయ సంపదచే, స్వర్గాతీతమగు సమస్తాశ్రమ జగత్తును, స్వకీయము నాత్మీయము గావించుకొన్న యా శకున్తల, నేఁ డసహాయయు ననదయునై యొంటరిగా నిల్చినది. ఆమె దుర్భర దురంత విషాదము భూమ్యా కాశములంతటను బరివ్యాప్తమైనది. తన యనన్య సామాన్య నిశితక్రాంత దర్శనత్వముచే, కాళిదాసు శకున్తలను దిరిగి కణ్వా

శ్రమమునకుఁ జేర్చుటకుఁ దిరస్కరించినాఁడు. దుష్యంత పరిత్యక్తయైన శకున్తల కిఁక కణ్వాశ్రమమున స్థానములేదు. ఆమె పూర్వమువలె, తత్ప్రదేశమున సామరస్యపూర్వకముగా జీవించుట సంభవముకాదు. ఆమె పూర్వపువ్యక్తి కాదు. విశ్వముతో నామెకుఁగల విహితసంబంధమిప్పుడు మార్పుఁజెందినది. అందుచే నామెను బూర్వపరిసరములం దుంచిన పూర్వసన్నివేశమంతయు ననౌచిత్యము పాలగును. శకున్తలా విషాదభారము నపనయించుటకు క్షమమగు ప్రశాంత దివ్యధామ మిప్పుడవసరము. చిరకాలసఖులను వదలి, భర్తృపరిత్యక్తయై, యేతద్వియోగ గురుభార పీడితయగు శకున్తలనీ యేకాంత ప్రశాంత నూతనాశ్రమమునందుకనబఱుచుటకు కవికి మనస్కరింప లేదు. ఈ విషయమున కవి వహించిన మౌనము, మనల నావరించిన మౌన విరామమును గాఢమొనర్చి, శకున్తల నావేశించిన గంభీర మౌన ముద్రలో విలీనమొనర్చును. ఇట్టి శకున్తల తిరిగి కణ్వాశ్రమమునే చేరినచో ఆశ్రమమంతయు గగ్గోలెత్తెడిది. ఆమె బాహ్యప్రాణములగు ననసూయా ప్రియంవదల విషాదము పట్టశక్యము కాకుండెడిది. లతాకురంగము లూరక విలపించెడివి. అపరిచితమగు మారీచ్యాశ్రమ మనంత ప్రశాంత గభీరము. అందు మన మనోనేత్రములకు బ్రత్యక్ష మయ్యెడిది, దురంత విషాద పరితప్తయు, నిరంతర తపశ్చరణ పరాయణయు, సంతతైకాంత సంసిక్తమానసయు, నగు శకున్తలా స్వరూపము !!

దుష్యంతుఁడు తన ప్రవర్తనకుఁ బశ్చాత్తప్తుఁడు, విచారగ్రస్తుఁడు నైనాఁడు. అదియే యొకవిధమగు తపస్సు.

ఈతఁడు శకుంతల నిట్టి పశ్చాత్తప్త విశుద్ధ భావముతో తిరిగి సంపాదించుటలోనే ఘనత కలదు. ఒకానొక యావనోద్రిక్త భావావేశముచే శకుంతల దుష్యంతునకు ప్రాప్తించినది. ఆ ప్రాప్తి సత్యసంప్రాప్తి కాదు. ఏకాగ్ర నిశ్చల వినిర్మల భావనచే నామెను సంపాదించుటే యుత్తమ విధానము. సులభ సంప్రాప్తమైనది సులువుగనే సురిగిపోవును. అందుచే నీ యిరువురు ప్రణయులను నిష్ఠుర తపశ్చరణ విధానమున శాశ్వత పవిత్రస్థాన సమధిగతులను గావించినాఁడు కవి. తొలుదొల్త రాజభవనమునఁ బ్రవేశించినపుడే దుష్యంతుఁడు శకుంతలను స్వీకరించినచో యంతఃపురమున మఱియొక హంసపదిక జేరి, యందొకమూల తన నీరస నిర్లక్ష్య జీవితమును నిరుపయోగముగఁ గడపెడిది. కఠిన కర్కశ హృదయముతో దుష్యంతుఁడు, శకుంతలను దిరస్కరించు టామె కపకార రూపమున జరిగిన మహోపకారమే. సత్య మావిష్కృతమైన పిమ్మట, దుష్యంతుని కాఠిన్య మాతని హృదయము నెంతో బాధించినది. ఇఁక దుష్యంతుఁడు శకుంతల పట్ల విముఖముగ వర్తింపఁ జాలఁడు. దుష్యంతుని దురంత దుఃఖతాపమునందు శకుంతల కరగిపోయినది. ఇతఃపూర్వ మీ రాజేంద్రుఁ డిట్టి సంతాపానుభవ మెఱుఁగఁడు. అప్పు డీతనికి సత్య ప్రేమానుభూతి యన నెట్టిదో తెలియదు. రాజు లీ విషయమున దురదృష్టవంతులు. వారి వాంఛ లతి సులభముగా సమకూరును. అందుచే సమాహిత చిత్తముతో సాధన గావించుట యననేమో వారికిఁ దెలియదు. విధివిలాసముచే దుష్యంతుఁడు దుఃఖాంబు

ధిలో మునిఁగి తేలినాఁడు. సత్యప్రేమకు సమర్థత సంపా దించుకొన్నాఁడు. వంచనమును బరిత్యజించినాఁడు.

ఏవంవిధముగా కాళిదాసు దుష్యంతుని హృదయము లోని యఘపంకమును క్షాళన మొనర్చెను. కవి దుష్యంతుని దౌష్ట్యమును గోపన మొనర్చుటకుఁ బ్రయత్నింపలేదు. నాట కాంతమున యవనిక వ్రాలఁగనే యగ్నిగుండమున సమిధలు దగ్ధమైనరీతిగా, సమస్తదుష్టత్వము దహింపఁబడును. వెంటనే మన యంతరంగములు శాంతి నహించును. సంతృప్తికరము లగు సత్ఫలితములను మన మనుభవింతుము. శకున్తలా దుష్యంతుల శారీరక సమ్మేళనము, సంకుచిత మార్గమును ద్రొక్కి, సంతాపముచే సౌందర్య సమున్మీలనమై, యత్యుత్త మత్వమునంది, నైతిక సమ్మేళనముగాఁ బర్యవసించినది. అందు చేతనే 'గెథే' మహాశయుఁడు, వసంతకాల పుష్పసమృద్ధియు, గ్రీష్మకాల ఫలసమృద్ధియు, నేకకాలమున శాకున్తలమునందు సమకూరుచున్నవని సత్యసమ్మతముగా బ్రశంసించెను. స్వర్గ భూలోకముల సమ్మేళన మన్నను నిదియే. శాకున్తలమున స్వర్గపరిచ్యుతియు, పునఃప్రాప్తియు జరిగినవి.

సాధారణ ప్రేయసీ ప్రియులుగా ప్రథమాంకమున శకున్తలా దుష్యంతుల కలయిక నిరుపయోగమైనదనియు, చర మాంకమున, భరతుని జనకులుగా వారి సమైక్యమే సరసమైన సమైక్యమనియు కవి నిరూపించెను. ప్రథమాంకము కాంతి మంతమై, సంచలనాత్మకమైనది. మహర్షి దుహిత నవయావన భరిత; ఆమె సఖులిరువురు నిత్యోత్సాహులు; వనలతలు నూత్న పుష్పశోభితములు; పరభృతములు, సుగంధ మదోన్మత్తములు.

ఇట్టి దృశ్యము నుత్కంఠతో మహారాజు పొదరింటి చాటు నుండి తొంగి తొంగి చూచును. ఇట్టి సౌందర్య ధామమున దుష్యంత హృదయాధి దేవతయగు శకున్తలకు రాజాస్థానము నందు, రాజ హృదయమున నిసుమంత చోటు లేక పోయినది. పరాభవ ఖిన్నయై యజ్ఞాతవాస మొనర్పవలసి వచ్చినది. ఈ యజ్ఞాతవాసమున నీమె కాశ్రయ మిచ్చిన యాశ్రమ మన్నివిధముల నీమె పూర్వము పెరిగిన యాశ్రమము కన్న భిన్నమైనది. ఈ శకున్తల కూడ పూర్వపు శకున్తల కాదు. ఇప్పటి శకున్తల భరతునిఁగన్న వీరమాత. మూర్తీభవించిన సత్త్వము. ఈ యాశ్రమమున కన్యలు పాదపములకుఁ బాసీయ ములు పోయరు. స్నేహార్ద్రదృష్టులతో లతామతల్లులపై శీతల వారి బిందువుల నెగజిమ్మువా రిచట లేరు. కురంగశాబకములను గూర్మితో ముద్దాడి నీవార ధాన్యము నంజలులతో నందించు వా రసలే మృగ్యము. ఇచటి వనకాంతా హృదయమును చక్కిలిగింత పెట్టెడి వాఁ డొక్కఁడే యొక్క బాలకుఁడు. పుష్ప తపు లతాగుల్మ సౌందర్యము నంతను నతకరించిన కుమారుఁ డీతఁడు. తాపస స్త్రీల కీతనిని పట్టశక్యము కాకుండెను. మాతృ ప్రేమోత్కంఠలగు వీ రతని సంరక్షణముపట్ల సతమత మగుదురు. శకున్తల మనకు తిరిగి కనుపించినపు డామె యాకృతి యెట్టిది ? మిగుల మాసిన వస్త్రము; నిష్ఠుర నియమ పాలనచే కృశించిన ముఖము; ఏకవేణి; ఇది యామె యాకృతి!! దుష్యంత ప్రథమ సమాగమ సంప్రాప్త కళంకము నామె తన తపస్సలిలముచే సమ్మార్జన మొనర్చు కొన్నది. ఇప్పు డీమెలో నొక వినూత్న తేజము సందర్శనీయ మగుచున్నది. మాతృ

త్వము ముమ్మూర్తుల మూర్తీభవించిన నైష్ఠిక సౌందర్యమే యీయమె !! ఇప్పు డీమెను దిరస్కరించువా రెవరు ? తిరస్కరింపఁ గలవా రెవరు ?

ధర్మమున కవిరుద్ధముగా ప్రేమభావముతో నడచు సౌందర్యము, శాశ్వతమైనది. నియమసహిత ప్రశాంత ప్రేమ స్వరూపమే సత్యమగు ప్రేమస్వరూపము. నైష్ఠిక సౌందర్యమే శుభప్రదమై నిత్యాకర్షణోల్లసితమైనది. నియమరహితము, నసంస్కృతమునగు సౌందర్యము క్షణభంగురము. కవి యిట్టి పవిత్రభావములను కుమారసంభవమునందు వలె, నిందును కాంతాసమ్మితముగా నుపదేశించెను. ఈ ప్రాచీన భారతీయ కవిపుంగవుఁడు కేవల ప్రేమకే యత్యంత ప్రాధాన్యము నొసఁగి గౌరవింపలేదు. సాధుత్వమే ప్రేమకు చరమలక్ష్యమని ప్రబోధించినాఁడీకవి. దంపతులప్రేమ, స్వార్థయుతమైనచో నెట్టి సత్ఫలముల నొసంగదనియు; వాత్సల్యరూపమున సంఘము నందు పరివ్యాప్తము కానంతవఱకును, దాని కెట్టి సౌందర్యము గాని, శాశ్వతత్వముగాని, చరితార్థత కాని లేదనియు నీతఁడు ముక్తకంఠమున నుద్బోధించెను.

భారతీయులకు రెండు విచిత్రములగు విధానములు కలవు. ఒక రీతిగా వారు దాక్షిణ్యయుత గృహస్థ జీవితనియమబద్ధులు. మఱియొక రీతిగా నాత్మస్వేచ్ఛాప్రియులు. ప్రపంచములోని యనేక జాతులతోడను, తెగలతోడను భారతీయులకు సంబంధ మున్నను,ప్రంపంచములో నెవరియందునుగానరాని తపశ్చర్యా విధాన మొక్క భారతీయులయందే దర్శనీయము. కాళిదాస మహాకవి, తన 'కుమారసంభవ' మహాకావ్యము నందును,

'శాకున్తల' రూపక రాజమునందును నీ రెండు విధానములకు సామరస్యమును, నొకదానినుండి యొకటి క్రమముగా పర్యవసించుపద్ధతిని ప్రదర్శించెను. ఆతనియాశ్రమములందు మానవ కిశోరములు సింహకిశోరములతో నాటలాడు కొనును. ఆశ్రమ ధర్మము, గృహస్థధర్మముతో తులదూగును. ప్రశాంతాశ్రమము ప్రాతిపదికగా కాళిదాసు గృహస్థాశ్రమ ధర్మ సౌధమును నిర్మించెను. ఈతఁడు కాముకత్వ ప్రాబల్యముగల స్త్రీ పురుష విచక్షణను దొలఁగించి, పవిత్ర యోగసాధనము నం దండతిని సంయోగ మొనర్చెను. ధర్మశాస్త్రములయందు లింగవిచక్షణ పాటింపవలయునని కఠినముగా శాసింపఁబడినది. కాంతాకాంచనములు మానవున కత్యంత మోహాకరములని ధర్మశాస్త్రము ఘోషించు చున్నది. కాళిదాసీ ప్రబోధము నే కాంతాసమ్మితము గావించెను. సౌందర్యప్రధాన మైన జగత్తులో నిట్టి క్షుద్రమగు లింగవిచక్షణమున కనకాశ ముండదని కూడ నీతఁడు నిరూపించెను. ఈతని సౌందర్య జగత్తు జీవకళతో కళకళలాడునది; సౌజన్యముతో శోభిల్లునది. సాధుత్వమును సవదరించు కొనునది. సువిశాల విశ్వమును సురుచిర ప్రేమ భావముతో నాలింగన మొనర్చుకొనునది. కాళిదాస ప్రతిపాదిత సౌందర్యము, త్యాగముచే సిద్ధించును. దుఃఖముచే నూతనత్వమును బొందును. తపస్సుచే దివ్యత్వము నార్జించును. ఇట్టి దివ్య సౌందర్యార్ణవమునందు నియమ రహిత కామోద్రిక్తవాహిను లనేకములు ప్రణయభావ పరిపూర్ణత ననుభవించును. సకల ప్రపంచ మట్టి దివ్యసౌందర్య భావముగాఁ బరివర్తింపబడవలయునని కవీశ్వరుని యాశయము !!

# ౬

# కాళిదాసు - నీతిబోధ

రసానంద ప్రసాదనమే కాళిదాస కవిత్వ ప్రధాన లక్ష్యమని భావించుట పరిపాటియైనది. అందుచేతనే కాళిదాస జీవితమునకు కళంకము నాపాదించు నీచ శృంగార గాథలు పరంపరానుగతముగా ననేకములు ప్రబలినవి. ఇట్టి జనశ్రుతులు నిరర్థకములు. ఇవి సాహిత్యావగాహమున కేమాత్రము నుపకరించవనుట రూఢము.

మహాభారత మొక వీరగాథ. ఆ మహేతిహాస మవిరామమగు కర్మక్షేత్రము. కాని యట్టి యవిరళ కార్య సంచలనత్వము నందును నొక ప్రశాంతస్థితి, ప్రపంచ పరాఙ్ముఖత్వము నిహితమై యున్నట్లు పరిశీలనాదృష్టికిఁ దోచును. నిరంతర కర్మ పరాయణత్వమే మహాభారత చరమలక్ష్యము కాదు. అందలి యసూయాద్వేషములు; సాహస వీరములు; వైరుధ్య సామరస్యములు; జయాపజయములు పరమశివుని విలయ శంఖారావమున కుపశ్రుతిని గల్గించునవియే. రామాయణము నందుకూడ నిట్టి స్థితి కానుపించును. విజయోపేతమయిన సమస్త సన్నాహములు నపజయమునందే పర్యవసించినవి. విజయలక్ష్మి నాయకుని చేఁజిక్కినట్లె తోఁచినది. అంతలోనే చ్యుతమయినది – సమస్తము పరిత్యాగమునందే పర్యవసించినది. అయినను సంవృత మేఘ సమూహము సతికరించి వెలుగొందు రజతాద్రి శిఖరమువలె, నిట్టి జయాపజయ పరిత్యాగాదులనుండి ధీరోదాత్త క్రియాదక్షత వెలారుచుండును.

ఇదే భారతీయ మహేతిహాసములందు నిహితమయిన మహిత సత్యము.

ఇట్లే కాళిదాస కావ్యగత సౌందర్యోల్బణమునందు, సుఖవైముఖ్యభావ విధాన మొదిగియున్నది – మహాభారత మే రీతిగా నేకకాలముననే కార్యోన్ముఖ పరాఙ్ముఖత్వములను బ్రబోధించునో, యట్లే కాళిదాస కావ్యములందును నింద్రియ సుఖానుభవములోనే వైముఖ్యముకూడ నిమిడియున్నది. ఆతని కవిత్వము రసానందముననే యంతమందదు – అందుండి యొక యాధ్యాత్మిక సుస్థితి లభించవలయును – అదే నైష్ఠిక సౌందర్యము!!

ఇట్టి పర్యవసిత నైష్ఠిక సౌందర్యమునం దాధునికుల కంత యాదరము లేదు. శాకున్తల రూపకమును జూతము. దుష్యంతున కంగుళీయము లభింపగనే పూర్వస్మృతి గల్గెను. ఆతఁడు తన యవివేకమునకుఁ బశ్చాత్తప్తుఁడాయెను. శకున్తలా విరహ దోదూయమాన మానసుఁడాయెను. పాశ్చాత్య కవీశ్వరుఁడైన-చో-ఈ రూపకము నీ స్థితిలో ముగింపఁజేసెడివాఁడు. దేవలోకమునుండి తిరిగివచ్చు సమయమున, దుష్యంతునకు శకున్తలా సమాగమము కాకతాళీయముగా సమకూరినది!! ఇట్టి సన్నివేశ కల్పనము పాశ్చాత్య రూపక మర్యాద నతిక్రమించినది. ప్రేమికుల వియోగ విషాదమునందు కావ్యము లంతమొందవలయునని వారి నియమము. ప్రథమాంకమందు బీజావాపము గావింపఁబడిన ప్రేమ, వియోగమునందు పర్యవసింపవలయునని వారి యుత్కంఠ! అందుచే మొత్తము రూపకమునం దెచ్చటగాని, నాయికానాయకులకుఁ జెందిన ప్రే

సన్నివేశమునందుగాని, చర్యయందుగాని, వారి పునస్సమాగమ విషయము యత్కించిత్ గూడ సూచింపఁబడదు - ఈ విషయ మిట్లుంతము.

కుమారసంభవ మహాకావ్యమును బరికింతము. ప్రతీచీ కవిపుంగవుఁ డెవఁడైనను, తన త్రిభువన మోహన కరమైన సౌందర్య సంపదతో త్ర్యంబకుని హృదయమును రంజింపఁ జేయలేక, వ్రీడావనత వదనయైన పర్వత రాజపుత్రి గాఢ పరితాపముతో నీ కావ్యమును పరిసమాప్త మందించెడివాఁడని నిష్కర్షగా పేర్కొనవచ్చును - ఆధునిక విమర్శకుల కిట్టి యాలేఖనమే కావ్య సమస్యా పరిష్కారమునకు నిసర్గ మార్గమని తోఁచును. అంతేకాదు - ఈ స్థితి నతిక్రమించి, పార్వతీ పరమేశ్వరులకుఁ బరిణయము సేకూర్చుట నీరస విధానమని గూడ వీరు భావింతురు.

వివాహము నీరసజీవితమునకు నాందీప్రస్తావన. సుశిక్షితమైన సాంఘిక విధానమునం దిదియొక యనివార్యమైన వ్యవస్థ. మానవుని కామోద్రిక్తతను కట్టుత్రెంచుకొని పోనీక, ఋజుమార్గమున నొకలక్ష్యమునకుఁ జేర్చున దీ వివాహము. ఆధునిక కవు లీ వ్యవస్థకు తమ కావ్యములయందంత ప్రాముఖ్యము నీయలేదు. ఇది వారి స్వేచ్ఛాప్రియత్వమునకు నిదర్శనము. మత సాంఘిక నియమపాశములనుండి విముక్తి పొందిన ప్రేమ వారి కాదరపాత్ర మైనది. ఏ ప్రేమ యువతీయువకుల నేకమొనర్చి, సర్వ ప్రపంచ మేకమై వచ్చినను, తమ ప్రేమ బంధముల బిగువును సడలింపఁ జాలదను ప్రత్యయము ప్రగాఢముగ నొనగూర్చునో; ఏ ప్రేమ యువదంపతులను దమ పరిసరముల కతీత

మొనర్చి, స్వేచ్ఛావీథులలో విహరింపఁజేయునో! యట్టి స్వచ్ఛందామల ప్రేమయే నవకవుల కైవారమున కర్హమైనది.

సౌందర్యోన్మాద దాయకమగు నిట్టి నిర్హేతుక ప్రేమను కాళిదాసు విస్మరించలేదు. నవనవోన్మేష ప్రేమ శబలత నాతఁడు చక్కఁగాఁ జిత్రించినాఁడు. కాని యాతని కవిత్వ చరమలక్ష్య మిదికాదు. ప్రశాంత సాయం సంధ్యారుణ రాగములలో క్రియాత్మకమగు సత్ఫలముల సమకూర్పగల పవిత్ర ప్రేమస్థాయి నందుకొనుటయే యీ కవీశ్వరుని తుదిలక్ష్యము.

కుమారసంభవమునకు, శాకున్తలరూపకమునకు కావ్య ప్రణాళికలో సామ్యముకలదు. ఈ రెండింటియందును మన్మథుఁడు చేకూర్పఁదలఁచిన కలయిక విఫలమయినది. పూల పల్లకియం దూరేగు పెండ్లికుమారుఁ డందే చంపబడిన ట్లీ వైఫల్యముచే మన్మథోద్దీపకములగు పరిసరముల వైభవము లన్నియు రూపఱినవి. అనంతరము వేరొకరీతిగా నాయికా నాయకుల సంధానము సంభవించినది. తొలుత నాశింపఁబడిన సంధానముకన్న నిది యనేకరీతుల విలక్షణమయినది. ఇది తీవ్ర వేదనా సంజనితము, కఠిన తపఃఫలము. ఇది బాహ్య సౌందర్యాదుల నధిగమించినది. పరిశుద్ధ ప్రణయ పరంజ్యోతి పరివేష శోభావిలసితమయిన దీ సంధానము.

విపరీతమగు నాత్మ విశ్వాసముతో పుష్పబాణుఁడు తగిన సన్నాహములు సమకూర్చుకొనియే విజయము సాధింపఁ దలఁచెను. కణ్వ, స్థాణ్వాశ్రమములు రెండును మానవ సంఘ సంకులత్వమునకు సుదూరమైనవి. అవి ప్రశాంత మాధురీ వాతావరణ విలసితములు. ఇట్టి పవిత్రాశ్రమములందును కవి,

యవసరమైన మన్మథోద్దీపనముల నఖండముగా నాయత్త పఱచెను. నిర్హేతుకమైన సహజప్రేమ ఫలించుటకుఁ దగిన సదుపాయములు, సన్నివేశములు కవి సమకూర్చెను.

కుమారసంభవములోని యీ దృశ్య మెంత మనోహరము!! అదే వియల్లోక కల్లోలిని మందాకిని! అందదే కిన్నర గాన మనోజ్ఞము, దేవదారు ద్రుమవేష్టితము నగు హిమవత్పర్వత సానువు!! అందు సంయమియగు త్ర్యంబకుఁ డొక యాశ్రమమును నిర్మించుకొని తప మాచరించుచుండెను. అంతలో నకాల వసంతావిర్భావముచే చరాచర ప్రకృతి యంతయు కామోద్రిక్తతతో నుప్పొంగినది. దక్షిణ దిక్కాంత వ్యలీక నిశ్వాసమువలె మలయమారుతము, సుందరీ శింజిత నూపురపాద సంస్పర్శము నాశింపకయే, స్కాంధపర్యంతము పల్లవితమైన యశోకముల మధ్యనుండి వీవసాగెను. ఏక కుసుమ పాత్రలో, ప్రియానువర్తియై ద్విరేఫము మధువు నాస్వాదించు చుండెను. కృష్ణసారము తన మృదుశృంగములచే ప్రియురాలిని స్పర్శించి సుఖ పారవశ్యమున మునుచుచుండెను.

తపః కుటీర ప్రాంతముననా వసంతావిర్భావము!! ఆశ్రమ కఠిన నిబంధనావధుల నతిక్రమించి ప్రకృతి తన నిజ స్వరూపమును బ్రకటించినది. కాని దాని యానందకేళి కిచట పూర్తి యవకాశము మృగ్యము. పర్వత సానువులం దంతటను నీ యకాల వసంత సౌందర్య సామ్రాజ్య శోభ యావహించినది. ఇట్టి యపూర్వ సౌందర్య ధామమునందు త్రిభువనైక సుందరియగు పర్వత రాజపుత్రి సాలంకృతయైనది. ఏ దెట్లున్నను, శార్దూల చర్మాస్తరణమైన దేవదారు ద్రుమ

వేదికపై పరమశివుడు పర్యంక బంధ స్థిరపూర్వకాయుఁడై, భుజంగమోన్నమిత జటాకలాపముతో, కర్ణావసక్త ద్విగుణాక్ష సూత్రముతో, కంఠప్రభాసక్త విశేష నీలిమమై గ్రంథిమతి యైన కృష్ణాంబరమును ధరించి, కించిత్ప్రకాశ స్థిమితోగ్ర తారలు గల్గి, భ్రూవిక్రియావిరత ప్రసంగములై యవిస్పందిత పక్ష్మమాలలతో నధోమయూఖములై ఘ్రాణాగ్ర లక్షిత మయిన నేత్రత్రయముతో ప్రశాంతముగాఁ దపమాచరించుచు, నాత్మయం దాత్మరూపమునే సందర్శించుచు, శాంత మహో సముద్రమువలె నానంద తరంగితుఁడై యుండెను. ఇట్టి యనను కూల స్థితియందు, మిథ్యావసంతము నాలంబించుకొని, యెచ్చ టను సామ్యమేలేని ఆదిపురుషుఁడగు పరమశివునకు పార్వతికిని పంచబాణుఁడు జతకూర్పవలయునని సంకల్పించినాఁడు పాపము!!

కణ్వాశ్రమ సన్నివేశముకూడ నిట్టిదే - ఇచ్చటి ప్రేమి కుఁడు చతురంబోధి మేఖలావలయిత మేదినీ విభుఁడు!! ప్రేమించిన దా తరులతా నికుంజములతోఁ గ్రీడించు నాశ్రమ ముగ్ధకన్యను!!! అంధుఁడైన కుసుమసాయకుఁ డెట్టి యకుం ఠిత శక్తితో నొక్క త్రుటిలో దేశకాలార్థాంతా సీమలను తృణీకరించునో ప్రదర్శించినాఁడు కాళిదాసు!!

కాని యీ కవిసార్వభౌముఁ డింతటితో నాగలేదు. ఇట్టి ప్రేమ విధానమున కాతఁడు గౌరవాంజలులను సమర్పింప లేదు. ఇంతకన్న సచ్చిదానందాత్మకమయిన ప్రణయమునందు గాని యాతఁడు తన శృంగార భావములను సార్థకము సేయఁడు. కాముఁడు భస్మీభూతుఁడు కావలయును. ఆ స్థానమున నాలం

బనాలంకార విహీనయై, పరితప్తయై, యసిధారావ్రత నిష్ఠుర కృశాంగియైన యొక శక్తి యావిర్భవింపవలయును.

స్వేచ్ఛాయుతమైన ప్రేమోద్రిక్తతా శక్తిని కాళిదాసు గుర్తించెను. ఆత్మసంయమన విహీనమయిన నరనారీబృందము నది యెట్లు కైవశ మొనర్చుకొనునో యాతని కెఱుకయే. కాని యట్టి ప్రేమ కాతఁడు దాసోఽహమనఁడు — అహంకార దోషదూషితమయిన ప్రేమను ఖండించుటకే దుర్వాసః శాపమును, త్రినేత్రాగ్ని జ్వాలలను కవి ప్రవేశపెట్టినాఁడు.

శకుంతల స్వధర్మమును విస్మరించినది. ఆతిథేయ సత్కారములు నెఱపుట మానినది — ఆమెకు భర్తతోడిదే లోకమైనది. స్వార్థసంకుచితమైన ప్రేమోన్మాదమునకు గురియైనది. అది యనర్థదాయకమగు ప్రేమ. జగత్కల్యాణ నియమములఁ దిరస్కరించి, ప్రియుఁడుదక్క తక్కిన ప్రపంచమే శూన్యమను భావోద్ధతిని కల్గించు ప్రేమ, పశుప్రాయమైనది — అట్టి ప్రేమ యచిరకాలములోనే యసహిష్ణముగాఁ బరిణమించును — విశ్వశ్రేయోదాయకమగు శక్తులు దాని నడుమలోనికిఁ దీసికొనిరావలయును — ఆత్మసంయమనముతో సాంఘిక మైత్రీభావముతో, నల్పానల్పములనైనను దృణీకరింపక, సర్వసమత్వ సద్భావ వికాసమును విస్తరింపఁ జేయుచు, విశాల విశ్వపరివ్యాప్త సామ్రాజ్యమును తన విభునకే పట్టముగట్టినను, నాత్మేతర ప్రకృతితో ననురాగబంధములను ద్రెంచుకొనక వర్ధిల్లు ప్రేమ శాశ్వతమైనది. అట్టి ప్రేమయే యచంచలమయినది. దైవిక, మానవశక్తులుకూడ దానిని బలహీన మొనర్పఁజాలవు. కాని యాశ్రమప్రశాంత తపఃప్రక్రియలను భగ్నమొనర్చుటకుఁ

ప్రయత్నించునట్టి యుద్రిక్తత, అతిథేయ సాంఘికధర్మములను వ్యతిరేకించు కాముకత్వము నాత్మవినాశముతోఁ బాటు, నన్యవినాశమునకుఁగూడ దారితీయు ప్రమాదముతోఁ గూడినవి.

స్వకీయ సౌందర్యప్రతిభచే పార్వతి పరమశివుని వైవశము గావించుకొనఁదలఁచినది. ఒక్క త్రుటికాలము మాత్రమే యాశ్రమ ప్రశాంతి సంచలించినది. అందులకే కోపోద్రిక్తతతో ముక్కంటి యామెను దిరస్కరించెను. కాముఁడు దగ్ధుడైనాఁడు – పార్వతి యభిమానముకూడ నప్పుడే దహింపఁబడినది – రుద్రసంరంభమున కామె చక్షుర్ద్వయము ముకుళితమయినది! శరీరము కంపించినది!! అనుకంపమున కర్హయయినది!! దంతలగ్నమయిన పద్మినిని వహించు గజరాజువలె, పర్వతరాజు, వేగదీర్ఘీకృతాంగుఁడై, తన దుహితను గృహమునకుఁ జేర్చెను.

ఇట్లే కణ్వాశ్రమ దుహిత యెంతటి యౌవన సౌందర్యోద్దామయైనను, పరాభవఖిన్నయై బయటికి నడువక తప్పినది కాదు. దుర్వాసశ్శాపము కేవలము సాంకేతికమైనది. అది కవీశ్వరుని స్వోపజ్ఞకు ప్రత్యక్ష తార్కాణము. శకున్తలా దుష్యంతుల రహస్యసమాగమము నిందాభాజకమైనది. కామోద్రిక్తతా తీవ్రత, సౌదామనీ సదృశకాంతితో క్షణకాలము మెఱయును. వెంటనే హృదయ దౌర్బల్యాంధకార మలముకొనును. పరాభవ ఖురాలకము దూసికొనును. ఇది శాశ్వత సూత్రము. అన్నియుగములందును, నన్నిదేశములందును, తిరస్కారము పొందిన యే సీమంతినికైనను, తన భౌతిక శరీర సంపద నిరర్థకమని గుర్తించు పరిస్థితి కల్గక తప్పదు. ఆమెకు

శరణ్యా మిక సకలహృదయాధినాథుఁడగు నా పరమేశ్వరుఁడే!!
కేవల భౌతిక సౌందర్యమే స్త్రీకి సర్వోత్కృష్టము కాదు.

అందుచేతనే పార్వతి శివతిరస్కృతయై శివుని నిందింప లేదు. 'నినిన్దరూపం హృదయేన పార్వతీ' 'ప్రియేషు సౌభాగ్య ఫలాహిచారుతా' పార్వతి హృదయపూర్వకముగా తన రూప మును నిందించుకొన్నది. ఏలయన పతి ప్రశంసలకుఁ బాత్రము కాలేదుగావున. అయినను నిరాశా నిస్పృహలకు గురికాలేదు. ఎట్లైనను, అనగా సమాధిస్థితినంది తీవ్ర తపశ్చర్యఁ చేతనైనను నవంధ్యరూప కావలయునని నిశ్చయించినది. సౌందర్య మెట్లు విజయమును సాధించును? వివిధ భూషణాంబరములచే నది యసాధ్యమని యామె యింతకు ముందే గుర్తించినది. అందు చేతనే యీ పర్యాయము పథకము మార్చినది. అసిధారా వ్రతమునకుఁ గడంగినది. తదనుకూలముగ నారచీరలుగట్టి, యక్షమాల చేత ధరించినది. ఆశ్రమజీవితము నేర్పఱచుకొని నిష్ఠుర నియమావళి నాచరణమున సుకరము చేసికొన్నది.

ఇట్లే శకున్తల భర్తృతిరస్కారానంతరము, తిరిగి కణ్వాశ్రమము నాశ్రయింపక, మారీచ మహర్షి దివ్యాశ్రమ మును జేరినది. పరాభవ దుఃఖ దోదూయమాన మానసయైనది. పశ్చాత్తప్తయైనది. ఇంద్రియప్రకోపము చల్లారినది. ఆత్మ శక్తి నార్జించినది. నైష్ఠిక సౌందర్య విశిష్టతతో నాశ్రమ తప స్విని యైనది. సత్యశివసుందరమైన ప్రణయ దేవతా సాక్షా త్కారమునకు నిరీక్షించుచున్నది.

పర్యాప్త పుష్పస్తబకనమ్రయై, సంచారిణియగు పల్లవ లతవోలె, తన్ను సమీపించిన హిమరాజపుత్రికను దిరస్కా

రించిన త్రిపురాంతకుఁడే, గౌరీశిఖరమున నపర్ణయగు నుమా దేవిని, కపట బ్రహ్మచారిరూపమున జేరి పరీక్షించి యామె కఠిన తపః పరిపాలనమునకుఁ బరితోషితాత్ముఁడై, నిజరూప మున సాక్షాత్కరించి "అద్యప్రభృత్యవనతాఙ్గి! తవాస్మిదాసః క్రీతస్తపోభిః" 'ఓ యవనతాంగి! నేఁటినుండి నేను నీ దాసుఁ డను, నీ తపశ్చర్యలచే నమ్ముడు వోతి' నన్నాఁడు. నైష్ఠిక సౌందర్యమునకుఁ బరమేశ్వరుఁడుగూడ తనకు దాసుడై యాత్మ సమర్పణము గావించుకొన్నాఁడు.

నైతికశక్తి సంపన్నములైన హృదయములు సమైక్య మైనపు డావిర్భవించు ప్రేమ నేదియు వ్యతిరేకించదు. నైతిక శక్తి నుల్లంఘించి కుసుమబాణుఁడు చెలరేగినపుడే కలహము లుప్పతిలును. వెంటనే ప్రేమ స్థైర్యమును గోల్పోవును. సౌంద ర్యమునందు ప్రశాంతి నశించును. నైతికశక్తి కొదిగి ప్రేమ సక్రమస్థాన మాక్రమించినపుడు, సమగ్రత్వమున కది సర్వవిధ ముల దోహదమొనర్చును. సమైక్యత నది భంగింపదు. ఏలయన నీతి యనగా సమైక్యతయే కాని యన్యముకాదు. నీతి సౌంద ర్యమును బరిపోషించును. శ్రేయస్సును సమకూర్చును. శ్రేయ స్సౌందర్యములను మధురముగా సంయోగించి యీ రెండింటికి నారోగ్యవంతమగు పుష్టిని, పూర్ణత్వమును సమకూర్చును.

మాతృత్వమే భారతీయమహిళ యందుకొనవలసిన మహోన్నతస్థానము. పుత్రజనన మీ దేశమున నొక పవిత్ర పర్వము. అందుచేతనే మన ధర్మశాస్త్రము మనువు 'సంతాన వతులౌదురు కావుననే మహిళామతల్లులు గృహజ్యోతులు,

ఉదాత్త జీవనులుగా మనకు గౌరవార్హులగుచున్నారని యాదేశించెను.

కుమారసంభవ మహాకావ్యమంతయు సర్వశక్తి సంపన్నుఁడగు కుమార జననమునకై కావింపఁబడిన నాందీ ప్రస్తావన. మారుఁడు పొదరింటిచాటున పొంచుండి సంయమన వినాశము నాధారించుకొని, కురిపించిన సాయకములు, సత్సంతాన సంప్రాప్తి సాధకములుకావు. కామ ప్రేరితులైన దంపతుల కింద్రియ సంతృప్తియే పరమ లక్ష్యముకాని, పుత్రప్రాప్తి కాదు. ఆ కారణముచేతనే కాళిదాస కవీశ్వరుఁడు కాముని దహింపఁజేసి, పార్వతిని తీవ్ర తపశ్చర్యలకు సంసిద్ధమొనరించెను. తీవ్ర తపశ్చర్యా సంతప్త సంజనిత నైష్ఠికశక్తి సౌభాగ్యయగు గౌరీదేవికి గాని, ముక్కోటి దేవతలకు తారకాసుర బాధావిముక్తిదాయకుఁడగు కుమారస్వామి జనింపఁడు! మనశ్చాంచల్య స్థానమున దృఢ సమాధినిష్ఠను; భౌతిక సౌందర్య వ్యామోహస్థానమున, కళ్యాణాత్మకమయిన యాంతరంగిక సౌందర్యమును; వసంత విజృంభణాతిశయమయిన పర్వతారణ్యముల స్థానమున నానందోత్సాహ విలసితమయిన త్రిభువనములను జేకూర్చి కాళిదాసు కవి సార్వభౌముఁడైనాఁడు.

ఏవం విధముగా కుమారసంభవ – శాకున్తలములలో సమత్వము సందర్శనీయము. కామోద్రిక్తత పతనకారణమనియు; సంయమన సద్ధ్యానము సమగ్ర ఫలదాయకమనియు; నైతికశక్తి సముత్ఫుల్ల సౌందర్యము సుస్థిరమయినదనియు; ప్రశాంత సంయమన శుభోదర్కమయిన ప్రేమయే సర్వోత్కృష్టమైనదనియు; సంయమనమునందు సత్య సౌందర్యాకర్ష

ణము కలదనియు; శ్రుతిమించిన స్వేచ్ఛా సౌందర్యము వినాశ హేతువనియు; కవిసార్వభౌముఁ డీ మహాకావ్యద్వయముచే కాంతా సమ్మితముగా నీతి నుపదేశించుచున్నాఁడు!! ఈ ప్రాచీన భారతీయ కవిపుంగవుఁడు కామము ప్రేమ కాదనియు, జగత్కళ్యాణదాయక మగునదియే ప్రేమయనియు, నదియే ప్రణయమని మనోహరముగా కావ్యగానము చేసెను.

"సరస్వతీ శ్రుతిమహతీ మహీయతామ్"





# అనుబంధము

1. హోమర్ (Homer) : (క్రీ. పూ. 1050-850) ప్రాచీన గ్రీకు ఇతిహాస కర్త. 'ఇలియడ్' (Iliad) 'ఒడిస్సీ' (Odyssey) యను నితిహాసము లీతఁడు వ్రాసినట్లు ప్రసిద్ధి.

2. షేక్స్పియర్-విలియం (Shakespeare - William) : (క్రీ. శ. 1564-1616) ఆంగ్లకవి. జగద్విఖ్యాతిగాంచిన ఆంగ్ల రూపక కర్త.

ఈతని పద్యకృతులు :- వీనస్ అండ్ ఎడోనిస్ (Venus and Adonis), ది రేప్ ఆఫ్ ల్యూక్రిస్ (The Rape of Lucrece), సానెట్సు (Sonnets). ఈతఁడు నటకుఁడుగా, నాటకసమాజములకు భాగస్వామిగా, నాటకకర్తగా ఎలిజబత్కాలమున నెనలేని కీర్తి నార్జించెను. అనేక సుఖవిషాదాంతరూపకములు రచించి, యాడించి, తన నాన్యతోదర్శనీయమగు వాస్తవిక శీలచిత్రణ ప్రభావముచే విశ్వము నుఱ్ఱూతలూగించుచున్న వీరుఁడు.

3. డాంటే (Dante - Alighieri) : (క్రీ. శ. 1265-1321.) ఇటాలియన్ మహాకవి. 'డివైన్ కామెడి' (Divine Comedy) కావ్యకర్తగా విశ్వవిఖ్యాతి నార్జించిన యీతఁడు బహుముఖీనములగు ప్రజ్ఞాప్రాభవములు కలవాఁడు. వీరుఁడుగా, రాజనీతిజ్ఞుఁడుగా, వేదాంతిగా, భావకవిగా, చిత్రకారుఁడుగా, భాషావేత్తగా, నాదర్శప్రేమోపాసకుఁడుగా నీతఁ డజరామరణమగు కీర్తి నార్జించెను.

4. పదునాలుగవ లూయీ (Louis XIV) : ఇతఁడు తన ఐదవయేటనే ఫ్రెంచి సామ్రాజ్య సింహాసన మధిష్ఠించి, క్రమముగా తన యధికారమును చెలామణి గావించెను. మహాసామ్రాజ్యాధినేతగా ఖ్యాతి గాంచెను. ఇతని రాజభవన మఖండ శిల్పచిత్రలేఖన కళానిలయము. సారస్వతము నీతఁడు పరిపోషించెను. ఫ్రెంచి రూపకకర్తలగు కార్నెల్లి, రాసిన్, మోలియర్ అను త్రిమూర్తు లీ రాజపోషణము ననుభవించిరి. మోలియర్‌తో లూయీకి నేస్త మెక్కువ. మోలియర్ సుఖాంత రూపక

ములు లూయీ రాజసభావిశేషములను తత్కాల మేధా వైశిష్ట్యమును ప్రతిబింబించును, డెస్కార్టెస్, పాస్కల్ మున్నగు వేదాంతులీతని కాలము వారే. 'లూయీ' ఫ్రెంచి సమ్రాట్టుల కాదర్శప్రాయుఁడు.

5. మిల్టన్ (Milton–John) : (క్రీ. శ. 1608–74.) ఆంగ్ల మహాకవి. పారడైజ్ లాస్టు (Paradise Lost) పారడైజ్ రీగైన్డ్ (Paradise Regained) శామ్సన్ ఎగొనిస్టస్ (Samson Agonistes) మున్నగు ననేక కావ్యము లీతఁడు రచించెను. ఈతని వ్యక్తిత్వ మతి విచిత్రమైనది. దేశము రాజకీయముగా సంక్షోభకల్లోలితముగానున్న సమయమం దిరువది యేండ్లు ఉద్యోగము చేసియు, పరమప్రశాంత స్థితిలో కవిత్వమల్లిన ఘనుఁడు. ఇతఁడు సనాతనులలో సనాతనుఁడు, అభ్యుదయ వాదులలో నభ్యుదయవాది.

ఈతని కవితాశైలి ప్రబంధోచిత మైనది. ఈతని కావ్యవిషయములు విశ్వజనీనములు. అవి కేవల కవితావిషయములే కాక, ఆత్మీయ విశ్వాస భావముద్రికలు. ఈతఁడు తన జీవితావసాన దశయందంధుఁడై బాధల ననుభవించెను.

6. పారడైజ్ లాస్టు (Paradise Lost) జాన్ మిల్టన్ వ్రాసిన మహాకావ్యము. క్రీ. శ. 1667 లో తొలిసారిగా నిది ప్రచురింపఁబడినది.

'హోమర్' 'వర్జిల్' మహాకవుల మహేతిహాసములతోఁ దులదూఁగఁగల మహాకావ్యమును రచింపవలయునని సంకల్పించి, బహుకాలము కృషిసల్పి, యీమహాకావ్యమును సృజించి, మిల్టన్ కృతకృత్యుఁడాయెను.

ఇది యొక మానవేతిహాసము. మానవుఁడు తన యవిధేయతచే స్వర్గపతితుఁడగుట ఇం దతిదక్షతతో, కవిత్వకల్పనా వైభవముతోఁ జిత్రింపఁబడినది.

స్వర్గమునందు 'లూసిఫర్' (Lucifer) అను వ్యక్తి భగవంతుని యాధిపత్యమునకుఁ గట్టుపడి యుండలేక, తిరుగుబాటు కావించెను. పరాజితుఁడైన యీతఁడు, తన యనుచరులతో నరకానల కాసారమునందు కూలెను. అనంతర మీతఁడు సాటన్ (Satan) అను నామముతో నరక

బాధ ననుభవించుచున్న వారి నందఱను రహస్యముగ సమావేశ పఱచెను. ఆలోచనలు సల్పెను.

'సాటన్' భూలోక స్థితిగతులను గూడ తెలిసికొననెంచి నరక కవాటముల కడకేగిరెను. అక్కడ వాతని కొమార్తె 'పాపము', కుమారుఁడు 'మృత్యువు' నెదురై తలుపులు తెఱచిరి. సాటన్ భూమిపైకి దిగెను.

భగవంతుడు తన సంరక్షకులను బంపులోపలనే, సాటన్ ఆదాము ఈవులతోఁ బరిచయము గావించుకొనెను. ఈవున కతఁడు స్వప్నముల యందు కనుపించి, జ్ఞాన వృక్షఫలముల నాస్వాదింపఁ బ్రేరేచెను. మఱు నాఁడు వలువాతనే ఈవ్ ఒక ఫలమునుగోసి, కొంత యాస్వాదించి, యాదామున కిచ్చెను. ఆదాము నిర్ఘాంత పడెను. కాని చెలిపైగల మక్కువతో నాతఁడా ఫల మారగించెను. దేవునకు ఆదాము, ఈవుల పై నాగ్రహము కల్గినది. భూమిపై ననేక పరిణామములు కల్గినవి. ఋతువు లేర్పడెను. దుఃఖములు పుట్టెను. భూకంపములు కల్గెను. ఆదాము ఈవు లనేక కష్టములకు గురిగ్గొ కడకుఁ బశ్చాత్తప్తులయిరి. భగవానుని బ్రార్థించిరి. భగవంతుఁడు క్రీస్తుగా భూమిపై నవతరించునను వార్తవిని వార లూరడింపబడిరి.

7. థామ్సన్ – జేమ్సు (Thomson – James) : (క్రీ. శ. 1700—48) ఈ కవికి చిన్నతనమునుండియు గ్రామీణ దృశ్యములను వర్ణించు పద్యరచనముపట్ల నభిమాన మధికము. ఈతఁడు క్రీ. శ. 1725 నందు లండన్ నగరము జేరి, దారిద్ర్య బాధానివారణమునకు శిశిర ఋతువును గూర్చి పద్యము ల్లి, క్రమముగా 'ఋతువుల'ను పద్యకృతిని పూర్తిచేసి ప్రచురించెను.

ఆంగ్ల భావలోకఁగల కృతకత్వముపై తొలిసారిగా సవాలు చేసిన రచన యిది. ప్రకృతి వర్ణనలనే కావ్యవస్తువుగాఁగల యీ కావ్య మాంగ్ల వాఙ్మయమున నొక నూత్న శకమున కారంభము గావించినదని యాంగ్ల వాఙ్మయవేత్తల యభిప్రాయము. ఇందలి వర్ణనలు వాస్తవికమగు ప్రకృతి దృశ్యములకుఁ బ్రతిబింబములే కాని కాల్పనికములు కావు.

8. వర్డ్సువర్తు (Wordsworth) : (క్రీ. శ. 1770 – 1850) ఆంగ్ల ప్రకృతి కవులలో నగ్రగణ్యుఁడు. బాల్యమునుండి ప్రకృతిలోఁ దిరిగి, ప్రకృతి నుపాసించి ప్రకృతి కవీశ్వరుఁడుగను, నూత్న శకకర్తగను ఖ్యాతి గాంచెను. భావమునందు, భాషయందు, వస్తువునందు నిరాడంబరత్వమును నిస్తులమహిమను తన కృతులన్నింటిలో నీతఁడు సాధించెను.

9. కీట్సు (Keats-John)(క్రీ.శ. 1795–1821) తొలుత వైద్యము పఠించి, పిమ్మట సారస్వతోపాసకుఁడైనాఁడు. ఐదు సంవత్సరముల కావ్యరచనముతో నీతఁడాంగ్ల వాఙ్మయమున శాశ్వత పీఠము నలంకరించెను. ద్వేషభావముతో విమర్శించు వారిని సగకుగొనక, తన రచనలు సాగించిన ధీరుఁ డీతఁడు. ఈతని రచన లన్నింటిలో సౌందర్యదృష్టి గోచరించును. 'ఇసబెల్లా' అను కథాకావ్యము, 'లాబెల్లీడామ్ సాన్సుమెర్సి' ఇంకను ననేక గేయగుచ్ఛము నీతఁడు రచించెను.

10. వర్జిల్ (Vicgil) (క్రీ. పూ. 70–19) రోమను కవీశ్వరుఁడు. ఈతఁడు వ్రాసిన ఏనియడ్ (Aeneid) అను మహేతిహాసము రోమను ప్రజలు ఇటలీదేశమునందు స్థిరనివాస మేర్పఱుచుకొనుటకు సంబంధించినది. జార్జిక్సు (Joorgics) అను కావ్యము నీతి బోధకమైనది. ఇందు వ్యవసాయ నిర్వహణము, పశువుల సంరక్షణము గూర్చిన యనేక నీతులు కలవు. జానపద వర్ణనాత్మక కావ్యము లనేకము నీతఁడు రచించెను. అందు ఇక్లోగస్ (Eclogues) ముఖ్యమైనవి.

11. జాన్సన్ – శామ్యూల్ (Johnson – Samuol) (క్రీ. శ. 1709–1784) ఆంగ్ల వాఙ్మయ ఘనసంఘటకుఁడు, నిశిత సారస్వత విమర్శకుఁడు, సంభాషణ చతురుఁడు, నైఘంటికుఁడు, బహుగ్రంథకర్త.

12. బాస్వెల్ – జేమ్సు (Boswol–James) : (క్రీ. శ. 1740 – 95) వృత్తిచే న్యాయవాదియైనను, జాన్సనుతో నిరంతర మైత్రి గావించెను. జాన్సను వ్యక్తిత్వమును సూక్ష్మముగా పరిశీలించి యతని జీవిత చరిత్రను వ్రాసి, జీవిత చరిత్రకారులలో నగ్రగణ్యుఁడై శాశ్వతకీర్తి గడించెను.

13. బైరన్ – జార్జి గార్డన్ (Byron – George Gordon) (క్రీ. శ. 1788—1824) షేక్స్పియర్ తరువాత, ప్రపంచఖ్యాతి నార్జించిన కవీశ్వరుఁడు. ఆదర్శ జీవితము వలనను, ఆదర్శ కావ్యరచనల వలనను, నీతఁడు తాను బ్రతికియున్నపుడే యిట్టి ఖ్యాతిగడించెను. 19 వ శతాబ్దపు యూరపునం దీతఁడు తన ప్రభావమును నెఱపెను. ఈతఁడు రాజకీయ మానసిక స్వేచ్ఛావాది. ఈతని చైల్డు హారాల్డ్స పిల్గ్రిమేజ్ (Childe Harold's Pilgrimage), అవర్స ఆఫ్ ఐడిల్‌నెస్ (Hours of Idleness) డాన్‌జూఅన్ (Don Juan) మున్నగునవి జగత్ప్రసిద్ధములు. ఇందు చక్కని యధిక్షేపణ (Satire) గలదు. కవిత్వము భావోద్రేకముగల్గి భావ బంధుర మైనది.

14. మార్లో – క్రిస్టఫర్ : (క్రీ. శ. 1564-93) షేక్స్పియర్ సమకాలీన రూపకకర్తలలో సుప్రసిద్ధుఁడు.

15. కిడ్ – థామస్ (క్రీ. శ. 1557-95) షేక్స్పియర్‌నకు పూర్వుఁడైన నాటకకర్త. ఇతఁ డనేక విషాదగీతికలను వ్రాసెను. సన్నివేశకల్పనమునందు, శీలచిత్రణము నం దీతఁడు తన పూర్వులకన్న విశేషాభివృద్ధి ప్రదర్శించెను.

16. కాలిమోకస్:– (క్రీ. పూ. 310) అలగ్జాండ్రియాలోని ప్రసిద్ధకవులలో నొకఁడు. నగరగ్రంథాలయాధికారిగా కూడ పేరు గాంచెను.

17. అపొలోనియస్:– అలెగ్జాండ్రియా కవులలో నొకఁడు. క్రీ. పూ. 2–3 శతాబ్దముల మధ్యకాలమునకుఁ జెందినవాఁడు. హోమరు శైలి నీత డనుకరించెను.

18. సిమోనైడ్సు:– (క్రీ. పూ. 556-468) గ్రీసుదేశపు మొదటి గేయ కవి. ఈతని రచనలు నిరాడంబరములై నిస్తుల భావములతో తుల తూగును.

19. టెనిసన్ ఆల్ఫ్రెడ్ (Tennyson - Alfred-Lord) (క్రీ. శ. 1809-92) ఆంగ్ల మహాకవి. ఆంగ్ల ప్రభుత్వాస్థాన కవిగా నలువది

సంవత్సరము లుండెను. విక్టోరియన్ యుగప్రతినిధి. నవల మిక్కిలిగాఁ బ్రజల నాకర్షించు కాలము నం దీతఁడు తన యుదాత్తాశయములతోఁ గావ్యగానము గావించి ప్రజాభిమానమును జూరగొనెను.

ఈతని తొలికావ్యములలో శబ్దప్రియత్వ మెక్కువున్నను, తరువాతి కావ్యములలో నీతని ప్రతిభ సుస్పష్ట మాయెను. ది లేడి ఆఫ్ షాలట్ (The Lady of Shalott) ది లోటస్ ఈటర్స్ (The Lotus Eaters) మార్టిడి ఆర్థర్ (Morte D' Arthur) మున్నగునవి సుప్రసిద్ధములు. "రమణీయార్థ ప్రతిపాదకశబ్దః కావ్య" మనునూక్తి యీతనికిఁ వర్తించును.

20. కిప్లింగ్ — రుడ్‌యార్డ్:— (క్రీ. శ. 1865–1936) ఇతఁడు భారతదేశమున బొంబాయినగరమున జన్మించి పత్రికారచయితగా ప్రసిద్ధి గాంచెను. భారతీయములైన కథానిక లనేకములు రచించి, కీర్తి గాంచెను. అనేక పద్యకృతులను గూడ నీతఁడు రచించెను.

21 ఈడిపస్ టిరనస్:— (Oedipus Tyrannus) ప్రాచీనగ్రీకు దేశగాథలలో ఈడిపస్ రాజుగాథ మిక్కిలి విషాదాంతమైనది. ఈగాథ యూరోపియన్ సారస్వతములం దంతటను వ్యాపించి, తన ప్రభావమును నెఱపుటే కాక 'ఫ్రాయిడ్' అను జర్మను మనస్తత్వ శాస్త్రజ్ఞుఁ డేర్పఱచిన మనోవిభజన సిద్ధాంతములలో నొకదానికిఁగూడ ప్రాతిపదిక మైనది. 'ఈడిపస్ కాంప్లెక్సు' అను సాంకేతికపద మాధునిక మనస్తత్వ శాస్త్రజ్ఞులకు సుపరిచిత మైనది. "తల్లిపైఁగల యస్వాభావికమైన ప్రేమ" యని దీనియర్థము.

ఈగాథ నొక విషాదాంతరూపకముగా 'సాఫకిల్సు' 'అచిలిస్' 'యురిపిడీస్' మున్నగువారు వ్రాసినను, సాఫకిల్సు రచన యాధిక వ్యాప్తమైనది. పాశ్చాత్యాలంకారికులలోఁ బ్రాచీనుఁడగు 'అరిస్టాటిల్' తన యలంకారశాస్త్రము (Poetics) నం దీ రూపకమునుండి యనేకాంశము లుదాహరించెను.

'ఈడిపస్ రాజు' (Oedipus, the King) అను నీరూపక మత్యు ద్రిక్తమైనది. ఒక్క ఈడిపస్‌పాత్రయందే నాటకీయోద్వేగము కేంద్రీకరింపఁబడినది. అజ్ఞానావస్థలో మానవు డమానుష కృత్యములు గావించి, జ్ఞానోదయానంతర మా చర్యలపట్ల నే రీతిగా పశ్చాత్తప్తుఁడగునో యిందు క్రమముగా నున్మీలింపఁబడెను. ఈడిపస్ అజ్ఞాన చేష్టా ప్రదర్శనమునందు కన్న, సత్యపరిజ్ఞానానంతర పశ్చాత్తప్తబుద్ధిని చిత్రించుటలో సొఫకిలస్ తన నాటకీయ కళా ప్రతిభను బ్రదర్శించెను.

ఈడిపస్‌లో నొక యుక్తమాంశకలదు. ఆ యంశమే యాతనిని సత్యాన్వేషకుని గావించెను. ఈతఁడు తన తండ్రిని చంపి, తల్లిని పెండ్లియాడు నని యాకాశవాణి పేర్కొనినపుడు అది యసంభవమని భావించెను. అట్లు జరుగకుండ నుండవలయునని యాతఁడు తన యావచ్ఛక్తి నుపయోగించెను. కాని బలీయమగువిధి యాతని నా పాపమునకు గురిచేసినది. ఆకాశవాణి వాక్కులలోని యాథార్థ్యమును తెలిసికొనుటకై రాజా కృషి చేయుకొలఁది, యది యాతనికి దుర్లభమైనది. కడకు విధి యాతనిని కబళించినది. ఆతని దుష్కృత్యము లాతనికి క్రమముగా విదితమైనవి. ఆకాశవాణి వచనములను, దైవజ్ఞుని జోస్యము నాతఁ డంగీకరింపక తప్పలేదు. వెంటనే యాతఁడు తన నేత్రద్వయమును బెకళించుకొనెను. ఈ రూపకమునం దొక యర్థాంతరము ద్యోతమాన మగును. ఒకప్పుడు తన బాహ్యదృష్టికి గోచరమగునదియే సత్యమని విశ్వసించిన మానవుఁడు, తదతీతమగు సత్యమున్నదనియు, నది యాంతర దృష్టికి లభించు ననియు, తెలిసికొని "యింక నే నీ ప్రపంచమున దర్శింపఁ దగిన సౌందర్యము లేద"ని బాహ్యదృష్టిని నిరసించును.

తన దుష్కృత్యమునకుఁ బశ్చాత్తప్తుఁడై యంధుడైన ఈడిపస్ రాజ్యమును విసర్జించి, విధివిహితము ననుసరించి, వైభవోపేతముగ మరణించెను.

22. మాల్ఫీరాణి (The Dutchess of Malfi) రచయిత: జాన్ వెబ్‌స్టర్ (క్రీ. శ. 1580-1638) విషాదాంత రూపకము; క్రీ. శ. 1613 లో ప్రథమ ప్రచురణ.

మాల్ఫీరాణి భర్తృహీన. ఈమె సంపద లపహరింపవలయునను కుటిల బుద్ధితో నీమె సోదరు లీమెను తిరిగి వివాహమాడ కుండునట్లు కఠినముగా శాసింతురు. ఈమె యంతఃపురమున నొక గూఢచారిని గూడ నుంతురు. కాని మాల్ఫీ తన యంగరక్షకునే ప్రేమించి రహస్యముగ సంతానమును గూడ బడయును. మాల్ఫీ తన ప్రథమ సంతానమునకు వ్రాయించిన జాతక పత్ర మెట్లో గూఢచారి కందును. దాని నాతఁడు మాల్ఫీరాణి జ్యేష్ఠ సోదరున కందించును. సోదరుఁ డెంత బలవంత పఱచినను మాల్ఫీ రహస్యమును భంగపఱుపక, తన ప్రియుఁడైన యంగ రక్షకు నేదో నెపమున, తన రాజ్యమునుండి పంపివేయును. కొన్నాళ్ల కాతని నొక సంకేత స్థలమున మాల్ఫీ కలిసికొనును. గూఢచారుని వలన సోదరి ప్రియుఁడెవరో గుర్తించి, జ్యేష్ఠ సోదరుఁడు మాల్ఫీతో తాను ప్రేమించిన వానిని సంహరించితినని, యిదే యాతని హస్తమని యొక మృత మానవ హస్తమును చూపించెను. అనంతర మీతఁడు గూఢచారి చే మాల్ఫీని చంపించును. కాని యాతని శ్రేమకుఁ దగినట్లు బహూకరించుటకు తిరస్క రించును. అందుల కాతఁ డసంతృప్తుఁడగును.

ఇట్లుండ, మాల్ఫీ ప్రియుఁడు, మాల్ఫీ యొక్క మఱియొక సోదరుని క్షమాభిక్ష నర్థించును. మాల్ఫీ హత్యానంతరము జ్యేష్ఠ సోదరునకు మతి చలించును. ఈతనిని పరిమార్చు తలంపుతో గూఢచారి ప్రమాదవశమున మాల్ఫీ ప్రియుని, కనిష్ఠ సోదరుని హత్య గావించును. ఇది తెలిసికొని పిచ్చివాఁడగు జ్యేష్ఠుఁడు గూఢచారిని చంపును. గూఢచారి తాను చనిపోవు లోపుగా, జ్యేష్ఠ సోదరునే యంతమొందించును.

ఇట్లీ రూపక మొక హత్యాకాండల విలయ తాండవము గావింపఁ బడినది.

23. మాక్‌బెత్ : (Macbeth) షేక్స్పియర్ మహాకవి రచిం చిన విషాదాంత రూపకములలో సుప్రసిద్ధము. (క్రీ. శ. 1606) స్కాటు దేశ చరిత్రలోని యొక ఘట్టము నాధారము చేసికొని యిది వ్రాయఁబడెను. 'డంకన్' అను స్కాట్లండు దేశాధీశునకు 'మాక్‌బెత్' 'బాంకో' యను నిరువురు సేనాధిపతులు కలరు. ఒక నాఁడు వీరు మువ్వురును నొక విప్లవము

వణచివచ్చుచుండిరి. అప్పుడు ముగ్గురు మాంత్రిక కన్యలు వీరి కెదురైరి. మాక్‌బెత్ కాడర్ ప్రాంతమునకు ప్రభువగునని, బాంకో సంతతికి రాజరికము లభించుననియు వీరు జోస్యముచెప్పుదురు. వెంటనే రాజు మాక్‌బెత్తునకు కాడర్ ప్రాంతము నొసంగెను. కాని యంతటితో నాతఁడు తనియలేదు. భార్యాప్రేరితుఁడై మాక్‌బెత్ తన నివాసమున కేతెంచిన రాజునునన్యాయ్యముగఁ జంపెను. రాజపుత్రులగు 'మాల్కమ్' 'డోనాల్బెన్' అనువారు పరారైరి. మాక్‌బెత్ రాజ్యాధికారము వహించెను. కాని మాంత్రిక కన్యలు బాంకో సంతతికె రాజ్యాధికార మబ్బుననిరి. ఈ జోస్యమాతనిని వేధించెను. దీనిని వమ్ముచేయ వలయునను దురాశ మాక్‌బెత్తును ప్రేరేచెను. బాంకో నాతఁడు హత్యగావించెను. ఆతని కుమారుని కూడ బలిగొనవలయునని యత్నించెను. కాని యాతఁడు తప్పించుకొని పోయెను. బాంకో, పిశాచమై మాక్‌బెత్‌ను బీడించెను. ఆతఁడు తిరిగి మాంత్రిక కన్యలను గలిసికొని, తన భవిష్యత్‌ను గూర్చి ప్రశ్నించెను. 'ఫైఫ్' ప్రాంతాధిపుఁడైన 'మాక్‌డఫ్' వలన నాతనికి ముప్పు వాటిల్లునని వారుచెప్పిరి. రాజపుత్రుఁడగు మాల్కమ్, మాక్‌డఫ్‌తో చెలిమిచేసి, మాక్‌బెత్‌ను జయింప నున్నాడను వార్త మాక్‌బెత్‌నకుఁ దెలియును. మాక్‌బెత్ ఒకనాఁడు హటాత్తుగా మాక్‌డఫ్ భార్యా నివాసముపై దాడిచేసి చంపెను. ఈ హత్యాకాండ విని మాక్‌బెత్ భార్య మనసు చలించి మరణించెను. మాక్‌డఫ్, మాల్కమ్‌లు మాక్‌బెత్ నెదుర్కొని చంపుదురు. మాల్కమ్ స్కాట్లండునకు రాజగును.

24. ఒథెలో (Othello) : షేక్స్పియర్ మహాకవి విరచించిన విషాదాంత రూపకములలో నొకటి. 'బ్రబాన్షియో' వెన్నిస్ శాసన సభ్యుఁడు. 'డెస్డిమోనా' యీతని కుమార్తె. ఈమె వెన్నిస్ రాజ్య సేనాధిపతియగు, 'ఒథెలో'ను ఆతని సాహసకృత్యముల కాకర్షితయై ప్రేమించెను. 'ఒథెలో' తన కూఁతు నపహరించెనని రాజునకు బ్రబాన్షియో ఫిర్యాదు చేసెను. రాజీ విషయమును గూర్చి విచారించుచుండఁగనే, టర్కులు సైప్రెస్సు నాక్రమింప నున్నారను వార్త వచ్చెను. అదియునుగాక డెస్డిమోనా-ఒథెలోలు పరస్పరము ప్రేమించుకొనిరని విదితమైనది. అందుచే బ్రబాన్షియో తన దుహితను అనాగరకుఁడైన ఒథెలోకు అప్పగింపక తప్ప

లేదు. తన ప్రియురాలితో ఒథెలో సైప్రెస్ పై దండయాత్ర సాగించెను.

ఒథెలో తనకు విశ్వాస పాత్రుఁడుగానున్న 'కాసియో'కి ఉన్నత పదవి నొసఁగి, అతనికన్న ననుభవశాలియు, నర్హుఁడునునగు 'ఇయాగో' మనస్సు నొప్పించెను. అందుచే నీతఁడు ఒథెలో హృదయమునందు ఈర్ష్యానలమును రగులు గొల్పెను. ఒథెలో డెస్డిమోనా శీలమును నిష్కారణముగా శంకించెను. ఇందుల కుపబలకముగా 'ఒథెలో' తాను ప్రియురాలి కొసగిన చేతిరుమాలను, 'కాసియో' వద్ద గాంచెను. డోలాందోళితుఁడైన 'ఒథెలో' యావేశములో డెస్డిమోనా కుతిక నులిమెను.

'ఇయాగో' కౌటిల్యము కడకు బయటు పడెను. ఒథెలో తన యవివేకమునకు పశ్చాత్తప్తుఁడాయెను. విషాద దోదూయమాన మానసుఁడగు 'ఒథెలో' ఆత్మహత్య గావించుకొనెను.

25. గెథె (Goethe): (క్రీ. శ. 1749-1832) జర్మన్ మహాకవి; నాటకకర్త; సారస్వత విమర్శకుఁడు; నవలాకారుఁడు; శాస్త్రవేత్త; సర్వతోముఖ ప్రతిభ గలవాఁడుగా కీర్తి గాంచెను. బాధ్యతగల ప్రభుత్వోద్యోగమును గూడ నీతఁడు నిర్వహించెను. వెలుతురునుగూర్చి, వృక్ష, జంతుజీవనములను గూర్చియు నితఁడు పరిశోధనలు గావించెను. అనేక గేయములను, ప్రేమగీతములను నాలాపించిన భావకవి. ఈయన రచన లనేకము యైరోపియన్ భాషలలోనికి పరివర్తన మందినవి.

26. వైట్ డెవిల్ (White Devil) (క్రీ. శ. 1608) జె. వెబ్‌స్టర్ రచించిన విషాదాంత రూపకము. అన్యభార్యాసక్తుఁడై యవినీతికిఁ బాల్పడి హతుఁడైన యొకానొకని గాథ.

27. జ్యూ ఆఫ్ మాల్టా (Jew of Malta) (క్రీ. శ. 1633) మార్లో రచించిన పద్యరూపకము. మాల్టా దేశాధికారిని, టర్కీ దేశాధిపతి, మాల్టాదేశమును తన కుపాయనముగా సమర్పింపుమని కోరెను. మాల్టా దేశాధికారి ఆకానుకను తద్వీపవాసులగు జ్యూలు సమర్పింపవలయునని యాదేశించెను. 'బరాబస్' అను ధనికుఁడైన యొక జ్యూ యీయాదేశమును దిరస్కరించెను. అపుడు ప్రభు వాతని సమస్త ధనమును హరించి, యాతని

గృహమును సన్యాసినులకు నిలయము గావించెను. ఇందుల కాతఁడు ప్రతీకారము కావించు బుద్ధికలవాఁడై హింసా కృత్యముల కుపక్రమించెను. ఇంతలో టర్కులు మాల్టా దేశము నాక్రమించిరి. కుపితుఁడైన 'బరాబస్' మాల్టా దుర్గవివరములను టర్కులకుఁ దెలియఁ జేసెను. అందులకు బహుమాన ముగా టర్కులు 'బరాబస్'నే మాల్టా కధిపతిఁ గావించిరి.

'బరాబస్' అధికారియై, టర్కు సేనాపతిని, అతని సైన్యమును సర్వనాశనము చేయ నిశ్చయించెను. క్రుంగిపోవునట్టి యొకానొక ప్రదేశ మున నీతఁడు టర్కుల కొక విందు నేర్పాటు గావించెను. కాని కడ కాతఁడే మోసగింపఁ బడెను. బరాబస్ ప్రమత్తతతో నా ప్రదేశమునఁ గూలి పోయెను. సలసల క్రాగుచున్నట్టి యొక తైలభాండమునందు కూలి బరాబస్ మరణించెను.

28. కింగ్ లియర్: (King Lear): (క్రీ. శ. 1606) షేక్స్పియర్ విరచిత విషాదాంత రూపకములలోఁ బ్రసిద్ధమైనది. ఇందలి కథావస్తువు విశేషముగా స్వోపజ్ఞకము కాకున్నను; షేక్స్పియర్ తన యసా ధారణ ప్రతిభా ప్రాభవముచే దీని నొక యపూర్వ రూపకముగాఁ జిత్రిం చెను. ఇది రచయిత సమకాలీన మనస్తత్వమునే ప్రతిబింబించు చున్నను, నిందలి విశ్వజనీనత, సర్వకాలీనత, కవిత, సాహితీ పరుల కుపాదేయ మైనవి.

'లియర్' బ్రిటన్ దేశపరిపాలకుఁడు; వృద్ధుఁడు; మూర్ఖుఁడు. ఇతనికి ముగ్గురు కుమార్తెలు. తన కుమార్తెలకు, తనపట్లఁగల ప్రేమో త్కర్షను బురస్కరించుకొని రాజ్యమును బంచిపెట్ట వలయునని సంక ల్పించెను. పెద్దకుమార్తె లిరువురును గపటపు ప్రేమ నటించిరి. కాని తృతీయపుత్రిక యథార్థవాదిని. తాను తన విధ్యుక్త ధర్మము ప్రకారము తండ్రిని ప్రేమింతునని యామె పేర్కొనెను. అందులకు 'లియర్' కోపోద్రిక్తుఁడై, తన పెద్దకూతుళ్ళ కిరువురకే తన రాజ్యము పంచిపెట్టెను. వీరిరువురును దండ్రిని, వాని శతాధిక యోధవర్యులతో సంరక్షింప వలయును. మూడవకుమార్తెను ఫ్రాన్సు దేశాధీశుఁడెట్టి కానుకలు కాంక్షిం పకయే వివాహ మాడెను.

లియర్ ఆశించినట్లు జరుగలేదు. లియర్ తనపుత్రికలచే న్యూనముగాఁ జూడఁబడెను. అవమానింపఁబడెను. తండ్రిపట్ల వారి ప్రవర్తన రానురాను దుర్భరమైనది. లియర్ యున్మాదియై యడవులఁ బట్టెను.

గ్లస్టరు ప్రభువు లియర్‌ను సానుభూతితో నాదరించెను. కాని యాతఁడు ఫ్రెంచివారితోఁ గలసి యాంగ్లదేశముపై కుట్రపన్నుచున్నట్లు విదితమాయెను. అందుచే లియర్ ద్వితీయ పుత్రికా భర్త, 'కారన్‌వాల్' యాతని గ్రుడ్లు పీకెను. ఆ సమయమున గ్లస్టరు విశ్వాస పాత్రులగు సేవకులు కారన్‌వాల్‌ను గాయపఱచిరి. గ్లస్టరు కుమారుఁడు ఎడ్గార్ తన తండ్రి కామరణాంతము పరిచర్య సల్పెను. లియర్ తన కడగొట్టు పట్టిని యాశ్రయించెను.

లియర్ పెద్దకుమార్తె లిరువురు, నొకరికొకరు తెలియకుండ నొకరు 'ఎడ్మండ్' అను వానినిఁ బ్రేమించిరి. ఎడ్మండ్, గ్లస్టరు ప్రభువున కధర్మతనయుఁడు. అప్పాచెల్లెండ్రకు ఈ ప్రేమ విషయమున మాత్సర్యము ముదిరెను. అగ్రజ తన సోదరికి విషమిచ్చి చంపెను. కడకుఁ దానుగూడ విషము త్రాగిచచ్చెను. ఇంతలో 'ఎడ్మండ్' ఫ్రెంచి రాజును జయించి, లియర్ మూడవ కూఁతును బంధించి యురితీయించెను. ఆ విషాదముతో 'లియర్' కూడ మరణించెను. ఎడ్మండ్ దౌష్ట్యము నంతయు నెడ్గార్ నిరూపించి, వధించెను. ఆంగ్లరాజ్యము కడకు లియర్ ప్రథమ జామాతకే సంక్రమించెను. ఇందనేక విషాద సంఘటన లీరీతిగాఁ బొందుపఱుపఁబడెను.

లియర్ విచిత్ర ప్రవర్తనను బ్రదర్శించు ప్రథమ, ద్వితీయ రంగములు, ఆతని యున్మాదమును వర్ణించు తృతీయ, చతుర్థ రంగము లత్యంత ప్రధానములు. షేక్స్పియర్ యుద్రిక్త కవితోల్బణమిందు విశేషముగా గాంచ నగును. ఇందలి నర్మసంభాషణము లతినిశితములు.

29 పెరిగోరియట్: (Pore Goriot) క్రీ.శ. 1835. 'బల్‌జాక్' అను సుప్రసిద్ధ ఫ్రెంచి రచయిత వ్రాసిన నవల. ఇందీ రచయిత ప్రతిభ అంతయు సువ్యక్తము. ఇందు భావతీవ్రత యధికము. దృశ్యముల మార్పు చక్కని యుత్కంఠ కల్గించును. వర్ణనలు వాస్తవికములు. ఇందలి

ప్రధానపాత్ర, 'గోరియట్' అను నుదారజనకుఁడు. ఇతఁడు తన కుమిత మించిన జనకప్రేమచే మరణింపవలసి వచ్చును. స్థూలముగాఁజూచిన 'కింగ్ లియర్' కును 'గోరియట్' కును కొన్ని సామ్యములు గోచరించును. ఇరువురును తమ దుహితలచే వంచింపఁ బడుదురు. అయినను 'లియర్' కున్న స్వాతిశయము; దురభిప్రాయములు; మానసిక విచ్ఛేదనము 'గోరియట్' నందు లేవు. లియర్ కథ విషాదాంతము. గోరియట్ గాథ యార్ద్రమధురము.

ఇది కేవలమొక ఉదారజనకుని గాథయే కాదు; ఫ్రెంచి వారి మనస్తత్వమున కొక ప్రత్యక్షదర్పణము.

30. మేడంబవరీ (Madam Bavory) ప్లాబర్టు గస్టావస్ (క్రీ. శ. 1821-80) అను సుప్రసిద్ధ ఫ్రెంచి నవలకారుని నవలలో నత్యుత్తమమని ఖ్యాతిగాంచిన దీ నవల. ఇది ఫ్రాంసు దేశయందలి మధ్య తరగతి ప్రజాజీవనమును బ్రతిబింబించును. ఈ రచయిత శైలిరమణీయము, నిశితమునైనది. ఈతని కథా కథన శిల్పము ప్రశంసనీయము. శీలచిత్రణము విశదము. ఈ నవల తత్కాల పాఠకవర్గమును విశేషముగ నుత్తేజిత లూగించినది.

'బవరీ' యొక వైద్యుఁడు. ఈతఁడు తనకంటె వయసుగల యొక యువతిని వివాహమాడును. ఈమె నిరాధారమైన శంకాస్వభావము వలన 'బవరీ' జీవితము విషాద భరితమైనది. ఒకనాఁ డీతఁడు ఒక రోగిని పరీక్షించెను. ఆతని చెంత 'ఎమ్మా' అను నాతని కూఁతురు కలదు. ఆమె యనన్య సౌందర్యము బవరీని ఆకర్షించెను. ఈ విషయు మీతని భార్య పసిగట్టినది. డాక్టరు నారోగి చెంతకుఁ బోనీకుండఁ జేసినది. అందుచే డాక్టరు కుటుంబమున నంతఃకలహములు చెలరేగెను. కాని డాక్టరు భార్య యింతలో మరణించెను. డాక్టరు 'ఎమ్మా'ను ప్రేమించెను. ఆమె తండ్రి యీ సంగతి గమనించి, తన కూతునిచ్చి వివాహము కావించెను.

ఎమ్మా భావుకురాలు. అధునాతన భావ సంస్కార. ఆమెకీ వైవాహిక జీవిత మాశించినంత యానందమును జేకూర్పలేదు. ఎప్పుడు మందుమాకులతోను; రోగులతోను నిమగ్నుఁడై యుండు బవరీ నీరస

జీవితము నందామె కేవగింపు కల్గినది. పారిస్ నాగరకతా వ్యామోహ పాశము లామె మానసమును బంధించినవి. డాక్టరిది తెలిసికొని ప్రదేశము మార్చెను. అక్కడ ఎమ్మాకు శిశూదయ మాయెను. ఎమ్మా కొంతకాల మీ శిశువుతో నానందముగ ప్రొద్దు బుచ్చెను. కాని యామె మానసిక పరిభ్రమణ మాగలేదు. కొన్నాళ్లొక న్యాయవాదిని, కొన్నాళ్లొక ధనవంతుని మోహించి, యెటుపోవుటకును దెన్నుగానక, వలలోఁ జిక్కిన పిట్టవలె తన్నుకొన్నది. విపరీతముగ ఋణములుచేసి, డాక్టరు ననేకరీతుల బాధించినది. తాను వలచిన వారెవరును నామెకు విశ్వాస పాత్రులుగ ప్రవర్తింపలేరి, కడకు 'ఎమ్మా' విషము త్రావి మరణించినది. డాక్టరు నీమె యవినీతి వర్తనమును గుర్తించెను. మృత్యురూపులగు సాహుల చేఁజిక్కక, డాక్టరు మృత్యువాతఁ బడెను.

31. రెండవరిచర్డు: (క్రీ.శ. 1377-99) ఇంగ్లాండు దేశపు రాజు.

32. రినాన్ (Renan Ernest) (క్రీ. శ. 1823-92) ఫ్రెంచి విద్వద్రచయిత; సారస్వత విమర్శకుఁడు; వేదాంతి; భాషావేత్త; చరిత్ర కారుఁడు. తన కాలమునందు విశేషప్రఖ్యాతి ప్రాబల్యము సంపాదించిన ప్రముఖవ్యక్తి. తొలుత సనాతన మతవిద్య నార్జించినను, క్రమముగా నీతని కందు విశ్వాసము క్షీణించెను. భౌతిక శాస్త్రములందు, సంఘ సంస్కారమునందు నితని కభిలాష వృద్ధినొందినది. బైబిల్‌పై నీతఁడు చారిత్రిక పరిశోధన గావించెను. 'జీసస్ జీవిత' మను నీతని గ్రంథము సమకాలీను లలోఁ గొంత సంచలనమును గల్గించెను. కేవలహేతు వాద ప్రచోదిత మైనను, నీతని రమణీయశైలి పఠితల నాకర్షించును. మతచరిత్రపై గల యాధునిక భావముల కీతఁడు కొంతకారకుఁడన నగును. క్రీ. శ. 1873లో నితఁడు "యాంటిక్రైస్ట్" అను గ్రంథమును రచించెను.

33. యాంటిక్రైస్ట్: ఏసుక్రీస్తుని సామాన్య మానవునిగా నిరూ పించు కథ.

34. నీరో (Nero):- (క్రీ. శ. 54-68) రోమన్ చక్రవర్తి జూలియో-క్లాడియన్ వంశమునందు తుదివాఁడు, క్రూరత్వమునకు, మూర్ఖత్వ

మునకుఁ బెట్టినది పేరు. ఇతఁడు కొంత సామర్థ్యముకల కళారాధకుఁడు. నటకుఁడు. క్రీ. శ. 64 లో నితఁడు రోమునగరమును దహింప నాజ్ఞనిడి, అదిదహింపఁబడు చుండఁగా సంగీతముతో వినోదించెనఁట! చివరకితనిపై ప్రజలు విప్లవించిరి. దాని నదుపులోనికి తేలేక నీరో ఆత్మహత్యకుఁ బాల్పడెను.

35. లుడ్ విగ్ ఆఫ్ బవేరియా:- బవేరియా దేశపుప్రభువు. కళాప్రియుఁడు.

36. రెండవ చార్లెస్ (Charles II.) ఇంగ్లాండు దేశప్రభువు. (క్రీ. శ. 1660-85) ఆంగ్ల నవలకారుఁడగు స్కాటు తన 'పెరిల్ ఆఫ్ పీక్' 'వుడ్ స్టాక్' అను గ్రంథములం దీతని శీలమును జక్కఁగాఁ జిత్రించెను.

37. ఆఱవ జేమ్సు (క్రీ. శ. 1603-25) ఆంగ్ల దేశాధిపతి. రాజకీయ సంబంధమగు ననేక గ్రంథములను వ్రాసిన మేధావి.

38. మొదటి జేమ్సు (క్రీ. శ. 1394-1437) స్కాట్లండు దేశాధీశుఁడు. ఇతఁడు ఫ్రాంసు దేశమునకు వెడలుచుండ, పట్టువడెను. తదాది నితఁడు ఆంగ్లావనిలో పందొమ్మిదేండ్లుండి విశేషముగు పాండిత్యము నార్జించెను. పద్యకృతు లనేకము రచించెను.

39. ప్రథమ చార్లెస్ (క్రీ. శ. 1625-49) ఆంగ్ల దేశప్రభువు.

40. అలెగ్జాండరు (క్రీ. పూ. 356-323) యవన సార్వ భౌముఁడు. ఘనుఁడని బిరుదమందెను. అరిస్టాటిల్ శిష్యుఁడని ప్రతీతి. ప్రపంచాధిపత్యమునకై యీతఁడు జైత్రయాత్ర సాగించెను. హిందూ దేశము వఱకు నీతని యాత్రసాగినది. క్రీ. పూ. 323 లో బాబిలోనియా వద్ద జ్వరగ్రస్తుఁడై తన 32 వ ఏట నితఁడు మరణించెను. ఈతనిని గూర్చి యనేక జనశ్రుతులు కలవు.

41. నెపోలియన్ - బోనాపార్టు: (క్రీ. శ. 1769 - 1821) ఫ్రెంచి సైనికోద్యోగిగా తొలుత పనిచేసి, క్రమక్రమముగా ఫ్రెంచి సామ్రాజ్యాధిపతియైన మహామహుడు. 'వాటర్ లూ' యుద్ధమున నాంగ్లేయులచే పరాజితుడై పట్టువడి, సెంట్ హెలీనా ద్వీపము నందు మరణించెను. ఇతఁడు మహామేధావి. ధీరోదాత్తుఁడు.

42. జోన్ ఆఫ్ ఆర్క్: (క్రీ. శ. 1412-31) ఒక సామాన్య ఫ్రెంచి వ్యవసాయదారుని కూఁతురు. నిరక్షరాస్యురాలు. అయినను నేడవ ఛార్ల్సు కాలమునందు, ఆంగ్లేయ పాలనమునుండి ఫ్రాంసు దేశమును రక్షించుటకై యష్టకష్టములు పడిన సబల. కాని ఫ్రాంసు దేశభక్తులే యీమె నాంగ్లేయులకు పట్టింతురు. ఫ్రెంచివారే యీమె యకలంక శీలమును శంకించి, మాయలాడి యని యనుమానించిరి. ఇట్టి మహావీర నారీమణి నాంగ్లేయులు కఠినముగా నిలువున దగ్ధమొనర్తురు. ఈమె యుజ్జ్వల చరిత్ర అనేక కవులకు కవితావిషయమైనది.

43. మాజిని (క్రీ. శ. 1805-72) ఇటలీ దేశభక్తుఁడు. విప్లవ ప్రబోధకుఁడు. ఇతఁడు రాజకీయ విద్రోహిగా పరిగణింపఁబడుటచే కొన్నాళ్లు ఫ్రాంసుదేశమునందు, కొన్నాళ్లు లండన్ నగరమునందుండి, ఇటలీ దేశవిముక్తి కనేకోపాయములు యోజించెను. 1848 లో సంభవించిన విప్లవోద్యమమునం దీతఁడు రోమునగరమునకు విచ్చేసెను. కాని తిరిగి వెంటనే అజ్ఞాతవాసుఁడు కావలసి వచ్చెను. ఇటలీ దేశవిముక్తి నీతఁ డెంత కృషి సల్పినను అదిఫలించలేదు. అయినను నీతని యచంచల దేశభక్తి యపూర్వమనక తప్పదు.

44. గారి బాల్డి: (క్రీ. శ. 1807-82) సుప్రసిద్ధుడైన ఇటలీ దేశభక్తుఁడు; జాతీయ వీరుఁడు. రాజకీయ కారణములచే నీతఁ డజ్ఞాతవాసము కావించుచు, దక్షిణ అమెరికా, అమెరికా సంయుక్త రాష్ట్రాదులయందు సంచరించెను. తరువాత ఇటలీ కేతెంచి, స్వచ్ఛంద సైన్యము నేర్పఱచి, ఆస్ట్రియాపై దండెత్తెను. సిసిలీ నీతఁడు స్వాధీన పఱచుకొనెను. చివరకు రోముమీఁద కూడ నీతఁడు దండయాత్ర సాగించెను. ఈతని శౌర్య సాహసము లత్యద్భుతములు. ప్రపంచ మన్ననలను బడసినవి.

45. కావర్: సార్డినియన్ ప్రభుత్వమునకు (క్రీ. శ. 1852-9) క్రీ. శ. 1860-1; సంవత్సరములలో ప్రధానమంత్రిత్వము వహించెను. ఇతఁడు సార్డినియా కంతర్జాతీయ గౌరవ ప్రశస్తులను గడ్డించెను. పశ్చిమ రాజ్యములతో పొత్తుచేసి రష్యా నెదిరించెను. ఇతఁడు తన రాజకీయ నైపుణ్యముచే ఇటలీరాజ్య సమైక్యతకు కృషిసల్పెను. ఇతఁడు విప్లవ వాదికాఁడు.

46. అచిలిస్: (Achilles) ఇలియడ్ (Iliad) అను పాశ్చాత్యేతిహాస నాయకుఁడు. పెలియస్ (Peleus) థెటిస్ (Thetis) అను వారలకు కుమారుఁడు. ట్రోజన్ యుద్ధమునందు సమాన ధైర్య సాహసములు ప్రదర్శించిన గ్రీకు వీరాగ్రేసరుఁడు. ట్రోజన్ యుద్ధమునం దితఁడు హతమౌనని గుర్తించి, తల్లి నుమ కారముతో అచిలిస్‌నకు ఆడువేషము వేసి, అంతఃపురమున దాచినది. ఈతని సాహాయ్యములేనిది 'ట్రాయ్' నగరము లభింపదు. కావున 'యులిసిస్' అను వీరుఁడు, వ్యాపారివేషము దాల్చి, యంతఃపురముచొచ్చి, ప్రచ్ఛన్న వేషుఁడైనను, ఆయుధములతోఁ బనిచేయు చున్న 'అచిలిస్'ను గుర్తించి, యుద్ధమునకుఁ గొంపోయెను. అచిలిస్ 'ట్రాయ్' వీరుఁడగు 'హెక్టారు'ను జంపి, పీనుఁగును రథచక్రములకు బంధించి, గ్రీకునౌకలవద్దకుఁ దెచ్చెను. చిన్నతనములో నీతనితల్లి, యితనిని స్టెక్సునదిలో ముంచినది. తన్మూలమున నీతఁడు వజ్రకాయుఁడైనాడు; కాని పాదములు పట్టుకొనుటచే కడ కీతని మరణ మాప్రదేశమున నాయుధములు తగులుటచే సంభవించినది.

47. 28. చూచునది.

48. ఒఫెలియా: షేక్స్పియర్ 'హామ్లెట్' రూపకము సంబంధి విషాదాంత స్త్రీ పాత్ర. ఈమె తొలుత 'హామ్లెట్' చే ప్రేమింపఁబడి, తరువాత కఠినముగాఁజూడఁబడెను. ఈమె జీవితము విషాదగ్రస్తముకాఁగా; కడకు ఆత్మహత్యగావించుకొని మరణించెను.

49. ఆండర్సన్ – హాన్స్‌క్రిస్టియన్: (Anderson Hans Christian) (క్రీ. శ. 1805-75) డేనిష్‌కవి; నవలకారుఁడు; నాటకకర్త

ఈతని అద్భుతకథలు (Fairy Tales) క్రీ. శ. 1835 నుండి 1872 మధ్యలో ఆంగ్లదేశమున ప్రచురింపఁబడెను. వీని మూలమున నీతనికి అంతర్జాతీయ ప్రతిష్ఠ లభించెను.

50. క్లైటెమ్ నెస్ట్రాస్: (Clytem nestras) ఆర్గోస్ రాజగు 'అగమెమినాన్' భార్య. అగమెమినాన్ ట్రోజన్ యుద్ధమునుండి తిరిగి వచ్చిన పిమ్మట నీమె తన విలాసభర్తతోఁగూడి, అసలుభర్తను జంపినది. అది సహింపఁజాలక 'ఒరిస్టస్' అను అగమోమ్‌నాన్ కుమారుఁ డీమెను హత్యగావించెను.

51. విట్టోరియా కొరంబోనా (Vittoria Corombonas): జె. వెబ్‌స్టర్ రచించిన విషాదాంతరూపక నాయిక. ఈ రూపకమునకే 'వైట్ డెవిల్' అని నామాంతరము. ఈ కథ వెనుక పుటలలో నీయఁబడినది.

52. బియాట్రిస్ జోన్నాస్ (Beatrice Joannas): జర్మను సారస్వతమునందలి పరుషస్త్రీ పాత్రగా మాత్రమే యీమెను గుఱించి తెలిసినది.

53. సోఫకిల్సు: (Sophocles): (క్రీ. పూ. 496-406) గ్రీకు రూపకకర్త. సిద్ధహస్తుఁడు. గ్రీకుల కారాధనీయుఁడు. ఈతని విషాదాంత రూపకములు వ్యక్తిస్వాతంత్ర్యమును వ్యక్తీకరించునవి. ఈతని రూపక నాయకులు కేవల విషాదోపహతులు కారు. అనివార్యమగు విధి విలాసమును ధైర్యసాహసములతో ననుభవించుటకు వెనుదీయరు.

ఈతఁడు 123 రూపకముల వఱకు రచించినట్లు ప్రతీతి. కాని అందు ఏడురూపకములే యిపుడు లభించుచున్నవి. అందును ఈడిపస్ (ఈకథ వెనుకపుటలలో నీయఁబడెను) ఆంటిగాన్, అజాక్స్ ముఖ్యములు.

కవియగు నీతఁ డున్నత ప్రభుత్వోద్యోగమును గూడ నిర్వహించెను. రూపకప్రదర్శన మహోత్సవములలో నీతఁడు ప్రథమబహుమాకృతి నందుకొనెను. ఒక పర్యాయ మీతఁడు తన గురువగు 'అచిలిస్' ను

గూడ నాటకపు పోటీలలో గెలువగల్గెను. ఈతని భాష సంయమనము కలది; శక్తిమంతమైనది. ధ్వని మర్యాదవిలసితము.

గ్రీకు నాటకాభివృద్ధి కీతఁడు దోహదము చేకూర్చెను. ఒకే రంగమున తృతీయ పాత్రాప్రవేశము నీతఁడే తొలిసారి ప్రవేశపెట్టెను. తన నాటకనాయకుల నీతఁడు మానవత్వమునకు సన్నిహితులను గావించెను. నాయకుఁడు తన మనోభావములను ప్రేక్షక లోకమునకు విశదమొనర్చు నిమిత్త మీతఁడు రంగముపై నాత్మహత్యలనుగూడ కావించు నట్లొనర్చెను. ఇది సాహసోపేతమగు మార్పు. తా నొక కవిననియే కాక, విజ్ఞాన భిక్షా ప్రదాతనని, విద్యావేత్తననియు నీతఁడు సంభావించెను. సాంఘిక, మత, రాజకీయ విషయముల నీతఁడు చాకచాక్యముతో తన రూపకములందు కళాత్మకముగ మలచెను.

54. రాసిన్ – జీన్ (Racine-Jean): ఫ్రెంచి విషాదాంత రూపక రచయిత. చిన్నతనమున కొన్ని పద్యము లల్లినను, నీతఁడు క్రమముగా రూపకకర్తగా చిరయశస్సు నార్జించెను. ఆంద్రోమేక్ (Andromache) ఫైద్రా (Paedra) మున్నగు విషాదాంత రూపకములు విశ్వవిఖ్యాత మైనవి.

55. ఆర్ధర్: షేక్స్పియర్ రచించిన కింగ్ జాన్ (క్రీ. శ. 1547) అను చారిత్రక రూపకములోని రాజకుమారుఁడు. ఈ రూపక మందలి ప్రధానాంశము, పసివాఁడగు ఆర్థర్ హత్య.

56. కాన్స్టెన్స్: ఆర్థర్ తల్లి కాన్స్టెన్స్ దుర్భరహృదయ వేదనయే కింగ్ జాన్ రూపక మందలి విషాదచ్ఛాయ.

57. షెల్లీ (P. B. Shelly): (క్రీ. శ. 1792–1822) ఆంగ్ల భావకవులలో నగ్రగణ్యుఁడు. అభ్యుదయవాది. నవవైతాళికుఁడు. అనేక గద్య పద్యకృతులను, నాటికలను రచించి, భావచైతన్యము నొసగూర్చిన ధీరుఁడు. భాషా శాస్త్రవేత్తకూడను.

58. విచ్ ఆఫ్ అట్లాస్ (Witch of Atlas):(క్రీ. శ. 1820) షెల్లీకవి రచించిన పద్యకృతి. 'అపొలో' కొమార్తె దివ్యజీవన మిందలి

విషయము. ఈమె క్రూర మృగములను మచ్చికఁజేయును. తన మంత్ర శక్తితో అద్భుతమగు నౌకను నిర్మించుకొని విహాయస వీధిలో విహరించును. భౌతిక దేహానిగూఢమగు పవిత్రాత్మను సందర్శించి, యానందించును. సౌందర్య జీవుల నామె యాశీర్వదించును. సౌందర్య హీనులగు వారిని ఈమె వికృత జీవులగునట్లు శపించును. ఈమె స్వేచ్ఛా విహారిణి.

59. సింథియా: (Cynthia) కీట్సుకవి విరచిత 'ఎండిమియన్' (Endymion) అను పద్యకృతిలోని చంద్ర దేవతా కాంత. ఈమె 'ఎండిమియన్' అను మతిహీనుఁడైన యాదవ యువరాజును ప్రేమించును. ఆతనితో కొన్నాళ్ళు కాపురముచేసి, విసుగుఁజెంది, కడ కాతనిని విసర్జించి వెడలుట యిందలి కథ. ఇందలి కల్పనము ప్రశంసనీయము. అయినను కథా కథనశిల్పము పరిణతముకాదు.

60. క్వీన్ మాబ్ (Queen Mab): (క్రీ. శ. 1813) షెల్లీ తన పదునెన్మిదవయేట రచించిన లఘుకావ్యము. ఇందు విశేషమగు శిల్పసంపద లేకున్నను షెల్లీలోఁ గల్గిన భావపరిణామక్రమమును గుర్తించుటకిది ప్రాతిపదిక. 'మాబ్' అను దేవరాణి 'ఆన్థి' యను నొక దేవతాయువతికి ప్రపంచ పూర్వచరిత్ర చూపించును. పూర్వ ప్రపంచ దుస్థితికి హేతువులు వివరించును. కవి యీ దేవతా ముఖమున 'రాజులను' పూజారులను, రాజకీయ జీవనులను నిశితముగ విమర్శించును. వీరినేకాక యనేక సంస్థలను, వ్యాపార విధానములను; క్రైస్తవమత నీరసపు పద్ధతులను కవి దూయ పట్టును. భవిష్యత్కాలమున ప్రపంచ మభ్యుదయము నందుననియు; అందు జీవితము ప్రేమ పరిఫుల్లమౌననియు కవి తన పరిత్యాగము నిందు పరికటించెను.

61. ప్రామెథ్యూస్ అన్ బౌన్డు (Promotheus unbound) : (క్రీ. శ. 1820) షెల్లీ కవీశ్వరుని నాల్గంకముల గేయ రూపకము. మానవోత్తముఁడగు 'ప్రామెథ్యూస్' బంధితుఁడై, పీడింపఁబడును. ధైర్యసాహసోపేతుఁడు; సహనసద్భావ విలసితుఁడు నైన యితఁడు అసూయాద్వేషైక జీవియగు 'జూపిటర్' పెట్టెడి బాధలకు గాని, బెదిరింపు

లకుగాని లొంగడు. భూదేవికి వరపుత్రుడు, ప్రకృతిదేవికి వరుడునైన యీతడు దైవముచే రక్షింపబడును. కడకు నిర్ణీతకాలమున డెమోగార్గన్ అను విశ్వశక్తి స్వరూపుడేతెంచి, 'జుపిటర్'ను సింహాసనచ్యుతుని గావించును. 'హెర్క్యులస్' 'ప్రమోత్యువస్' ను విముక్తిగావించి, సింహాసనమున ప్రతిష్ఠించును. అప్పటినుండి సర్వసౌఖ్య ప్రదమగు ప్రేమ పాలన మారంభమౌను.

62. తుపాను (Tempest) : షేక్స్పియర్ రచించిన సుఖాంత రూపకము. 'మిరండా' 'పాిస్పరో'యను వాని ముద్దులపట్టి. పాిస్పరో మిలాన్ దేశాధీశుడు. నిరంతర తాంత్రిక గ్రంథపఠనాసక్తుడు. ఈతని దుష్టసోదరుడితనిపై కుట్రపన్ని ద్వీపాంతరవాసుని గావించును. ఇందు నేపాల్సురాజుకూడ నాతనికి సాయపడును. ఒకనాడు పాిస్పరో తన తాంత్రిక విద్యామహిమచే సముద్రమున తుపాను చెలరేగించి తన సోదరుడు, నేపాల్సురాజు, అతని కుమారుడు ఫెర్డినాండు పయనించు పడవను తుత్తునియలు గావించును. వారినందఱను ద్వీపమునకు జేర్పించి ఏరియల్ మూలమున నానాబాధలు పెట్టును. జనకేతర జగత్తు తెలియని మిరండా, యౌవనోద్రిక్తయై ఫెర్డినాండును ప్రేమించును. పాిస్పరో వీరిరువురి ప్రేమను ననేకరీతుల పరీక్షించును. ఫెర్డినాండు ననేక కష్టములకు గురిసేయును. ఇంతలో పాిస్పరో సోదరుడు నేపాల్సురాజు తమ కష్టములకు కారణము గుర్తించి, ప్రాస్పరోను క్షమాభిక్ష నర్థింతురు. అందఱు మిలాన్ చేరుదురు. అక్కడ ఫెర్డినాండు - మిరాండాల వివాహము జరుగును.

విజయ భారతీ ప్రెస్, తెనాలి

